చేతివేళ్ళు ఐదూ ఒక్కటిగా కలిస్తే
అవుతుంది పిడికిలి. అందులో వుంది గొప్పబలం. ఇలాగే...



# జండూ పంచారిష్ట




ు ఆయుర్వేద టానిక్‌ల
మ్మిత మిశ్రణం. మీ జీర్ణశక్తిని
ంపొందింపజేస్తుంది.

కువగా, జబ్బులకు కారణం జీర్ణశక్తి లోపించడమే. వాటి
క్షణాలు వేరువేరైనా, ఫలితం ఒక్కటే — జీర్ణశక్తి క్షీణించడం,
ోగ్యం చెడిపోవడం.

ండూ పంచారిష్ట ఐదు మహాత్వపూర్ణమైన ఆసవములు, అరిష్టముల
ు్రమం — అశ్వగంధారిష్ట, లోహాసవము, దశమూలారిష్ట,
మారీ ఆసవము మరియు అంగూరాసవము. జండూ పంచారిష్టలో
ఐదింటి మిశ్రమం జరిగినపుడు ఒక విశిష్టమైన, శక్తివంతమైన
ానిక్ తయారవుతుంది. ఇది మీ జీర్ణశక్తిని పటిష్ఠం చేస్తుంది.
ండూ పంచారిష్ట ఆకలిని అధికం చేస్తుంది కూడా.
ుకు తెలిసిందే కదా ఆరోగ్యమే మహాభాగ్యం!

**జండూ పంచారిష్ట**
ఐదు ఔషధములతో
కూడిన జీర్ణకారి టానిక్

ZP/16/173 TEL

# చక్రవ్యూహం పై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన 'వయ్యస్సారెస్' గారి నవల 'చక్రవ్యూహం' పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న అయిదింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## ఎలాంటి మార్పు రావాలి?

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

సమకాలీన రాజకీయవ్యవస్థకు అద్దంపట్టిన నవల 'చక్రవ్యూహం'. ఎన్ని వ్యూహాలైనా పన్ని తమ పదవిని పదిలంచేసుకోవడం నేటి రాజకీయ నాయకుల పాలసీ. అందుకోసం వారు పన్నే వ్యూహ, ప్రతివ్యూహాలలో ఎంతమంది అమాయకుల ప్రాణాలు ఆహుతి అయినా వారికి చింతలేదు. నేటిరాజకీయ నాయకుల జీవితాలకు గవర్రాజుపాత్ర ఒక ప్రతీక. తన ప్రేయసి కోరిక తీర్చడంకోసం ఆకస్మిక పర్యటన ఏర్పాటుచేసుకొని పూలమాలలు వేలంవేయగా వచ్చినడబ్బుతో నెక్లెస్‌కొని యిచ్చి మురిసిపోయిన గవర్రాజు ఆ ప్రేయసి, కంట్రాక్టరు వీరభద్రం తన్నులోబరచుకోడానికి విసిరిన వల అని తెలుసుకోలేకపోవడం విచిత్రంగా ఉంది. కంట్రాక్టర్లు, రాజకీయనాయకులు కుమ్మక్కై ప్రజాధనంతో ఆటలాడుకుంటూ ప్రజాస్వామ్యాన్నే అపహాస్యం చేస్తున్న విధానం, చలివేంద్రాలు, టీబంకులు, మురికివాడలు తగలబెట్టించడాలులాంటి కుళ్ళురాజకీయాలతో ప్రజల ప్రాణాలను పణంగాపెట్టి తమప్రాబల్యాన్ని పెంచుకోడానికి రాజకీయనాయకులు చేసే కుతంత్రాలు ఈనవలలో చక్కగా వర్ణింపబడ్డాయి. ధనస్వామ్యం, రౌడీయిజం, అధికారపీఠానికి సోపానాలుగా మారిన ఈరోజుల్లో పోలీసువ్యవస్థ రాజకీయనాయకుల చేతిలో కీలుబొమ్మకావడంలో ఆశ్చర్యమేమీలేదు. రాజకీయనాయకులు, కంట్రాక్టర్ల చేతుల్లో పావుగా వాడుకోబడిన మోహిని చివరకు వారినే పావులుగా మార్చి రాజకీయాలలో ముందుకుదూసుకుపోవడం ఆసక్తికరంగా ఉంది.

నేటిరాజకీయనాయకుల జీవితాలను యధాతథంగా చిత్రీకరించగలిగిన రచయిత నేటివ్యవస్థలో ఎలాంటి మార్పును తేగోరుతున్నారో సూచ్యంగానైనా చెప్పకపోవడం ఒకపెద్ద లోపం. వార్తాపత్రికలు ప్రజాస్వామ్యానికి రక్షణగా నిలిచి అవినీతి నిర్మూలనకు పాటుబడుతున్నాయి. ఎన్నోకుంభకోణాలను వెలికితీసి రాజకీయవ్యవస్థను ప్రక్షాళితం చేయడానికి జర్నలిస్టులు చేసే కృషి ప్రశంసనీయం. నవలలో అనంత్‌పాత్రద్వారా ఆకృషికి దోహదం చేస్తారని భావించిన మాకు నిరాశే మిగిలింది.

—టి. వెంకటరామయ్య, దగదర్తి

## అభిలషణీయమైన నవల

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

ముప్పై రూపాయలు పెడితేకాని, నవలరాని ఈరోజుల్లో కేవలం మూడురూపాయలకే నెల నెలా నవరసాలొలికించే నవలలను అందించి, సొంత లైబ్రరీ ఏర్పాటుకు వీలుకల్పించటం ఒక ఎత్తు అయితే, నవలలను సమీక్షించే అవకాశం పాఠకులకు ఇవ్వడం మరొకఎత్తు. ఈరెండు ప్రక్రియలు అనితరసాధ్యాలు. నూతన సంవత్సర కానుకగా అందించిన 'చక్రవ్యూహం' నిస్సందేహంగా మంచినవల. నేటి కుహనా రాజకీయాలు, రాజకీయనాయకుల పోచుకోలు వాగ్దానాలు నవలలో చక్కగా విశ్లేషించబడ్డాయి. అయితే నవలంతా ఒకకోణంనుంచే ఫోకస్‌చేయబడి, పరిధిని తగ్గించి

ముఖచిత్రం: భాస్కర్

వేసింది. నేతిబీరకాయలాంటి మన ప్రజాస్వామ్యంలో నేటి నగటుమానవుడు ఉన్న అనేకసమస్యలకు తోడుగా అదనంగా రాజకీయనాయకుల కుతంత్రాలకు, కుత్సితాలకు బలయిపోతున్నాడు. తనకున్న 'ఓటు' హక్కే 'కాటు' గా మారే దౌర్భాగ్యపు స్థితిలోఉన్నాడు నేటి పౌరుడు. ఈ నాయకుల అండదండలతో కులరక్కసి విరగబడి నవ్వుతూ, ఎంతవచ్చిగా స్వైరవిహారం చేస్తోందో మనందరం చూస్తూనే ఉన్నాము. ఈ సెక్యులర్ రాజ్యంలో ప్రజల ప్రాణాలకు సెక్యూరిటీ లేదు. ప్రజల ఆస్తులకు భద్రతలేదు. ఈ విపత్కర పరిస్థితులలో భీతావహ ప్రజానీకానికి రాజకీయాల గురించి ఆలోచించే అవకాశం దాదాపులేదు. "స్వలాభం నుంచే రాజకీయం పుట్టింది. అవసరం దాని ఊపిరి. అవకాశం దాని గుండెకాయ" ఇది ఈనవలలోని గవర్రాజుగారి సిద్ధాంతమే కాదు, నేటి రాజకీయ నాయకులకెవరికైనా అదే వర్తిస్తుంది. పోలీస్ యంత్రాంగం అధికారపార్టీకి అతీతంకాదని ఈనవల స్పష్టీకరిస్తుంది. రాజకీయాల్లో సెక్స్‌పాత్ర ఎంతబలంగాఉందో 'మోహిని' పాత్ర తేటతెల్లం చేస్తుంది. గవర్రాజులాంటి చీడపురుగులవల్లనే రాజకీయాలు అంతగా భ్రష్టుపట్టిపోతున్నాయి. నవలలో చెప్పినట్టు 'రాజకీయం ఒక రావణ కాష్టం. దానిని నమ్ముకొని బతికేవాడికి, హంతకుడికి ఆట్టే తేడా వుండదు' ఇది నగ్నసత్యం! ప్రస్తుత రాజకీయాలకు ఈనవల ఓ అద్దం.

–సత్యరాజ్, జి.మామిడాడ

## రాజకీయ కాలజ్ఞానం

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

'**చ**క్రవ్యూహం' నేటి సమకాలీన రాజకీయవ్యవస్థకు దర్పణంపట్టిన అత్యుత్తమరచన. నిన్న కాక మొన్న భగ్గుమన్న విజయవాడ గుండె మంటలింకా చల్లారలేదు. వీధిగూండాలకు, దోపిడీమూకలకు రాజకీయస్థాయిని కల్పించిన అథమస్థాయి రాజకీయసంస్కృతి యొక్క విషఫలితాలను సభ్యసమాజం చవిచూసింది! 'శవ' రాజకీయాలను రెచ్చగొట్టి అమాయకప్రజల ఆస్తులను, ప్రాణాలను కొల్లగొట్టి జరిపించిన దారుణ మారణహోమం ఎలా మరచిపోగలం!!

ఇలాంటి అధిపతినాన్న విపత్కరపరిణామాలను ఈ రచయిత ఎంతో ఆశ్చర్యకరంగా ముందుగానే ఊహించి, మనకందించిన రాజకీయకాలజ్ఞానమే 'చక్రవ్యూహం' నవల. రచయిత కనబరచిన ముందుచూపు... సామాజిక స్పృహ బహుధాప్రశంసనీయం.

ఈనవలలోని పాత్రలు, సంఘటనలు కేవలం కల్పితాలని ఎవరూ అనుకోనవసరంలేదు. త్రివిక్రమరావు పెంచి పోషించిన 'చలివేంద్రాల రాజకీయం' అందరికీ సుపరిచితమైనదే! వీధిగూండాలు వర్గాలుగా ఏర్పడి, కులాలరంగు పులుముకుని, రాజకీయం ముసుగు తగిలించుకొని పోటీలుపడి జాతీయపతాకాలను ఆవిష్కరిస్తుంటే, భరతమాత ఆత్మఎంతగా క్షోభించి ఉంటుందో! రాజకీయ గూండాల రక్తసిక్తమైన చేతుల్లోపడి త్రివర్ణపతాకం ఎంతగాకుంచించుకుపోతుందో!!

ఈ ముష్కరుల బలప్రదర్శనకు దేవుళ్లను కూడా వాడుకున్న సందర్భాలనేకం! నవలలో త్రివిక్రమరావు శ్రీరామనవమి ఉత్సవాలు జరిపించి తన రాజకీయ బలప్రదర్శన కావించిన విధంగానే రాజకీయగూండాలు విజయదశమి, శివరాత్రివంటి పర్వదినాలను, ఉత్సవాలను తమ పశుబల ప్రదర్శనకు ఎలా ఉపయోగిస్తున్నారో అందరికి తెలును!

ఈ కుహనా రాజకీయాల ఫలితమే మోహిని, మందాకినివంటి సరికొత్త స్త్రీజాతి ఆవిర్భావం! రమణీ రాజకీయంతో పైకివచ్చిన ఎందరో బడానాయకులీనాడు ఈదేశ ప్రజల భవితవ్యాన్ని శాసిస్తున్నారు! దేవుడా... రక్షించు నాదేశాన్ని!!

ఇంతమంచి నవలను అందించిన రచయితకు మా హృదయపూర్వక అభినందనలు!!

–కె.వసంతలక్ష్మి, మండపాక

## నేటి వ్యవస్థకు ప్రతిబింబం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

శ్రీవైయ్యస్సారెస్‌గారి రాజకీయ నగ్నసత్యాల "చక్రవ్యూహం" మాకు ఎంతగానో నచ్చింది.

సమకాలీన రాజకీయనాయకుల జీవితాలకు అద్దంపట్టి వారి నిజజీవితాలను కళ్ళకు కట్టినట్టు చూపడంలో రచయిత కృతకృత్యులయ్యారు

ఈ నవల చదువుతున్నంతసేపూ విజయవాడలోనూ, కోస్తా జిల్లాలలోను జరిగినదారుణ మారణకాండ గుర్తుకు వచ్చింది. రాజకీయ రాబందుల పోట్లాటలో చివరికి రక్తధారలుస్రవిస్తూ నేలకొరిగిపోయేది సామాన్య ప్రజానీకమే తమ స్వార్థంకోసం ప్రజల ఆస్తులను ధ్వంసం చేస్తూ, అడ్డం వచ్చినవారిని నిర్దాక్షిణ్యంగా మట్టుపెడుతూ కల్లోల వాతావరణాన్ని సృష్టించి వికటాట్టహాసము చేసే ఈ శవరాజకీయ నాయకులకు అంతమెప్పుడు? ప్రజల కన్నీళ్లతో తమ దాహం తీర్చుకునే ఈ దుర్మార్గుల నుండి ఇక విముక్తి రాదా? దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొంటుంటే, తమ వాటాకోసం ఎదురు చూస్తూ కావలికాయడం తప్ప ఈ రక్షకభటులు ఆపదసమయంలో ప్రజల ధన, మాన, ప్రాణాలకు రక్షణ కల్పించలేరని అర్థం అయ్యింది.

గడిచిన ఆ సంఘటనల తాలూకూ ఆవేదన, ఆక్రోశం ఈ నవల చదివినంతసేపూ మా గుండెల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంది. ఇటువంటి నవలలు, కథల ద్వారానైనా ప్రజలు యదార్థాన్ని గ్రహించి తమ రక్షణను తామే చేపట్టగలరనీ, వంచకుల మాటలకు మోసపోక వారి నిజస్వరూపాలను తెలుసుకొని వారికి బుద్ధిచెప్పగలరనీ మా ఆశ.

రచయిత తమ నవలలో చూపిన పాత్రలు, సన్నివేశాలు నేటి రాజకీయాలకు దగ్గరగానే ఉన్నాయి. త్రివిక్రమరావులాంటి ప్రతిపక్షనాయకులు ప్రజాసేవ ముసుగులో చేసే దుర్మార్గాలు రచయిత చాలా సూటిగా వివరించారు. అధికార పార్టీలో ఉంటూ అవినీతిపనులకు పాల్పడిన గవర్రాజులాంటి మంత్రులు ఎందరో ఉన్నారు. పదవిని పట్టుకొని వేళ్ళాడుతూ, పెళ్లాంలేకపోయినా పదవి ఉంటేనే చాలని అనుకొనే రాజకీయ గబ్బిలాలు ఉన్నంతకాలం మన ప్రజాస్వామ్యం కంపుకొట్టకమానదు. ప్రభాకర్, రాఘవ వంటి పోలీస్ ఆఫీసర్లు ఎంగిలి కూటికి ఆశపడక తాము తీసుకొనే జీతానికి ప్రతిఫలంగా తమ ఉద్యోగ ధర్మం నిర్వర్తించినప్పుడే ప్రజలకు సంఘవిద్రోహశక్తుల నుండి రక్షణ! చివరగా అనంత్ వంటి విలేఖరులు పిరికిగా తెరచాటుకాకుండా కథ నడిపిననాడే మనకు ఈ తుచ్ఛరాజకీయాల నుంచి విముక్తి.

—కాళహస్తి నాగేశ్వరరావు, విశాఖపట్టణం

## విశ్లేషణాత్మక రచన

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'చక్రవ్యూహం' "ప్రస్తుత రాజకీయ వ్యవస్థకి అద్దంపట్టే సన్నివేశాలతో... అద్యంతం ఉత్కంఠతో చదివించే నవల" అన్న'చతుర' పరిచయవాక్యాలకి సరిగ్గా సరిపోయింది. రాజకీయ చదరంగం, వ్యూహరచన, ప్రజలు పావులవటంవంటి పారిభాషిక పదాలకి అర్థంతెలియచెప్పిందీ నవల.

ఒక రవ్వల నెక్లెసకోసం ప్రారంభమైన ఎత్తుగడల ఆట సృష్టించిన మారణహోమం, సామూహికబలి ఇంకా మరవుకురాని నిన్నమొన్నటి హింసాకాండను, శవ రాజకీయాన్ని గుర్తుకుతెచ్చింది.

రాజకీయం అండదండలతో ప్రజారక్షణకు అయువుపట్లయిన అధికారులు చేస్తున్న అధికార దుర్వినియోగం, అనధికారికంగా చేతులు మారుతున్న ప్రజాధనం, పార్టీల మధ్యన ఫుట్‌బాలవుతున్న సామాన్యుడు- అందర్నీ కళ్లకు కట్టించిన పాత్ర పోషణ, సన్నివేశరచన అనితరసాధ్యం. రచయితకున్న రాజకీయ పరిజ్ఞానం, విశ్లేషణ, పరిశోధనాత్మకత అడుగడుగునా అగుపించింది. పాలకపార్టీని ప్రతిపక్షాలు దుయ్యబట్టినా, అధికారపార్టీ ప్రతిపక్షాలను దుమ్మెత్తిపోసినా నష్ట పోయేదెవరు- సామాన్య ప్రజానీకమే కదా! అన్న ఎరుక ఇటు ప్రజల్లోను, అటు నాయకుల్లోను లుప్తమైపోతున్న ఈరోజుల్లో రావలసిన, రాతగిన రచన ఇది.

ఆలోచించడానికూడా వ్యవధినివ్వని వేగం ఈ నవల ప్రత్యేకత. ప్రతి సన్నివేశంలోను "ఇంతమామూలుగా దైనందిన జీవితంలో మనం మోసపోతున్నామా? ఇంత సాధారణంగా మనకన్యాయం జరిగిపోతోందా?" అను

కుంటూనే ఊపిరి బిగించి చదివేసి, ఉక్కిరి బిక్కిరైపోతాడు పాఠకుడు.

ఇప్పటి వ్యవస్థలో సాంఘిక సంస్కరణలకన్నా రాజకీయ సంస్కరణ, ప్రక్షాళనల ఆవశ్యకత ఎంతైనా ఉంది. వాటిని చాలా సూటిగా అందించి, రాజకీయాలు తెలియనివాళ్లకు కూడా తెలిసేలా చెప్పి, విజయం సాధించారు రచయిత. రసవత్తరమైన శైలి, పటిష్టమైన సన్నివేశకల్పన, విషయ విశ్లేషణ పుష్కలంగా ఉంది. కుటుంబగాథ, స్త్రీ స్వేచ్ఛ ఈరకపు ఇతివృత్తాల ఉరవడి నుండి మరో ముఖ్యదైనందిన సమస్య అయిన నేటి రాజకీయాలవైపు పాఠకుల దృష్టిమళ్లించిన 'చతుర'కు అభినందనలు.

—**ఆర్. లక్ష్మివిజయ్**, హనుమకొండ.

## కాపీకథ

*(రు. 25/- బహుమతి పొందిన లేఖ)*

**జ**నవరి చతురలో 'చతుర కథలు' శీర్షికన ప్రచురింపబడిన "అతిథి సత్కారం" కథ ఇదివరకే ఎక్కడో చదివినట్లు అనిపించింది. ఆలోచించగా ప్రసిద్ధ సంగీతదర్శకుడు భూపేన్ హజారికా దూరదర్శన్‌కోసం నిర్మించి, సమర్పించినటీవీసీరియల్ '**లోహిత్‌కినారె**'లో ఈ కథ ప్రసారమైందని గుర్తుకు వచ్చింది. ప్రసిద్ధ అస్సామీ ఆ సీరిస్‌లో పదమూడు కథల్ని ప్రసారం చేశారు. అందులో యిది మొదటి కథ.

పాత్రల పేర్లు మినహా 'సుచంద్ర'గారు యింకేమీ మార్పుచేయలేదు. అందులో క్లర్క్ భార్య చేపలు తెమ్మంటుంది. దానిని సుచంద్ర గారు 'స్వీట్లు'గా మార్చారు- అంతే!

ఇది యితర భాషా కథగాబట్టి దీనిని ఎవరూ గుర్తించరు అనుకొని వుంటారు ఈ రచయిత. అయితే దూరదర్శన్ కార్యక్రమాల్ని విడవకుండా చూసే ప్రేక్షకులు కొంత మందయినా ఉంటారని ఊహించకపోవడం రచయిత పొరపాటు. ఇక ముందు యిలాంటి కాపీ కథల్ని వారు రాయరనీ, మీరు ప్రచురించరనీ ఆశిస్తున్నాను-

-కరుణాకర్, పమిడిపాడు

# చతుర

సంపుటి:12 మార్చి 1989 సంచిక:2

"అవును...నేన్నీకు తాళికట్టిన భర్తనుకాదుకదా విడాకులి స్తానో విడిపోతానో అని భయపడటానికి... సరస్వతి ఇంట్లోంచి బాలూని వెళ్ళగొట్టగలిగాను, అది నా ఇల్లు గనుక. మరి ఈ ఇంట్లోంచి? ఇది నీ యిల్లుకదా! మరోమాట మాట్లాడితే నన్నేవెళ్ళిపొ మ్మనగలవు" నిష్ఠూరంగా అన్నాడతను.

నివ్వెరపోయిందామె.

అతన్ని చేసుకున్నపుడే ఇలాంటి జీవితం గడపబోతున్నట్లు అర్థంచేసుకున్నదానిలాగా అన్నిటికి సర్దుకుపోతోంది వాదించ దు... తర్కించదు.

అయినా ఇలాంటి కల్లోలాలు వస్తూనే ఉన్నాయి. అవలా చెలరేగటానికి ఏమిటి కారణం?

మూడుముళ్ళ బంధాన్ని డబ్బుతో ముడిపెట్టే సమాజంలో నాలుగో ముడికి ప్రాధాన్యత ఎందుకొచ్చింది? ఎలావచ్చింది? దాని ఫలితాలేమిటి ?— అనేది సమగ్రంగా చర్చిస్తూ, సజీవ పాత్రలతో నిరూపించిన "సంచారి" వేసిన 'నాలుగోముడి'

ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల

# నాలుగోముడి

'సంచారి'

టేప్‌రికార్డర్‌లో నుండి మంద్రస్థాయిలో నాదస్వరం వినిపిస్తోంది. అది భక్తులొచ్చే సమయం కాదు కనుక దేవాలయప్రాంగణమంతా నిశ్శబ్దంగా వుంది. అక్కడొక పెళ్ళి జరుగుతోందంటే నమ్మటం కష్టమేకానీ అది మాత్రం నిజమే. వధూవరులు, పురోహితుడు, ఒకరిద్దరు ఆలయసిబ్బందీ తప్పిస్తే, ఆహూతులు వేళ్ళమీద లెక్కపెట్టగలిగినంతమంది కూడా లేరు. పురోహితుణ్ణి తప్పిస్తే మిగతావాళ్ళంతా దాదావు వధూవరుల సమవయస్కులే.

పెళ్ళికొడుకు చేతి గడియారంకేసి చూసుకుని, తన పక్కన నిలుచున్న ఒకతని వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. వెంటనే ఆ నిలుచున్నతను-

"కాస్త అనవసరమైన తంతు తగ్గించి, మూడు ముక్కల్లో మూడుముళ్ళూ వేయించెయ్యండి" అన్నాడు, పురోహితునితో.

"బాబూ ఎంతలేదన్నా... శాస్త్రోక్తమైన వివాహమంటే అరగంటపాటైనా అవుతుందయ్యా మరీ అంత తొందరపడితే ఎట్లా?" అన్నాడు పురోహితుడు, చదువుతున్న మంత్రం ఆపేసి.

మరొకతను బద్ధకంగా బైటకు, గుడి ఆవరణదాటి నడిచి సిగరెట్ ముట్టించుకున్నాడు.

"...సుముహూర్తకాలే దాంపత్యో శోభన ద్రవ్యాణి శిరసి నిక్షిపేత్..." చదువుతున్న మంత్రం ఆపేసి,

"సరే- జీలకర్ర, బెల్లం తేలేదన్నారుకదా, ఇలాగే కానిచ్చేద్దాం" అంటూ, మళ్ళీ మంత్రోచ్చాటన ప్రారంభించాడు పురోహితుడు.

" ధృవం తే రాజా వరుణో

దృవందేవో బృహస్పతి

దృవంతే ఇంద్రశ్చాగ్నిశ్చరాష్ట్రం..."

కాసేపటికి వధూవరులిద్దరూ పూలమాలలు మార్చుకున్నారు.

నెమ్మదిగా సమయం గడుస్తోంది. దేవాలయంలో అలుముకున్న వాతావరణం విచిత్రంగా అనిపిస్తూంది. పెళ్ళి సరదా వధూవరుల్లోగానీ, పెళ్ళికొచ్చిన సంతోషం ఆహూతులలోగానీ లేదు. ఎవరెవరికి ఏయే తొందరపనులున్నాయో లేవోగానీ, ఎప్పుడెప్పుడు ఆ తంతు పూర్తయితే ఎప్పుడెప్పుడు బైటపడదామా అన్నట్టువున్నారంతానూ.

"...నామ్నీం కన్యాం

చతుస్సాగర పర్యంతం

దేవ బ్రాహ్మణేభ్యో తుభ్యమహం

సంప్రదదే నమః...

...బాబూ, నీ గోత్రనామాలైనా తెలుసా అదీ యిలాగే కానిచ్చేయమంటావా?" ప్రశ్నార్థకంతో ఆగాడు పురోహితుడు.

"అవన్నీ అవసరం లేదండీ వీలైనంత త్వరగా కానిచ్చెయ్యండి" పెళ్ళికొడుకు బదులుగా మరొకతను జవాబిచ్చాడు.

ఒకసారి నశ్యం పీల్చుకుని, తుమ్మురాకుండా ముక్కు నలుపుకుని మళ్ళీ పెళ్ళితంతు మొదలుపెట్టాడు పురోహితుడు.

మంగళవాయిద్యాలు వినిపిస్తున్న టేప్‌రికార్డర్ మౌనవ్రతం చేపట్టడంతో, ఒకతను దానిదగ్గరకెళ్ళి, కేసెట్‌ను తీసి, మరోవైపు పెట్టి,

"అప్పుడే అరగంటయిందన్నమాట" అనుకున్నాడు టేప్‌రికార్డర్ ప్లేబటన్ నొక్కుతూ.

"నాయనా నేను చెప్పినట్టల్లా చెప్పు" అంటూ చెప్పటం మొదలుపెట్టాడు పురోహితుడు.

"ధర్మేచ..."

"ధర్మేచ..."

"అర్థేచ..."

"అర్థేచ..."

"కామేచ..."

"కామేచ..."

"మోక్షేచ..."

"మోక్షేచ..."

"నాతిచరామి"

"... ... ..."

కొంచెం నీళ్ళు తీసి, వధూవరులిద్దరినెత్తినా చల్లి, మంగళసూత్రం చేతిలోకి తీసుకొని,

"...శ్రీ మాంగల్య దేవతాభ్యోనమః..." చదువుకుంటూ, తనపనిలో తను మునిగిపోయిన పురోహితుడు పెళ్ళికొడుకుని పట్టించుకోలేదు.

అయితే పురోహితుడు చెప్పినట్టుగా పెళ్ళికొడుకు "నాతిచరామి" అని అనలేదన్న

విషయం ఎవ్వరూ గమనించలేదు, ఒక్క పెళ్ళి కూతురు తప్ప.

"నువ్వామాట అన్నప్పటికీ దానికి విలువుండదుకదా. నరే... అనకపోవటమే మంచిదనుకుంటా" అనుకుంటూ, "నాతిచరామి" అని తనలోతను అనుకుంది పెళ్ళికూతురు.

అదే ఆలోచిస్తూ భారంగా నిట్టూర్చబోయినంతలో, తన నుదుట అతను కుంకుమదిద్దటం గమనించి, ఆలోచనల్లోంచి తేరుకొని ఈలోకంలోకొచ్చిపడింది.

మంగళసూత్రంతీసి, తనచుట్టూవున్న ముగ్గురు నలుగురిచేతులకు ఆనించి "భజంత్రీలు గట్టిగా వాయించండయ్యా" అలవాటుగా అనేసి, నాలిక్కరుచుకున్నాడు పురోహితుడు.

"నరేలెండి... మీమాటెందుక్కాదనాలి" అంటూ ఒకావిడ టేప్‌రికార్డర్ దగ్గరికెళ్ళి వాల్యూంకాస్త ఎక్కువచేసింది.

"నాయనా... మాంగల్యం జాగ్రత్తగా పట్టుకుని అమ్మాయిమెడలో మూడుముళ్ళూవెయ్యి" అని పెళ్ళికొడుక్కు మంగళసూత్రం అందించాడు పురోహితుడు.

అది రెండుకొనలూ రెండుచేతుల్తోపట్టుకుని, లేచి నిలుచున్నాడు పెళ్ళికొడుకు.

వివాహబంధం పెనవేనుకునేముందు క్షణంనుండే తలవంచడం నేర్చుకోకతప్పదన్నట్టుగా, మెల్లిగా తలకిందికివాల్చింది పెళ్ళికూతురు. ఆమె స్నేహితురాలొకామె పెళ్ళికూతురు జడను పైకెత్తిపట్టుకుంది.

"ఎంత లవ్‌మ్యారేజీ అయినా పెళ్ళితంతు ఇంతత్వరగా ముగించేసినవైనం నా అనుభవంలోమాత్రంలేదు. నరేకానీ, ముళ్ళు కూడా ఒక్కటేస్తానని అనకయ్యాబాబూ, శుభ్రంగా మూడుముళ్ళూ ముచ్చటగావేసెయ్ మరి" నవ్వుతూ అనేసి మంత్రోచ్ఛారణ ప్రారంభించాడు పురోహితుడు.

తలవాల్చిన పెళ్ళికూతురువైపు కొద్దిగా వంగి ఆమె భుజాలపక్కనుంచి రెండుకొనలూ మెడపైకిచేర్చి మంగళసూత్రం పట్టుకున్నాడు పెళ్ళికొడుకు.

"మాంగల్యం తంతునానేన..."

కుడివైపు కొనమీదగా ఎడమవైపు కొనను తీసుకొచ్చి అటుకొనను ఈ చేతికీ ఇటుకొనను ఆ చేతికి మార్చుకున్నాడు.

"... మమజీవనా హేతున..."

తనకంఠంమీదుగా గుండెలముందు వేళ్ళాడుతున్న మంగళసూత్రాన్ని వాలుచూపులతో చూస్తోంది పెళ్ళికూతురు.

"...కంఠేభద్నామినుభగే .."

మూడుముళ్ళూ మగవాడేవెయ్యాలి. అందులో ఒక్కముడైనా ఆడదివేయకూడదు. అంటే ఈ వివాహబంధాన్ని ముడివేసేది మగవాడేనన్నమాట. ఆడదిముడివడి మాత్రమే ఉండాలి. అది చిక్కుముడే అయితే దాన్ని విప్పుకునే అవకాశం కూడా ఆమెకులేదన్న మాట- అనుకుంటూ చిత్రంగా నవ్వుకుంది పెళ్ళికూతురు.

"... జీవేమ శరదాం శతమ్..."

అంతవరకూ ఒక్కముడికూడా వేయకుండా అలాగే పట్టుకునివున్న మంగళసూత్రం కొనల్లో కుడిచేతికొనను వదిలేసి, ఎడంచేతితో దాన్నలాగే పైకెత్తిపట్టుకున్నాడు పెళ్ళికొడుకు.

పెళ్ళికూతురు చప్పున తలెత్తిచూసింది అతనివైపు.

పెళ్ళికూతురు జడఎత్తి పట్టుకున్నామె, ఆ జడను వదిలేసి నిటారుగానిలుచుంది ఆశ్చర్యంతో.

"..మాంగల్యధారణ ము హూర్తనుముహూర్తమన్తూ" అనేసి నిటారుగా నిలబడిన పెళ్ళికొడుకువైపు చూశాడు పురోహితుడు.

ఎడంచేతిలోఉన్న మంగళసూత్రం మరోకొనను కుడిఅరచేతికి ఆనించి దాన్ని నెమ్మదిగా ఆ చేతిలోకి వదిలేసాడు పెళ్ళికొడుకు. కుడిచేతి గుప్పిడి ఒకసారిమూసి, తెరిచి పురోహితుని పక్కనున్న బియ్యంపళ్ళెంలో మంగళసూత్రం ఉంచేసి, నిటారుగా నిలుచుని ఎడంచేతిని ఛాతీమీదుగా మలిచి కుడిఅరచేత్తో మొహం తడుచుకుంటూ నిలుచున్నాడు.

పెళ్ళికూతురు కంగారుగాలేచి నిలుచుంది.

అందరూ విభ్రమంగా చూస్తున్నారు.

"అదేమిటయ్యా మూడుముళ్ళువేయకుండా..." అంటున్న పురోహితుణ్ణి మధ్యలోనే ఆపేసి.

"ప్లీజ్... మీరు ఆగండి" అని పెళ్ళికూతురువైపు తిరిగాడు-

"అయాంసారీ... మూడుముళ్ళూ నేనింతకుముందే ఒకసారివేసాను. ఆ విషయం నీకూ తెలును. ఈ నాలుగోముడి నేనువేయలేను" ఉద్వేగంతో అన్నాడు.

"అయితే... అయితే... ఇంతదూరం..." మాటలురాక తడబడసాగింది పెళ్ళికూతురు.

"ప్లీజ్... నువుచెప్పిందంతా ఒప్పుకున్నాను. అందులో మార్పేమీవుండదు. కానీ, ఇది మాత్రం నన్నడక్కు".

అతనిమాట పూర్తికాకమునుపే వక్కనున్న స్నేహితురాలి భుజంపై తలవాల్చి భోరుమందా పెళ్ళికూతురు. వెక్కివెక్కి ఏడుస్తున్న ఆమెను పొదివిపట్టుకుని భుజంపై నిమురుతూ నిలుచుండిపోయిందా స్నేహితురాలు. నిస్సహాయంగా నిలుచుండిపోయాడాపెళ్ళికొడుకు.

దిగ్గున నిద్రనుండిలేచి కూర్చున్నాడతను. తన వక్కనేవడుకున్న భార్యా, కొడుకూ నిద్రలేవకుండా మంచంలోంచి దిగి, ఫిల్టర్‌లోంచి నీళ్ళువంచుకుని తాగి, ముందుగదిలోకి నడిచాడు కలగురించే ఆలోచిస్తూ.

సిగరెట్ వెలిగించుకుని, నిస్సత్తువగా కుర్చీలోకూలబడిపోయాడు.

"నీకుచేసిన అన్యాయం చాలు. ఇంతఅవమానంమాత్రం చేయను" అనుకున్నాడు కలలోని పెళ్లికూతుర్ని తలుచుకుంటూ.



**అ**లుపొచ్చినట్టు ఆగిపోయిన కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లోంచి నిదానంగా బైటకు దిగి, ఎయిర్ బ్యాగ్ పాకెట్లోంచి సిగరెట్ పాకెట్ తీసి, ఓ సిగరెట్ వెలిగించుకుని ప్లాట్‌ఫామ్ దాటి బైటకు నడిచాడు ఆ యువకుడు.

నాదు జన్మ భూమికన్న నాకమెక్కడుందీ-అనే మాట ఎంత నిజం! వరంగల్ వదిలి హైదరాబాద్‌లో సెటిల్ అయినాక ఆరునెలల కిందట మొదటిసారి వచ్చినప్పుడూ యిలాగే అనిపించింది. ఈ ఆరునెలల్లో తను రావటం యిది నాలుగోసారి. అయినా ప్రతిసారీ అలాగే అనిపిస్తుంది-ఆలోచిస్తూ తాపీగా నడవసాగాడు.

చౌరస్తాలోకి రాగానే ఒక హోటల్లోకి నడిచి కూర్చున్నాడు. ఏదో ఆలోచనల్లో వుండి, సప్లయర్‌కు ఏదో తెమ్మని పురమాయించి మళ్ళీ తన ఆలోచనల్లో వడిపోయాడు.

"మీరు...మీరు...నువ్వు...రోనీ కదూ" ఎదురుగా వున్నతని మాటలు వినిపించగానే అతనికేసి చూసి, వెంటనే నవ్వాడు-

"కదూ ఏమిట్రా చందర్, నేనే" అన్నాడు.

"అమ్మయ్య., నేనిక్కడ కూర్చోగానే నువు దిక్కులు చూస్తుంటే నువ్వో, కాదో అనుకున్నాన్రా. ఏమిటి సంగతులు, హైదరాబాద్‌లో వుంటున్నావని విన్నాను. ఏం చేస్తున్నావ్, ఎప్పుడొచ్చావ్, ఏంటి సంగతులూ" గబగబా మాట్లాడాడు చందర్.

"ఏమీ లేదురా బాబూ. ఎమ్.ఏ.పూర్తయింది. రెండేళ్ళనుండి అయిదుద్యోగాలు చేశాను. పార్ట్‌టైంగా ఫ్రీలాన్స్ జర్నలిజం చేస్తున్నాను. జర్నలిజమ్ డిప్లొమా చేసి, ఏదైనా పత్రికలో చేరటమా లేక మరోసారి మరో ఎం.ఎ.రాసి, ఫస్ట్ క్లాస్ వస్తే, ఎమ్.ఫిల్‌లూ వగైరాలన్నీ చేసి లెక్చరర్‌కావటమా అని ఆలోచిస్తున్నాను. ఇంతకూ నీ సంగతులేంటి? ఎలా వున్నావ్, ఏంటీ కథ?" అన్నాడు రోనీ.

అంతలో టిఫిన్ పట్టుకొచ్చిన సప్లయిర్‌ని చూసి, తనక్కూడా టిఫిన్ తెమ్మని పురమాయించాడు చందర్. ఆ తరవాత తన సంగతి చెప్పటం మొదలెట్టాడు.

"మాదేముందిరా, నీలాగా చెట్టిడిచిన భూతంలాగా తిరగటానికి మాకు నీకున్న గట్స్ లేవు కదా. మా నాన్న చేస్తున్న అడ్తీ వ్యాపా

రంలోకే దిగాను. నాలుగేళ్ళయింది. నన్నూ స్వంతంగా చేసుకోమంటున్నాడు. ఇవ్వాళ నా పెళ్ళాంతో పోట్లాటపెట్టుకుని, ఇదిగో యిలా హొటల్‌కు తగలడ్డాను''

"ఒరి దరిద్రుడా, పెళ్ళికి నన్ను పిలవనేలే దేంరా?''

"పిలిచినా నువ్వు రావని తెలునుకదా. అదీకాక అప్పుడు నువ్వెక్కడున్నావో నిజంగా తెలీదురా, ప్రామిస్''

చందర్‌కు కూడా టిఫిన్ రావటంతో యిద్దరూ తినటం మొదలెట్టారు.

"పిలిచినా నేను రానని తెలుసా? అంటే...కట్నం తీసుకున్నావన్నమాట. ఇంతకీ ఎంతకు అమ్ముడుపోయావ్‌రా భానుచందర్?''

"అమ్ముడుపోవడమేమిట్రా నీ మొహం. వాళ్ళు యిచ్చారు. నేను తీసుకున్నాను. అయినా, రేపు నా కూతురికి నేను మళ్ళీ యివ్వకపోతే నడుస్తుందంటావా?''

"అయితే, కూతురు కూడా పుట్టిందన్న మాట. త్రాష్టుడా, దుర్మార్గుడా, వెధవా, నాకు ఒక్క సంగతి కూడా తెలీదు. సరేగానీ, నీకు కూతురు పుడుతుందని ముందుగానే తెలుసుకుని, కట్నం తీసుకున్నానంటావు. మరి యిద్దరు కూతుళ్ళు పుడితే ఆ రెండో కూతురికి కట్నం ఎక్కణ్నించి తెస్తానంటావు? మరీ యిలా తయారయ్యావేంట్రా?''

"ఒరేయ్ రోనీ, నువ్వొక్కడివే మడిగట్టుకుని కూర్చుంటే లోకమంతా పునీతమయి పోతుందనుకుంటే ఎట్లారా? నాలాంటివాళ్ళే ఈ లోకంలో మెజారిటీలో వున్నారు. నలుగురితో నారాయణా అనుకుంటూ పోవటమే తప్ప, నీలాగా చేసే ధైర్యం ఎవడికుంటుంది? అయినా, నీ పెళ్ళయితే గదా, నీ కబుర్లన్నీ నిజమో కాదో తెలిసేది...''

"నోరుముయ్యరా గాడిదా. నీలాగా నేను చస్తే అమ్ముడుపోను. బాండ్ పేపర్ మీద రాసిస్తాను, దాచి పెట్టుకో ''

"అబ్బ, పోనీరా. ఇంతకూ ఎప్పుడొచ్చావ్, ఇంటికి వెళ్ళావా లేదా?'' అన్నాడు చందర్.

"రావటం యిప్పుడే. ఆరు నెలల్లో యిది నాలుగోసారి వరంగల్‌కు రావటం. ఇక ఇంటి సంగతి నీకు తెలీందేముంది, లాడ్జింగ్‌లో వుంటున్నాను.''

"అంటే మూడుసార్లు వచ్చి, నా దగ్గరికి రాలేదన్నమాట. అయిదారేళ్ళలో నన్ను మర్చిపోయావట్రా గాడిదా. అవున్రా, ఎమ్మేలూ, డిప్లమోలూ చెయ్యగానే నాలాంటి వాళ్ళు యింకెక్కడ గుర్తుంటారులే''

నవ్వి ఊర్కున్నాడు రోనీ.

కాస్సేపటికి హొటల్లోంచి, బైటపడి, చందర్ నుండి సెలవుతీసుకుని లాడ్జింగ్ దారిపట్టాడు.

★ ★ ★

"శివశంకరీ ఫిలింస్, ప్రొడక్షన్ నెంబర్ వన్, సీన్ ట్వంటీత్రీ, షాట్ ఫోర్, టేక్ వన్'

"క్లాప్'' మని శబ్దం చేసింది క్లాప్ బోర్డు.

అంతవరకూ గుండెలుగ్గబట్టుకున్న మయూరి ఆ టెన్షన్ అణచుకొని, పలకటం మొదలుపెట్టింది.

"చూడు ఇందూ నీ పొగరుకు తగినట్టే జరిగింది. ఇప్పుడెందుకే ఏడుస్తావ్. నాకు చెప్పులు తొడిగే అర్హత కూడా...''

"కట్' అని వినిపించటంతో గిర్రున తిరుగుతున్న కెమేరాతోపాటు మయూరి గొంతు కూడా ఆగిపోయింది అప్రయత్నంగా.

"కట్' అన్నమాట వినగానే అసంకల్పితంగా నటన ఆపేయటం సినిమా నటులకు మూణ్నాలుగు సినిమాలకే అనుభవమవుతుంది. అలాగే మయూరి కూడా నటన ఆపేసింది. కానీ ఆపేసిన మరుక్షణం మెదడు పనిచేయటం ప్రారంభించింది. ఎందుకంటే ఆ 'కట్' చెప్పింది మగగొంతు కాదు ఆడ గొంతు.

"ఏమయింది మేడమ్'' అంటూ అప్పటికే హీరోయిన్ దగ్గరికి పరిగెత్తుకొచ్చాడు దర్శకుడు.

"ఈ సీన్‌లో నేను బీదదాన్ననీ, సహజత్వం కోసమనీ నాకు పాలియస్టర్ చీర కట్టబెట్టి అఫ్టాల్ ఒక జూనియర్ ఆర్టిస్టుకు మైనూర్‌క్రేప్ చీరా? ఇలా అయితే నా అభిమానుల ముందు నా యిమేజ్ ఏం కావాలి? అయినా, అది నాతో మాట్లాడే డైలాగులు మరీ అంత అసహ్యంగా రాయించారేమిటి?'' విరుచుకుపడింది సరళ.

"మేడమ్, మీనాన్నగారికి వ్యాపారంలో

నష్టంవచ్చి, మీ కుటుంబం వీధుల పాల యింది. మీరు బాగా ఉన్నప్పుడు మీకంటే తక్కువస్థాయిలో వున్న స్నేహితురాలు, అంటే ప్రస్తుతం మీకంటే ఎక్కువస్థాయిలోఉన్న స్నేహితురాలు అప్పటి మీ ప్రవర్తనకు యిప్పుడు బదులు తీర్చుకుంటూందన్నమాట. మరో యిద్దరు స్నేహితురాళ్ళూ యిలాగే అన్న తరువాత హీరో దగ్గరికి..." అంటూన్న దర్శకుడి మాటల్ని మధ్యలోనే తుంచేసింది సరళ.

"అదంతా బాగానే వుందండీ. కానీ ప్రేక్షకులు మీ సీన్ ఎంత సహజంగా వుందీ - అని ఆ ఎక్స్‌ట్రా వేసుకున్న దుస్తుల్ని చూడరు. దాని ముందు నేను దిష్టిబొమ్మలా కనబడటం మాత్రమే చూస్తారు" గట్టిగా వాదించి, వెళ్ళి తన కుర్చీలో కూర్చుంది.

అంటే దానర్థం, యిక తను రాజీపడేదేమీ లేదని మాత్రమే.

చివరకు అరగంట తరువాత తీసుకొచ్చిన సిల్వర్ టచ్ చీరను, పర్సనల్ మేకప్‌మెన్ మరో అరగంటపాటు కట్టబెట్టగా, ఐదు నిమిషాలు డైలాగుల్ని సరిదిద్దించి, ఆ సీన్ పూర్తిచేసింది సరళ. షెడ్యూల్ ప్రకారం ఆ రోజు పూర్తికావలసిన మరో రెండు సీన్లు వాయిదా పడ్డాయి.

కాల్‌షీట్ పూర్తిచేసుకుని, కారువైపు వెళ్లబోతున్న సరళ దగ్గరికి హడావిడిగా పరుగెత్తింది మయూరి.

"మేడమ్ - ఇందులో నాతప్పేమీ లేదు. అయామ్ వెరీ సారీ" అంది, తప్పంతా తనదేనన్నట్టుగా.

అక్కడితో అహంపూర్తిగా సంతృప్తి చెందగా, లోలోపల నవ్వుకుని, పైకి మొహం వినుగ్గా పెట్టి,

"హీరోయిన్‌కన్నా అందంగా కనిపించాలని ప్రయత్నించకు. మరొకరెవరైనా అయితే నీకు ఉద్వాసన జరిగుండేది" అంటూ కారెక్కింది సరళ.

రివ్వున కారు దూసుకుపోయింది.

"నీ సెకండ్ గ్రేడ్ మొహానికి నువ్వేదో శ్రీదేవి లెవల్ హీరోయిన్‌వనుకుంటున్నట్టున్నావ్, పెంట మొహంముండా. నువ్వు చెబితే నన్ను మార్చరని నీక్కూడా తెలుసని నాకు తెలీదనుకున్నావా డర్టీ బిచ్" కసిగా అనుకొంది మయూరి.

హరి అని పరిచయమున్న అసిస్టెంట్ డైరక్టరు తన స్కూటర్ మీద డ్రాప్ చేయగా స్టూడియోనుండి ఊళ్ళోకొచ్చిపడి, అక్కణ్నించి బస్సులో హాస్టల్ చేరుకుంది.

రూంలోకెళ్ళేసరికి -

"ఏమయిందే మయూరి, యివాళ హీరోయిన్ సరళతో నీ సీన్స్ వున్నాయన్నావు" అని పలకరించిన రూంమేట్ ఆనందంతో -

'అదంతా పెద్ద రామాయణంగానీ ముందుగా తినేసి వద్దాం." అంది నీరసంగా బాత్‌రూంలోకి నడుస్తూ.

★ ★ ★

అప్పుడే ట్రెయిన్ దిగివచ్చిన రోనీ, తను ఎప్పుడూ దిగే లాడ్జింగ్‌కు చేరుకుని, ఫార్మాలిటీలన్నీ పూర్తయి పోగా, లాడ్జింగ్ యజమాని కోటీశ్వరయ్యతో మాట్లాడుతూ కూర్చున్నాడు.

అప్పుడే లోపలినుండి అక్కడికొచ్చిన ఒక పెద్దమనిషిని చూడగానే చప్పున లేచి నిలుచున్నాడు.

"కేకే అంకుల్, నన్ను గుర్తుపట్టావా?"

"అరే, కృష్ణకుమార్‌గారు మీ అంకులా" ఆశ్చర్యపోయాడు కోటీశ్వరయ్య.

"అవునండీ బాబూ" అన్నాడు రోనీ.

"ఒరే... నువ్వు-నువ్వు-అదేరా, నువ్వు రాణీగాడివి కదూ?"

"పో అంకుల్... ఇంకా నన్ను రాణీ అనే అంటున్నావు" అన్నాడు రోనీ.

"మీరిద్దరూ ఇంతకుముందే తెలుసా?" ఆశ్చర్యపోయాడు కోటీశ్వరయ్య.

"తెలుసా ఏంటి? మా ఇంట్లో నాచిన్నప్పుడు అద్దెకుండేవాళ్ళు అంకుల్‌వాళ్ళు. వరుసకు నాకు బాబాయ్ కూడా అవుతాడు అంకుల్"

"అయితే ఇక రూం ప్రాబ్లమ్ మీరూ మీరూ చూసుకోండి. రోనీగారూ... మీబ్యాగ్ బాయ్‌తో మీగదికి పంపిస్తాను" అన్నాడు కోటీశ్వరయ్య.

బ్యాగ్ అక్కడ వదిలేసి కృష్ణకుమార్‌తో అతని గదికి నడిచాడు రోనీ.

"అయితే పిన్నిని ఒక్కదాన్నే తీసుకొచ్చావా? చిట్టి చాలాపెద్దదై పోయుంటుంది

కదంకుల్. చంటిగాడు, చిట్టీ ఏం చదువుతు న్నారు?" ఉత్సాహంగా అడిగాడు రోనీ.

ఒక్కక్షణం మౌనంగా వుండిపోయి కొంచెం లోగొంతుకతో రహస్యం చెప్పినట్లుగా అన్నాడు కృష్ణకుమార్ –

"మీ శశిపిన్ని కాదు. ఆవిడ కులాసాగానే వుందిలే. విషయం తరవాత చెబుతానుగానీ నువ్వేమీ పిచ్చిప్రశ్నలు వేయకు. ఈ పిన్ని చక్కగా మాట్లాడుతుంది. నీకూ తనకూ మంచి కంపెనీ కూడా వుంటుంది"

ఆ మాటలకు తెల్లబోయాడు రోనీ. అతనన్న మాటలు మనసులోకి యింకేలోగా గది దగ్గరికి చ్చేశారు.

"ఏమిటి అప్పుడే వచ్చేశారు? ఏమైనా మర్చిపో....." అడగబోయి, రోనీని చూసి ఆగిపో యిందామె.

"ఈవిడే మీపిన్ని - రేవతి. ఇదిగో - వీడు మా నరసింహరావు అన్నయ్య కొడుకని చెబు తుంటానే వాడే! తెలుసుగా - వీడిపేరు రాణీ" – పరిచయాలు చేశాడు కృష్ణకుమార్.

రేవతీ, రోనీ నమస్కార ప్రతినమస్కారాలు చేసుకున్నాక రేవతి అడిగింది సందేహంగా –

"పేరేమిటన్నారు....?"

"అదా-మాఅన్నయ్య చిన్నప్పుడు వాళ్ళింటి పక్కనొక అమెరికన్ కుటుంబం వుండేదట. వాళ్ళబ్బాయి రోనీ అని మా అన్నయ్యకు మంచి స్నేహితుడు. వాళ్ళు కొన్నేళ్ళ తరవాత అమెరికా వెళ్ళిపోయారు. ఆ స్నేహితుని గు ర్తుగా వీడు పుట్టగానే వీడికి రోనీ అని పేరుపె ట్టాడు"

"బాబాయ్ వాళ్ళుచిన్నప్పుడు అంటే నాచి న్నప్పుడు మాఇంట్లోనే ఒక వాటాలో వుండేవా ళ్ళు. నేను తనను బాబాయ్ అని పిలవకుండా అంకుల్ అని పిలిచేవాణ్ణి. అందునా అంకుల్ స్నేహితులు పిలిచేపేరుతో 'కేకే' కలిపి 'కేకే అంకుల్' అంటుండేవాణ్ణి. అలా పిలవడం నాతో మాన్పించలేక నన్ను 'రాణీ' అని పిలిచి ఏడిపిస్తుండేవాడు అంకుల్" నవ్వుతూ వివ రించాడు రోనీ.

"వీడు కూడా నీలాగే కబుర్లపుట్ట. ఇద్దరూ శుభ్రంగా మాట్లాడుకోండి నాకు టైమయింది. నేను హనుమకొండదాకా వెళ్ళిరావాలి మరి" అని రేవతికి చెప్పి, "సాయంత్రం తీరిగ్గా మాట్లాడుకుందాం. సెవెన్ వరకూ ఎక్కడతిరి గినా ఆతరవాత మాత్రం తిన్నగా యిక్కడికొ చ్చెయ్" అని రోనీతో చెప్పి కృష్ణకుమార్ వెళ్ళి పోయాడు – "నువు టీ కావాలన్నట్టున్నావ్క దూ రేవతీ! ఇద్దరికీ పంపించమని చెప్పేసి వెళతాను" అంటూ.

"మా అంకుల్‌కి లేదుగానీ నాకు సిగరెట్ తాగటం అలవాటు. మరి మీరు ఏమీ అనుకో కూడదు" అంటూ సిగరెట్ వెలిగించాడు రోనీ.

రేవతి లేచి ఓమూలనున్న యాష్‌ట్రేతెచ్చి రోనీముందున్న మరోకుర్చీపైన పెట్టింది.

అప్పుడామెను కాస్త పరీక్షగా చూశాడు. మహాఅయితే తనకంటే ఒకటి రెండేళ్ళు పెద్ద దేమో లేక చిన్నదో. పాతికేళ్ళకు మించి మాత్రం వుండదు వయసు. తనకంటే సుమా రు ఇరవయ్యేళ్ళు చిన్నదాన్ని అంకుల్ మళ్ళీ ఎందుకు, ఎలా పెళ్ళిచేసుకున్నాడు? ఈమె మాత్రం ఎందుకని భార్యాపిల్లలూ వున్నవాణ్ణి పెళ్ళిచేసుకోవాల్సివచ్చింది? అసలు వీళ్లపెళ్ళి ఎప్పుడు జరిగింది? శశి పిన్ని ఒప్పుకుందా లేదా? – ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు రోనీ.

"మీటాపిక్ వచ్చినప్పుడల్లా నీగురించి చె బుతుంటాడు మీఅంకుల్. నువు బాగా కబుర్లు చెబుతావట. ఏమిటీ మౌనవ్రతంపట్టినట్టు న్నావు?" నవ్వుతూ అంది.

ఆమాటకు నవ్వేసి,

"ఏమీలేదు... మిమ్మల్ని ఆంటీ అని పిలిస్తే మరీ ముసలాళ్ళని పిలిచినట్టుంటుందికదా! మరి ఏమని పిలవాలా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"అయితే పిన్నీ అనే పిలువ్"

హఠాత్తుగా 'దేవదాసు'లో పార్వతి గుర్తుకొ చ్చింది రోనీకి. దాదాపు తన వయసే వున్నా పిన్నీ అని పిలవమని ఆరిందాలా చెబు తూంది. పెళ్ళిచేసుకోగానే ఆడవాళ్ళకు పెద్ద రికం వచ్చేస్తుంది కాబోలు - అనుకున్నాడు. తన పనికి ఎటూ ఫలానా టైం అంటూ ఏదీలేదు. అంతగా అయితే ఒకరోజు ఆలస్య మైనా ఫర్వాలేదు. ఇంత చక్కగా మాట్లాడుతు

న్న ఈ అమ్మాయి.... అమ్మాయిమిటి పిన్నికదూ... పిన్ని అని పిలవమన్నంత మాత్రాన అమ్మాయి కాకుండా పోతుందా, అసలు తన కంటే చిన్నదానిలాగా కనిపిస్తోంది.... ఈ ఆడవాళ్ళ వయసు ఖచ్చితంగా తెలుసుకోవటం కష్టమైన పనే... ఇంత నిర్మలంగా మాట్లాడుతూన్న ఈ యువతి.... తన పిన్ని సంసారంలో నిప్పులుపోసింది.... ఎందుకిలా జరిగిందో.... ఈ విషయమేమిటో తెలుసుకుంటేనే మంచిది.... కాస్సేపు మాట్లాడితే ఒకటి రెండు విషయాలైనా తెలియకపోవు....

"మీ శశికళ పిన్నితో బాగా చనువుగా వుండేవాడివా నువ్వు?"

రేవతి అడిగిన ప్రశ్నతో ఆలోచనల్లోంచి బైటికొచ్చాడు –

"మాపిన్నితో పరిచయముందా మీకు?"

"మీ అంకుల్‌ని పెళ్ళిచేసుకున్న తరవాత మీపిన్ని తెలియకపోవటమేం? ఆమాటకొస్తే మీఅంకుల్‌కన్నా ముందు ఆమెతోనే పరిచయం"

"అలాగా- నాకుతెలియదు. దాదాపు పదేళ్ళు ఒకేచోట వున్నాంకదా- పైగా అప్పుడు నేను చిన్నవాణ్ణి కూడానూ. పిన్నితో బాగా వుండేవాణ్ణి. అవునూ- ఎందుకలా అడిగారు?"

"ఏంలేదు. నన్ను చూడగానే - మాపిన్నికాపురంలో నిప్పులుపోసిన రాక్షసి, ఎంత చక్కగా తనను కూడా 'పిన్ని' అని పిలవమంటోంది - అన్న ఆలోచన వచ్చివుండాలే, అది ఎంత డీప్‌గా వుంటుందనేది- మీపిన్నికీ, నీకూ వున్న చనువును బట్టి వుంటుందని అడిగాను" నవ్వుతూనే అంది రేవతి.

"అబ్బే... అదేంలేదు" తడబడుతూ అన్నాడు రోనీ. లోలోపల ఆమె పరిశీలనాశక్తిని అభినందించాడు.

"ఏంలేదు? నన్ను రాక్షసి అనుకోలేదా లేక మీపిన్ని కాపురంకూలదోశానని అనుకోలేదా?"

తను చేసిన తప్పును ఎత్తి చూపిస్తూ చర్చిస్తూంది. మరి తెలిసి తెలిసీ అలాంటి పని ఎందుకు చేసివుంటుంది - అనుకున్నాడు రోనీ.

అంతలో లాడ్జింగ్ కుర్రాడు టీలు పట్టుకొచ్చాడు.

సగం కప్పు టీ పూర్తయ్యేవరకూ తను చెప్పాల్సిన జవాబును మనసులో జాగ్రత్తగా, అంటే అబద్ధాలతో కాదు ఆమె మనసు నొప్పించకుండా తను అనుకున్న మాటల్ని ఎలా చెప్పాలీ అని ఆలోచించి కూర్చున్నాడు. ఆతర్వాత తాపీగా చెప్పాడు -

"టు బి ఫ్రాంక్- మా అంకుల్ మరో పిన్ని- అని అనగానే అసలు ఆశ్చర్యపోయాను. ఆ తరవాత పిన్ని అంటే, మా పిన్ని వయసుకు కాస్త అటూ ఇటుగా వుంటుందనుకున్నాను. మిమ్మల్ని చూసిన తరవాత మీమీద........కాకా పడుతున్నాననుకోవద్దు- ఆఅలవాటు లేదు నాకు, నిజంగానే మీమీద ఒక సదభిప్రాయమే కలిగింది. మా అంకుల్.....రెండో భార్యగాకాక మీరు మరోవిధంగా తటస్థపడివుంటే మీతో చాలా ఫ్రీగా మాట్లాడివుండేవాణ్ని. సరే... మీరు కూడా ఫ్రీగా మాట్లాడుతున్నారు. కనుక యిప్పుడు రిలాక్సయ్యాను".

కొంచెం ఆగి, సిగరెట్ వెలిగించుకున్నాక చెప్పాడు- "మీరు చేసినపని ఏమిటో తెలిసేచేశారని మీ మాటల్నిబట్టే అర్థమవుతోంది....మీరే మీ అనుకోకపోతే....జస్ట్ బికాస్ యూ ఆర్ సో ఫెయిర్ అండ్ ఫ్రాంక్....అడుగుతున్నాను. ఆఫ్‌కోర్స్... అవుటాఫ్ క్యూరియాసిటీ....మా అంకుల్‌తో మీపెళ్ళి ఎలా జరిగింది....?"

సన్నగా నవ్వి చెప్పింది రేవతి -

"మీ అంకుల్నే అడుగు"

"అదేమిటి, అలా అన్నారు?"

"ఫస్ట్ ఒపీనియన్ ఈస్ బెస్ట్ ఒపీనియన్ అన్నారుకదా. ఈ విషయంలో మీ అంకుల్ చెప్పేదే ముందుగా విను. లేకపోతే నేను మరోలా చెబితే, మీ అంకుల్ యాంగిల్ కన్విన్సింగ్ అనిపించకపోయే ప్రమాదం వుంది కదా. మొదటి ఛాన్స్ మీ అంకుల్‌కే ఇచ్చెయ్యి"

"లేడీస్ ఫస్ట్ అంటారుకదా" నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు రోనీ.

"అది మాటలవరకే కదా ఎక్కడైనా. ఆడవాళ్ళదెప్పుడూ మగవాళ్ళ తరవాత బతుకేనాయె. అలా తయారుచేస్తున్నారు కదా అందరూ కలసి"

ఈమెలో సీరియస్‌నెస్ లేదా? ఇంత నిర్మలంగా నవ్వుతూ మాట్లాడుతుందేమిటీ? లేక సీరియస్‌నెస్ లోపల దాచుకొని పైకి సరదాగా మాట్లాడుతోందా - ఆలోచిస్తున్నాడు రోనీ. అంతలో హఠాత్తుగా అడిగింది రేవతి -

"రోనీ... ఒక మాటడుగుతాను. ఉన్నదివున్నట్లుగా చెప్పు. నువ్వు చాలా ఫ్రాంక్‌గా వుంటావనీ, అందుకే మీ ఇంట్లోంచి వెళ్ళిపోయి ఒంటరిగా బతుకుతున్నావనీ మీ అంకుల్ చెబుతుంటారు నీగురించి. అందుకే నిజమే చెబుతావని నమ్ముతున్నాను. మీ అంకుల్ తరవువాళ్ళలో - ఆయన చెల్లెలు ఒక్కర్తీ తప్ప ఇంకెవరూ నా మొహంకూడా చూడలేదు. నువ్వు కూడా మనసులో అయిష్టంగా వున్నా తప్పనిసరిగా మాట్లాడుతున్నావా లేక...."

"లేదు" ఆమె మాటల్ని మధ్యలోనే ఆపేసి చెప్పాడు - "మా అంకుల్‌ని పెళ్ళిచేసుకున్నారన్న ఒక్క విషయం మినహాయిస్తే మీగురించి నాకసలేం తెలుసునని. ఆ ఒక్క విషయాన్ని పట్టుకుని మీ గురించి నేను ఏమీ అనుకోను. ఇంతకూ ఎందుకలా అడిగారు?"

మళ్ళీ తేలిగ్గా నవ్వేసి-

"ఏమీలేదు. నాలుగురోజులు సరదాగా కబుర్లుచెప్పుకోవడానికి నీ మనసులో ఏముందో తెలుసుకోవద్దూ- అందుకే అడిగాను. ఆ ఊళ్ళో నన్నొక్కదాన్నీ వదిలేసి రాలేక, వరంగల్‌లో పనులున్నప్పుడల్లా ఇలా నన్ను వెంటబెట్టుకొస్తారు మీ అంకుల్. నాకు తోచిచావదు. మహా అయితే రెండ్రోజులకో సినిమాకు, అదీ నేనొక్కదాన్నే వెళ్ళాలి. ఆ ఊళ్ళో అమ్మలక్కలకు ఎంతసేపూ చీరలూ, ఇంట్లో సామాన్ల గురించి తప్ప వేరే కబుర్లే ఉండవు. ఈయనకా ఆయన ఆఫీసూ, స్నేహితులతోనే గడిచిపోతుంది. దిక్కుతోచక చస్తున్నాను"

"సరే ఇవ్వాల్టికి... నన్ను వదిలేయండి. రేపు పనులేవీ పెట్టుకోను. అంకుల్‌తో కలిసి సినిమాకు వెళదాం"

మరో అయిదారు నిమిషాలు కూర్చుని తన గదికి వెళ్ళాడు రోనీ.

★ ★ ★

ఇందిరాపార్కులోని క్యాంటీన్ ముందర, ఆరుబయట వున్న కుర్చీల్లో కూర్చుని టీ తాగుతున్నారా మహిళాబృందం. వాళ్ళంతా ఉమెన్స్ హాస్టల్‌లో వుంటున్నవాళ్ళే. అందులో మయూరి, ఆనందం, భారతి ఒకరూంలోను; శివలక్ష్మి, సంగీత, అనసూయ ఒకరూంలోను, స్వప్న మరో ఇద్దరు మరో రూంలోను కలిసి ఉంటున్నారు. అయితే స్వప్న రూంలోని ఇద్దరితోపాటు భారతి, సంగీతలు వాళ్ళతో కలవరు. మయూరి, ఆనందం, శివలక్ష్మి, అనసూయ, స్వప్న - ఒక జట్టుగా కలిసిమెలసి వుంటారు. అభిప్రాయభేదాలొచ్చినప్పుడు ఆ అయిదుగురే రకరకాల కాంబినేషన్లతో రెండు బృందాలుగా కలిసి పోట్లాడుకుంటారు. అభిప్రాయ భేదాలు తరచుగా వస్తుంటాయికూడా. ఉదాహరణకు ఆ రోజు సంజీవయ్య పార్కుకు వెళ్ళాలా, ఇందిరాపార్కుకు వెళ్ళాలా అని పొద్దున్నే పోట్లాడుకున్నారు. అలాగే తెలుగు సినిమాకు వెళ్ళాలా, ఇంగ్లీష్ సినిమాకు వెళ్ళాలా అన్న దాన్ని గురించి అప్పుడూ పోట్లాట జరుగుతుంది.

""అబ్బ... ఈ చచ్చు తెలుగు సినిమాలు చూస్తే తలనొప్పితో చచ్చిపోవాలే. నేను చచ్చినా రాను" తేల్చేసింది శివలక్ష్మి.

"ఇంగ్లీష్ సినిమాలో అర్థమయ్యేదేదో ఉన్నట్టు పెద్ద బడాయి. సినిమా అంతా చూసి, అబ్బ... ఫొటోగ్రఫీ ఎంత బావుందో - అని తప్ప ఎప్పుడైనా ఏమైనా అన్నావా నువ్వు?" - మయూరి వాదన.

"ఇంగ్లీష్ సినిమాలు చూడటం అలవాటు చేసుకోవే తల్లీ! అందులోవుండే నటన చూసి నేర్చుకొంటే మరికాస్త మంచిది నీకు. అర్థం చేసుకోవూ! 'విజిటింగ్ అవర్స్' నిజంగా చాలా బావుంటుంది. నేను చెబుతున్నానుకదా" - ఇదీ ఆనందం అభిప్రాయం.

"అదా సంగతి- అలా చెప్పు. 'విజిటింగ్ అవర్స్' హీరోయిన్ నీలాగే నర్సు కదా. అందుక నన్నుమాట. ఇదిగో ఒక్క మొట్టికాయ వేశానంటే 'ఆనందం' కాస్తా 'విషాదమై' పోతావు" హెచ్చరించింది అనసూయ.

"నర్సు కథే కావాలంటే తొందర్లో బాలచందర్ పిక్చర్ 'సిస్టర్ నందిని' వస్తోంది. అప్పుడు పోవచ్చే ఆనందం... ప్లీజ్- రావే- తెలుగు సినిమాకి పోదాం. పోనీ నీ యిష్టమైన

సినిమాకే పోదాం- కానీ తెలుగుది'' బతిమాలింది మయూరి.

"ఇప్పుడు బలం రెండూ రెండూ వుంది కదా. స్వప్ననడుగుదాం. అప్పుడు తెలిపోతుంది'' మార్గం చూపించింది శివలక్ష్మి.

"ఇదిగో, యిప్పుడు కూడా మెజారిటీ అంటూ యింగ్లీష్ సినిమాకు పోదామంటే నేనొప్పుకోను. పొద్దున్నే నేనూ, ఆనందం సంజీవయ్య పార్కుకు పోదామంటే మీముగ్గురూ యిటు లాక్కొచ్చారు. తెలుగు సినిమాకెళ్ళాలంతే'' మయూరి మొండికేసింది.

"అబ్బ- నువ్వాగవే తల్లీ! స్వప్న కూడా తెలుగు సినిమాకే అంటే చాలుగదా'' వారించింది అనసూయ ఆశాజీవిలాగా.

"నన్నడిగితే మరీ ప్రాంతీయం కాకుండా, అలాగని అంతర్జాతీయం కాకుండా మధ్యేమార్గంగా హిందీ సినిమాకెళదామంటాను'' నవ్వుతూ అంది స్వప్న.

"ఇదిగో, చావు కబురు చల్లగా చెప్పినట్టు ఇలాంటి చచ్చువాదనలతో చంపకు'' కసిరింది శివలక్ష్మి.

"నేను హిందీ సినిమా ఎందుకు సజెస్ట్ చేశానో చెప్పమంటారా?'' అందరి ముఖాల్లోకి చిలిపిగా చూస్తూ ఆగింది స్వప్న.

"ఎందుకు?''

"ఎందుకేమిటీ... అక్కడకెళ్ళి చావడానికి. అదికూడా దాన్నే చెప్పిచావమనాలా?''

"అదేమీకాదు. నెక్స్ట్ మండే నుండి యిలా మెజారిటీ తేల్చుకోవటం యిక కుదరదు. మా మమ్మీకి యిక్కడికి ట్రాన్స్ఫరయింది. నేను హాస్టల్లో వుండనూ, లల్లా, టింగ్, టింగ్''

"ఎంత అదృష్టవంతురాలివే''

"దాని అదృష్టం ఎప్పుడూ సరిగానే చస్తుంది. అదేమైనా మనాలాగా వుద్యోగం చేసుకుని చస్తుందిగనకనా ఏమిటి''

"ఇదే ఊపులో మనంకూడా ఎక్కడైనా ఒక యిల్లు అద్దెకుతీసుకుంటే మనకూ అదృష్టమే వస్తుందనుకోవచ్చు'' సూచించింది మయూరి.

"అవునే... మీరంతా ఏడాది నుండే యిక్కడున్నారుగానీ నేను యింకాముందు నుండి ఏడుస్తున్నాను. నాక్కూడా తలనొప్పిగా వుంది'' అంది ఆనందం.

"అయితే నేనోమాట చెబుతాను- వింటారా?'' అరిచింది మయూరి.

"వినక చస్తాంగనుకనా? అదేంటో చెప్పిచావక ఈ చావుకేకలెందుకే చచ్చు పక్షీ'' విసుక్కుంది శివలక్ష్మి.

"అలాగే చెప్పిచస్తాను... వినిచావండి'' శివలక్ష్మిని వెక్కిరించి, చెప్పింది మయూరి-"మనం ఈ సంగతి హాస్టల్లో మాట్లాడుకుంటే అందరూ వింటారు. తీరా గది దొరక్కపోతే, ఈ సంగతి ఎవరైనా మేట్రన్ చెవిలో ఊదితే ఆ తరవాత మనకు మళ్ళీ నరకం చూడాల్సిన పనుండదు. అంచేత...''

"అంచేత?''

"...అంచేత, టాంక్‌బండ్ మీద కూర్చొని, ఈ సంగతి గురించి అందరమూ మాట్లాడుకుని, తేల్చుకుని, ఏ హొటల్లోనో యింత తినేసి వెళదాం... ఏమంటారు?''

"ఇది మీ నలుగురి ప్రాబ్లం. మధ్యలో నేనెందుకు మీతో వుండాలి?'' చిలిపిగా అడిగింది స్వప్న.

"నీకూ చదువైపోయి, ఒంటరిగా ఉద్యోగం చేసుకోవాల్సివస్తే తెలుస్తుంది బాధ'' ఆనందం కసిరింది.

"నేను మాత్రం రానేతల్లీ- నేను హాస్టల్లోనే వుంటాను'' అంది అనసూయ.

"ఒసి పిచ్చి మొహమా- నీకో రహస్యం చెబుతున్నాను విను. త్వరలో ఈ హాస్టల్ పడగొట్టించి, షాపింగ్ కాంప్లెక్స్ కట్టాలని ఆలోచిస్తున్నారు మేనేజ్‌మెంట్‌వారు. కట్టే పని ఎప్పుడు మొదలవుతుందో తెలియదుగానీ కూలగొట్టే పని ఆరునెలల్లో మొదలవుతుంది... గ్యారంటీ- ఆ తర్వాత నీ యిష్టం, చెప్పలేదనొద్దు'' వివరించి, ఆగి ఊపిరిపీల్చుకుంది మయూరి. "అందుకే తీరిగ్గా యివన్నీ మాట్లాడుకుందాం పదమన్నాను'' విసుక్కుంటూ లేచి నిలబడింది.

"మరి నేను రానన్నానుకదా'' లేచి నిలబడుతూ అలిగింది స్వప్న.

"అబ్బ... నీకో ఐస్‌క్రీం కొని చస్తాను కానీ మాతో చావవే తల్లీ'' కసురుకుంది శివలక్ష్మి.

"సరే... స్వప్న ఎటూ వెళ్ళిపోతుంది గనుక, అడ్వాన్స్‌గా ఫేర్‌వెల్ పార్టీగా ఈ టీ బిల్లు అది యిచ్చేస్తుందట" మయూరి ప్రతిపాదించింది.

"ఫేర్‌వెల్ పార్టీనా, గాడిద గుడ్డా? అయినా సిగ్గులేదూ- పార్టీ మీకు నేనివ్వాలా, నాకు మీరివ్వాలా?" స్వప్న కోప్పడేసింది.

ఆనందం బిల్లు చెల్లించి,

"పోనియ్యండే దానిఖర్మ. దానికసలు బ్రహ్మాండమైన ఫేర్‌వెల్ పార్టీ యివాలనుకున్నాను. చీప్‌లో అయిపోయింది" అంది.

నలుగురూ నవ్వుతుండగా వాళ్ళతో దెబ్బలాడుతూ నడిచింది స్వప్న. అందరూ టాంక్ బండ్‌కు దారితీశారు.

★ ★ ★

"సరూ... నాకు కాలేజ్ టైమయింది- బైటికొస్తావా?" బూట్లు తొడుక్కుంటూ కేకేశాడు జీవన్.

కొంగుకు చేతులు తుడుచుకుంటూ బైటికొచ్చింది సరస్వతి.

"అదేమిటి-ఐదు నిమిషాలు ఆగితే టిఫిన్ బాక్స్ తీసుకుపోవచ్చు కదా?"

"మధ్యాహ్నం ఎక్కడో తింటానులే. చేసిన టిఫిన్ నువ్వు తినెయ్" బైటికి చూస్తూ అన్నాడు జీవన్.

"ఓహో... ఇవ్వాళ శనివారంకదూ. మీ ముద్దులభార్యగారు విజయవాడ నుండి వస్తున్నారు కదూ, నేను మర్చిపోయానులెండి" మూతి విరిచింది.

భార్య దగ్గరగా నడిచి, ఆమె ముఖం తనవైపు తిప్పుకొని అనునయంగా అన్నాడు:

"ఎప్పుడో అయిపోయినదాన్ని మళ్ళీమళ్ళీ కెలుక్కుని మనను పాడుచేసుకోవడం ఎందుకు చెప్పు?"

"మీరు వెళ్ళకపోతే ఆవిడగారు రైలుదిగి రాలేరా ఏమిటి? అంతా నాఖర్మ కాకపోతే, రెండేళ్ళ బదులు శాశ్వతంగా ఆవిడకు అక్కడికే ట్రాన్స్‌ఫర్ వచ్చివుండకూడదా..."కొంగుతో కళ్ళొత్తుకుంది.

"నీ ఖర్మకాదు, నా ఖర్మ. సరూ... ప్లీజ్-ముందా ఏడుపు ఆపేసెయ్యి" నగం చిరాగ్గా, నగం బతిమాలుతున్నట్టుగా అన్నాడు.

"మీకేమిటి? మగమహారాజులు. ఆవిడో, నేనో చస్తే మీకు హాయిగా ఉంటుంది. లేకపోతే నాకు జీవితంలో ఒకరోజున తప్పే లంపటమా యిది" జీరవోయిన గొంతుతో అంటూ ముక్కు చీదుకుంది సరస్వతి.

ఎడంచేయి ఆమె భుజంమీద వేసి, సూటిగా ముఖంలోకి చూస్తూ ఆవేశంగా అన్నాడు -

"సరే... నేను స్టేషన్‌కు వెళ్ళకూడదు. అంతే కదా? సరే... వెళ్ళను, వెళ్ళనన్నానుగదా. నమ్మవా? మన బేబీమీదొట్టు. వెళ్ళను. సరేనా? వెళ్ళి ముఖం కడుక్కుని, ఆ టిఫిన్ బాక్స్ తెచ్చి నా మొహాన తగలెయ్యి"

"మనసులో ఉండాలి గాని ఒట్లూ, ప్రమాణాలూ ఎందుకు? స్టేషన్‌కు పోనంత మాత్రాన వదిలేస్తారా ఏమిటి?" గొణుక్కుంటూ వంటగదిలోకి నడిచింది.

నిస్సత్తువ ఆవహించినట్టుగా కుర్చీలో కూలబడిపోయాడు జీవన్. రెండు నిమిషాల్లో టిఫిన్ బాక్స్ తీసుకొనివచ్చింది సరస్వతి. అది చేతిలోకి తీసుకొని ఆమె వైపు చూడకుండా విసురుగా బైటకి నడవబోయినవాడు భార్య మాటలు విని గుమ్మంలో ఆగిపోయాడు.

"పాపం, మనసంతా పాడైపోయినట్టుంది. కుడికాలు మా ముడేసుకోలేదు" వెక్కిరిస్తున్నట్టుగా అంది సరస్వతి.

చప్పున చూసుకొని అక్కడే నిలుచుని బూటు ముడేసుకుని, స్కూటర్ కిక్ కొట్టాడు.

"ఇవ్వాళ శనివారం. బిర్లాటెంపుల్‌కు వెళ్ళాలి. సాయంత్రం అయిదుకల్లా వచ్చేయండి" నిస్సహాయంగా భార్యవైపు చూసి,

"మంచిది" వినీవినిపించనట్టుగా అనేసి, స్కూటర్ని పరిగెత్తించాడు.

వీధి మలుపుతిరగగానే గడియారంకేసి చూసుకున్నాడు. ఆరోజు మొదటి పీరియడే తన క్లాసుంది. వినుగ్గా యాక్సిలేటర్ తిప్పి, కాలేజ్ వైపు దౌడు తీయించాడు.

బెర్నార్డ్‌షా నాటకం 'పిగ్మాలియన్' చివరి అంకం చెప్పాల్సివుందారోజు. ఒక పూలమ్ముకునే అమ్మాయికి చదువూ, సంస్కారం నేర్పి ఆమెని సభ్య ప్రపంచంలో మసలగలిగేవి

ధంగా రూపుదిద్దుతాడొక ప్రొఫెసర్. చిట్టచివరకు అతన్ని ప్రేమించిన ఆ అమ్మాయి తన మనసును తెలుపుకోవాలని సతమతమవుతుంటుంది అతనికి అలాంటి భావనే లేదా అమ్మాయి విషయంలో. తనను ఎవరు ప్రేమిస్తున్నారో, ఎంత\|ా ప్రేమిస్తున్నారో అతనికి తెలియదు. తను ఎవర్ని ప్రేమిస్తున్నాడో, ఎవర్ని ప్రేమించటంలేదో కూడా తెలియదు.

పాఠం వివరిస్తున్నంతసేపూ సగం తన ఆలోచనల్లో నిండిపోయిన మనసును బలవంతంగా అటువైపు మళ్ళించాడు జీవన్. అయిదు నిమిషాలకు పీరియడ్ పూర్తవుతుందనగా లెక్చర్ ఆపేసి, కుర్చీలో కూర్చున్నాడు.

"నిజంగా మీ విశ్లేషణ బ్రహ్మాండంగా వుంది సార్" ఒక విద్యార్థి లేచి చెప్పడంతో, అయోమయంగా చూశాడు.

ప్రేమను గురించిన తన మనసులోని బాధను ఈ రూపంలో వెళ్ళగక్కుతున్నానన్నమాట- అనుకున్నాడు.

బెల్ అవగానే లేచి ప్రిన్సిపాల్ రూంకి వెళ్ళి యూనివర్సిటీకి ఫోన్ చేశాడు.

"హల్లో డాడ్" అట్నించి కొడుకు గొంతు వినిపించటంతో నిశ్చింతగా నిట్టూర్చాడు.

"బాలూ- ఇవాళ ఇంపార్టెంట్ క్లాసులేమైనా ఉన్నాయా?"

"మీరు చెప్పే పనినిబట్టి ఇంపార్టెన్స్ ఉంటుంది" చిలిపిగా నవ్వాడు బాలు.

ఒకసారి ప్రిన్సిపాల్ వైపుచూశాడు జీవన్. అనంకల్పితంగా ఆదేక్షణంలో అతనివైపు చూసిన ప్రిన్సిపాల్ ఏదో పని ఉన్నట్టు కుర్చీలో నుండి లేచి దూరంగా నడిచాడు.

"ఇవాళ గౌతమి వస్తోంది, గుర్తుందా?" వీలైనంత లోగొంతుతో చెప్పాడు.

"వైనాట్? ఇవాళ సాయంత్రమంతా మీతో బిజీగా ఉంటుంది కదా అని రేవంతా పిన్నిదగ్గరకు కేటాయించాను. ఇంతకూ ఎందుకడుగుతున్నారు?"

"నువ్వెళ్ళి తనను రిసీవ్‌చేసుకోవాలి. నాకు ఎక్స్‌ట్రా క్లాసుపడింది. మా ప్రిన్సిపాల్ రిక్వెస్టు చేయడంతో కాదనలేకపోయాను"

"మరి కీస్?"

గౌతమి బ్యాంక్ ఆఫీసర్, వాళ్ళకువాళ్ళు ఉద్యోగహోదానుబట్టి తొమ్మిది వందలరూపాయల నుండి మొదలుకొని ఇంటి అద్దెను బ్యాంకువాళ్ళే భరిస్తారు. అయితే యిల్లు చూసుకునే బాధ్యత సాధారణంగా ఉద్యోగులపైనే వుంటుంది. గౌతమి ట్రాన్స్‌ఫర్ విషయం తెలియగానే ఇల్లు వెదికే బాధ్యత కొడుకుకే అప్పగించాడు జీవన్. పన్నెండువందల రూపాయల అద్దెకు అశోక్‌నగర్‌లో ఇల్లుచూశారు. ముఖ్యమైనవి తప్ప మిగతాసామాన్లన్నీ మూడు రోజులకిందటే లారీలో వచ్చేయగా బాలూ తన స్నేహితులతోకలిసి సర్దేశాడు. స్వప్నను ముట్టుకోనీయలేదు. సోమవారం రోజున హాస్టల్ వెకేట్‌చేయాలని నిర్ణయించుకున్నందునా, తల్లి వచ్చేంతవరకూ ఒంటరిగా వుండలేకా స్వప్న హాస్టల్లోనే వుండిపోయింది. ఇంటితాళాలు జీవన్ దగ్గరే వుండిపోయాయి.

"డూప్లికేట్‌సెట్ స్వప్న దగ్గరుంది. నువు ముందుగా స్వప్న దగ్గరికెళ్ళి తనను పికప్‌చేసుకుంటానని చెప్పు. ఇద్దరూకలిసివి స్టేషన్‌కు వెళ్ళండి. మళ్ళీ కన్‌ఫ్యూజ్ అయి, గజిబిజి చేయకు"

"అయితే మీరు సాయంత్రం వస్తారని చెప్పనా?" ప్రశ్నించాడు బాలు.

"అహ్‌౹" కంగారుగా అన్నాడు జీవన్ - "అదేమీ చెప్పకు"

"డాడీ... మమ్మీ ఏమైనా అందా?"

"విల్ యూ ప్లీజ్ షటప్ యువర్ బ్లడీ మౌత్" విసుగ్గా అన్నాడు జీవన్ కొడుకు ప్రశ్నకు సిగ్గుపడుతూ.

"'సారీ డాడీ... ఫర్‌గెటిట్. అయితే నేను మీరొచ్చేదాకా పిన్నిదగ్గరే వుంటాను- ఓకే?"

"నీ యిష్టం" ఫోన్ పెట్టేశాడు జీవన్.

దూరంగా అలమారదగ్గర నిలబడి ఫైళ్ళు వెతుక్కుంటున్న ప్రిన్సిపాల్ దగ్గరికి నడిచాడు-

"సారీసర్... ఐహావ్ డిస్టర్బ్ యూ"

"యూఆర్ ఆల్వేస్ వెల్‌కమ్ మిస్టర్ జీవన్. నెవర్‌మైండిట్. అవునూ, మీరివాళ పర్మిషన్ అడిగినట్లున్నారు"

ఒక్క క్షణం తటాపటాయించి- "యస్సర్" అన్నాడు.

ఒంటిగంటకల్లా యింటికొచ్చిన భర్తను చూసి ఆశ్చర్యపడింది సరస్వతి. అంతలోనే - ఎన్నాళ్ళిలా వస్తాడు? ఇక ఈయన ఆలస్యంగా యింటికిరావటం తప్పదు. అది భరించే ఓపికకు ఈరోజు టానిక్ యిస్తున్నట్టున్నారు– అనుకుంది, విరక్తిగా. మాయిద్దరిలో ఒకరు ఎండా, మరొకరు వానా. ఈ రెంటినీ కలిపి ఒకేసారి మాత్రం చూడలేడు. ఈయన- అను కుంటూ, టీ పెట్టడానికి ఉపక్రమించింది.



ఆటోల్లోంచి సామాన్లుతీసి బైటపెట్టారు. స్వ ప్న వెళ్ళి యింటి తాళం తీసింది. అన్నీ లోపలపెట్టేసిన తరవాత కిటికీలన్నీ తెరుస్తూ అన్నాడు బాలు–

"చెప్పు పిన్నీ ఎలావుంది మన సెలెక్షన్? బ్రోకర్ కూడాలేకుండా స్వయంగా తిరిగి, వెతికి పట్టుకున్నాను" గర్వంగా అన్నాడు బాలూ.

"ముందు గదిలో సర్దిన సామాన్లవరకూ బాగుంది. ఇల్లంతా చూసిన తరవాత కదా, యింటి సంగతితెలిసేది" నవ్వుతూ అంది గౌతమి.

"ఇదేమైనా మీ బ్యాంకులో చెక్కుఅను కుంటున్నావా, అన్నీ పట్టి పట్టిచూడటానికి? ఈ లోకాలిటీలో, సెపరేట్ యిల్లు, అందునా ఇంత చక్కటి కాంపౌండ్‌తో... హు చూసిన వెంటనే, తాళం తీయకముందే 'అద్భుతం బాలూ' అని మెచ్చుకోవాలసలు"

ఇల్లంతా తిరిగి చూసి, బాగుందని మెచ్చు కుంది గౌతమి.

"కాకపోతే, ఇంటికున్న లోపమల్లా కార్‌షెడ్ ఒక్కటే" అంది.

"అదే నేననేది. మనకు కార్ లేదుకదా, షెడ్ ఎందుకూ, దండగ- అని"

బలేదానివే పిన్నీ ఈ పాయింట్‌తో నా టేస్ట్‌నీ, నేను మోసిన హెర్క్యులియన్ టాస్క్‌నీ కొట్టిపారేస్తే నేనొప్పుకోను" వాదించాడు, బాలూ.

తల్లి స్నానంచేసేసరికి అరడజన్ నూడుల్స్ పాకెట్స్ వండి సిద్ధంచేసింది స్వప్న. తల్లి బాత్‌రూంలో వుండగా, అన్నని అడిగింది–

"నాన్నగారు రాలేదేం?"

"ఏముంది, మామూలే" ఎటోచూస్తూ అన్నా డు బాలు.

ముగ్గురూ కూర్చుని తింటుండగా గౌతమి అడిగింది–

"బాలూ, డాడీ ఎప్పుడొచ్చేదీ నీకేమైనా చెప్పారా?"

ఒక్క క్షణం ఆలోచించి,

"డాడీకి వంట్లో బాలేదు పిన్నీ. కాస్త నల తగా వుందని, యివాళ కాలేజ్‌కు లీవ్ పెట్టా రు" అబద్ధం చెప్పేశాడు.

తింటున్న ముద్దని ఆపేసి, కంగారుగా అడిగింది గౌతమి–

"ఒంట్లో బాలేదా, నాకింత వరకూ చెప్పలే దేం?"

"నథింగ్ టు వర్రీ పిన్నీ. జ్వరం వచ్చిన ట్టుగా అనిపిస్తూందన్నారు. అంతే"

"అయితే యివాళ ప్రోగ్రాం మీ యిద్దరూ చెప్పండి. నేను మండే జాయిన్ అవుదామను కుంటున్నాను.

"జర్నీచేసి అలిసిపోయుంటావు కదా పిన్నీ. ఇవాళ ఇంట్లోనే వుందాం. నేనూ యింటి కెళ్ళను"

"ఫస్ట్‌క్లాస్‌లో కూర్చుని అక్కణ్నించిక్కడికి వచ్చినంతలో అలుపురావడానికి నేనేమైనా మి నిస్టర్‌నా, సినిమా స్టార్‌నా?" అంటూ, "పోనీ, సాయంత్రం గుడికెళదాం. ఆ తరవాత కాస్సే పట్లా తిరిగొద్దాం" సూచించింది గౌతమి.

★ ★ ★

అయిదింటికల్లా ఆటోలో బిర్లామందిర్ చే రుకున్నారు ముగ్గురూ.

వెనకనుంచి వేగంగా ముందుకు వెళుతున్న వాళ్ళనూ, తిరిగొస్తున్నవాళ్లనూ తప్పించుకుంటూ నెమ్మదిగా నడుస్తున్నారు ముగ్గురూ. ఇరుగ్గా వున్నదారికి రెండు పక్కలా యిళ్ళు, ఆ యిళ్ళల్లోని జనం పనీపాటలూ రోడ్డుమీదే సాగిస్తుంటారు, అక్కడక్కడా అడుక్కునేవాళ్ళు అందర్నీ చూస్తూ-

"ఇదేనా మమ్మీ ప్రశాంతత" అంది స్వప్న విసుగ్గా.

"నువు రిలీజయిన రోజునే సినిమాకు వెళ్ళినట్టనుకో. అయినా యివాళ అనుకోకుండా వచ్చాంగానీ లేకపోతే శనివారం రోజున రద్దీ సంగతి తెలిసి, ఎప్పుడైనా వచ్చానా- నిన్ను తీసుకొచ్చానా?"

గుడి ఆవరణలోకి ప్రవేశించారు. అంచెలంచెలుగా జనాన్ని పంపిస్తున్నారు ఆలయ సిబ్బంది. ఒక్కో అంచెలోనూ పదినిమిషాల దాకా ఆగిపోతూ, నలభై నిమిషాలకు గుళ్ళోకి చేరుకున్నారు. పాలరాతితో కట్టిన ఆ మందిరం అందం చూస్తేమట్టుకు స్వప్నకు చాలా బాగుంటుంది. వచ్చిన జనంలో చాలా మంది ఏదో మొక్కుబడిగా అరనిమిషం కూర్చుని వెళ్లిపోతుంటారు. అందువల్ల దేవుణ్ణిచూసే వరకూ రద్దీగావున్నా ఆ తర్వాత కూర్చునేందుకు కొండపైనుంచి దూరంగా కనిపించే నగరాన్ని పరికించడానికి అంతగా ఇబ్బంది వుండదు. గుళ్లోకి వస్తున్న వాళ్లకూ, గుళ్లోంచి వెళ్ళిపోతున్నవాళ్లకూ మధ్యన అడ్డుగా తాడుకట్టి, బ్యారికేడ్లలాంటివి ఉన్నాయి. ఇక రెండునిమిషాలకు లోపలికి వెళతారనగా చటుక్కున ఆ తాడుపైనించి అటుదాటివెళ్లి పోతున్నవాళ్లలో నిలబడింది స్వప్న.

"మేమక్కడ మండపంలో కూర్చుంటాము మమ్మీ. నువ్వు మీ దేవుణ్ణి పలకరించి రా" అంది బాలూ చెయ్యిపట్టిలాగుతూ.

"నేను రాను... నువుమాత్రం అక్కడే కూర్చో. మా కోసం వెదకటం పెట్టుకోకు. మేం నిన్ను వెతికీ, నువు మమ్మల్ని వెతికీ ఇవాళంతా ఇక్కడే గడిచిపోతుంది" అన్నాడు బాలూ చిన్నపిల్లకు చెప్పినట్టు.

"పొపేయ్ జీన్స్ ప్యాంట్ భక్తుడా" వెక్కిరిస్తూ వెళ్లిపోయింది స్వప్న.

సూర్యుడింకా కుంగిపోలేదు. ఆహ్లాదంగా కాస్తున్న నీరెండ పాలరాతిమీద పడి విచిత్రంగా మెరుస్తోంది. అక్కణ్ణించి చూస్తుంటే ఆ ఎండలో నగరమంతా నారింజరంగు పొగ నిండినట్టుగా కనిపిస్తోంది తమాషాగా. అయిదు నిమిషాలు అటూఇటూ తిరిగి పక్కనున్న మండపంలో ఎప్పుడూ తను కూర్చునేచోట కూర్చుంది స్వప్న.

కాసేపటికి గౌతమీ, బాలూ వచ్చారు. కొబ్బరికాయకొట్టి, పెంకువూడదీసే ప్రయత్నం మొదలుపెట్టాడు బాలు. ఆ గుళ్లో దేవుడిముందు కొబ్బరి కాయలు కొట్టడానికి అనుమతించరు. అందువల్ల కొందరు దేవుడి దగ్గరికెళ్లేముందు మరికొందరు దేవుడి దగ్గరకి వెళ్ళొచ్చిన తరువాత, ఆవరణ అపరిశుభ్రం కానిచోట, ఎక్కడో ఓచోట కొబ్బరికాయలు కొడుతుంటారు.

"ఇవాళ ఎండఎంత బావుందన్నయ్యా. ఇంకొంచెం ముందుగా వస్తే ఇంకా బావుండేది కదూ" కొబ్బరిముక్క తింటూ అంది స్వప్న.

"వర్షాకాలం నీరెండ ఇలాగే వుంటుందే" చెప్పింది గౌతమి. కుంకుమపొట్లంలోని కుంకుమతీసి కూతురినుదుట పెడుతూ-

బాలూ కొబ్బరిముక్కతీసి నోట్లో వేసుకోబోతుండగా టపాటపామని ఏదోశబ్దం, మంటపంబయట కలకలం బయలుదేరింది. అది వర్షమని గ్రహించి లేచి నిలుచునేలోగా ఆ మంటపం చివర్న కూచున్న బాలూ ముఖం వానజల్లుకు తడిసిపోయింది. ముగ్గురూ రెండడుగులు వెనక్కివేసి నిలుచున్నారు. బిలబిలమంటూ జనం మంటపంలోకి పరిగెత్తుకొచ్చారు. క్షణాల్లో మంటపమంతా జనంతో నిండిపోయింది.

హ్యాండ్‌బ్యాగ్‌లోంచి కర్చీఫ్‌తీసి ముఖం తుడుచుకుంటూ, యథాలాపంగా పక్కకు తిరిగిన స్వప్నవైపు చూస్తూ కనిపించాడు జీవన్! అతనికి అటుపక్కన పసుపువచ్చని పట్టుచీర కట్టుకుని నిలబడినావిడ సరస్వతి అయి వుంటుందనుకోక తప్పలేదు. కానీ తండ్రితో చూపులు కలవగానే అప్రయత్నంగా.

"హల్లో డాడ్" అనేసింది.

స్వప్నకు అటుపక్కనున్న సరస్వతి, ఇటుప

క్కనున్న గౌతమీ, బాలూ ఒకేసారి స్వప్నవైపు తిరిగారు.

వచ్చుటి నీరెండలో టపటపా కురుస్తున్న వర్షం, జీవన్‌కు అటువక్క సరస్వతి, ఇటు వక్క గౌతమీ...

తండ్రికి జ్వరమొచ్చిందని అబద్ధంచెప్పిన బాలూ ముఖం సిగ్గుతో ఎర్రబడింది.

"హల్లో సప్పీ" విధిలేక అన్నాడు జీవన్.

అదేక్షణంలో తనవైపు తిరిగిన సరస్వతిని చూసి-

"నమస్తే ఆంటీ" చేతులు జోడించింది స్వప్న.

బదులు పలకకుండా కూతురు పద్మ చేయి పట్టుకుని విసవిసా మెట్లుదిగి నడిచింది సరస్వతి.

"సారి పప్పీ, సారీ గౌతమీ. బాలూ... పిన్నినీ, చెల్లినీ జాగ్రత్తగా తీసుకెళ్ళు" అంటూ మంటపంలోంచి బైటికురికాడు జీవన్.

అతను మెట్లుదిగేసరికి గుడి మలుపుతిరిగి కనుమరుగయ్యింది సరస్వతి. హఠాత్తుగా వచ్చిన వర్షం హఠాత్తుగా వెలిసింది. నున్నటి గచ్చుమీద కురిసిన నీళ్లపైన కాలు జారకుండా జాగ్రత్తపడుతూ గబగబా అడుగులేశాడు జీవన్. అటువైపే తెల్లబోయి చూస్తూ నిలుచున్న ముగ్గురూ వాన వెలిసి పోవటంతో గుంపులుగుంపులుగా మళ్లీ మంటపంలోంచి బైటకెడుతున్న జనం సందడికి తేరుకున్నారు.

"సారీ పిన్నీ" అన్నాడు బాలు.

"మధ్యలో నువ్వేం చేశావని?" నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంది గౌతమి.

"డాడీకి ఒంట్లో బాగాలేదని..." వాక్యం పూర్తి చేయకుండా ఆగిపోయాడు.

"పోనీ అన్నయ్యా. అనుకోకుండా జరిగిపోయింది. డాడీ వస్తారని తెలిస్తే మనం రాకపోయేవాళ్ళం. మనకు తెలియదు కదా" అనునయించింది స్వప్న.

'మమ్మీకసలు బొత్తిగా మేనర్స్ తెలియదు'- తనలో తను గొణుక్కున్నాడు.

"బాలూ"స్వాంతనగా భుజం మీద చెయ్యేసి అంది గౌతమి-"నీ చిన్నప్పుడు నీకు బొమ్మలూ,బట్టలూ కొనిపెట్టి నిన్ను దగ్గర చేసుకున్నానుగనుక కానీ, లేకపోతే మీ అమ్మకు నేను చేసిన అన్యాయానికి నీకూ ఆ మాత్రం కోపం కలిగేది. నాకేమీ బాధ లేదు. మీ అమ్మ చేసిందాంట్లో తప్పు లేదు. ఇక పోనియ్యి"

"అదే నా కోపం పిన్నీ. జరిగిపోయిందాన్ని ఎవ్వరమూ మార్చలేము. అర్థంచేసుకుంటే సరిపోతుంది కదా. అసలు ఎందుకు పిన్నీ- అనవసరంగా మా డాడీని పెళ్ళిచేసుకున్నావు?"బాధగా అన్నాడు.

"వీడియో కేసెట్ తీసుకుందామన్నావుకదా, తీసుకుని యింటికి వెళదాం పద" అంది గౌతమి బైటికి దారి తీస్తూ.

గుడి పక్కనుంచి బైటకు నడుస్తుండగా అనుకుంది స్వప్న- చివరకు నువ్వెన్నుకున్న దేవుడికైనా ఒక్క భార్యే వుండేట్టు చూసుకోలేదేం మమ్మీ....

★ ★ ★

మయూరి, ఆనందం,శివలక్ష్మి-ముగ్గురూ కలిసి ఒక ఇల్లు తీసుకున్నారు.అనసూయ వాళ్ళతో కలవలేదు. మూడు చిన్న గదులు కాక ప్రత్యేకంగా వంటగదిలాంటిది కూడా ఒకటుండటంతో, ముఖ్యంగా ఆ యిల్లు ఒకనాటి క్వార్టర్స్‌లోది కావటంతో, ఇళ్ళన్నీ కాంపౌండు గోడలతో దేనికది ప్రత్యేకంగా వుండటంతో, అద్దె ఏడువందలైనా పోనిమ్మనుకున్నారు. పెరటివైపు మరో గుమ్మంతో వున్న గదిలో తను ప్రత్యేకంగా వుంటాననీ, పాతిక రూపాయలు ఎక్కువ తను భరిస్తాననీ చెప్పి మయూరి ఆ గది తీసుకుంది. భోజనంకాక నెలకు ముప్పాతిక రూపాయలు జీతం యిచ్చేట్టు ఒక వంటమ్మాయిని మాట్లాడుకున్నారు. హాస్టల్‌లో నెలకు సుమారు నాలుగొందల యాభై, అయిదువందల మధ్యన బిల్లయ్యేది ఒక్కొక్కరికీ. అదికాక సబ్బులూ, తలనూనెలులాంటి కాస్మెటిక్స్ ఖర్చులు వేరే తప్పేవికాదు. ఇక్కడ ఆ ఖర్చులు కూడా రేషన్‌తోపాటే కలిసిపోయి,వంటమ్మాయి భోజనంతోపాటు, యింటద్దె కలుపుకుని సుమారుగా తలా ఐదొందల పైచిలుకు ఖర్చవుతూంది. ముఖ్యంగా ప్రాణానికి హాయిగా వుంది. ఇష్టమైనవి వండించుకుని తినవచ్చు. గుడ్డలుతుక్కునే శ్రమకూడా తప్పింది. కాకపోతే క్యాంప్ కాట్స్, యితర సామాన్లవంటి

వాటికోసం తలా ఓ అయిదారు వందలు అదనంగా ఖర్చయింది. ఒక నెలరోజులు గడి చేసరికి అనసూయ లేకపోవటమే హాయిగా అనిపించింది. ముందు గదిని వదిలేసి, మిగి లిన మరో గదిలో ఆనందం, శివలక్ష్మి పడు కుంటారు. మయూరి కూడా నిద్రపోయే సమ యంలో తప్ప, తన గది అన్నట్టుగా ఏమీ వుండదు. ముగ్గురూ కలువుగోలుగా వుండటం వలన కూడా ఎలాంటి యిబ్బంది లేకుండాపో యింది.

దాదావుగా అన్నీ హైయర్ మిడిల్ క్లాస్ తరగతికి చెందిన కుటుంబాలున్న ఆ వీధిలో ఈ ముగ్గురు ఆడవాళ్ళు ఒంటరిగా వుంటు న్నారన్న విషయం ఎవరూ పట్టించుకోలేదు. ముఖ్యంగా చిన్న ఊళ్లల్లో లాగా ఎందుకలా, ఏమిటో అని ఆరాలు తీసేంత తీరికా, ఓపికా నగరాల్లో ఎవరికీ వుండదు కూడా. ఈ విషయం ఆ ముగ్గురికీ అన్నిటికన్నా ఎక్కు వగా నచ్చింది.

ఆఫీసు టైముకన్నా రెండు గంటలు ముందుగా లేవటం, స్నానపానాదులు కానిచ్చి, పనమ్మాయికి ఎవరో ఒకరు వంటగురించి, టిఫిన్ గురించి సూచనలివ్వటం, భోజనం కానిచ్చేసి, బాక్సులో టిఫెన్ పెట్టుకుని వెళ్ళిపో వటం, సాయంకాలం రాగానే ఓపికనుబట్టీ -అవసరాన్ని బట్టీ ఓ గంటసేపు షాపింగ్‌కు వెళ్లటం, ఏడున్నరకల్లా భోజనాలు కానిచ్చేసి రేడియో వింటూ, మయూరి టేప్‌రికార్డర్‌లో పాటలు వింటూ, కబుర్లు చెప్పుకుంటూ, పుస్తకా లు చదువుకుంటూ గడపడం, సెలవురోజుల్లో పనమ్మాయికి పొద్దున్న తరువాత సెలవిచ్చేసి, సినిమాకో పిక్నిక్కో వెళ్లటం... ఇదీ వారి రోజు వారీ కార్యక్రమం.

మయూరికి ఒక టైమంటూ వుండదు. మీటింగ్ లేనిరోజున కూడా స్టూడియోలూ, ప్రొడక్షనాఫీసులూ చుట్టేసి, నాటకసమాజాల్లో తెలిసినవాళ్ల దగ్గరికెళ్ళి ఒక్కోసారి మధ్యా హ్నాంకల్లా వచ్చేస్తుంది. లేకపోతే పదకొండు లోపలే వచ్చేసి ఏదో కాలక్షేపం చేస్తుంది లేదా ఏ మార్నింగ్‌షోకో, మాట్నీకో వెళుతుంది. మీటింగ్ వున్నరోజుల్లో ఏడులోపల రాదు. ఒక్కోసారి తొమ్మిది పది దాటిన తర్వాత వస్తుంది ఐతే చాలా అరుదుగా.

ఇక ఆనందం చేసేది నర్సు ఉద్యోగం. షిఫ్టుల ప్రకారం వెళ్ళాల్సివుంటుంది. రాత్రి షిఫ్టు చేసినప్పుడు పొద్దున్నంతా పడుకొని మధ్యాహ్నం పూట ఏదో కాలక్షేపం చేస్తుంది. లేదా నాలుగింటికల్లా బలులుదేరి, కాస్సేపు అటూ యిటూ తిరిగి హాస్పటల్‌కు వెళు తుంది. ఆమెకు రాత్రి షిఫ్టున్నప్పుడల్లా ముగ్గు రూ బాధపడుతూ వుంటారు ఒకరికొకరు కలు సుకోలేక. అయినా పొద్దున్న పూట తీరిక చేసు కొని సాయంత్రాలు తొందరగా వచ్చేసి, ఆనందంతో మాట్లాడుతూ వుంటారు.

శివలక్ష్మి ఒక పెద్దసంస్థలో డైరెక్టర్‌కు పర్స నల్ సెక్రెటరీగా పనిచేస్తోంది. తొమ్మిదికల్లా బయలుదేరుతుంది. బస్సుప్రయాణం పది పన్నెండునిమిషాలే కనుక తొమ్మిదిన్నరకల్లా ఠంచనుగా ఆఫీసుకు చేరుతుంది. నాలుగున్న రకే ఆఫీసు టైం అయిపోతుంది. నెలలో ఏ ఒకటి రెండుసార్లో ఐదూ ఆరు వరకూ వుండా ల్సివస్తుంది. అందువల్ల అయిదింటికల్లా బైట పడి పత్రికలు కొనుక్కోవటమో, కూరలు తీసు కోవటమోలాంటి పనుల్లో ఓ అరగంట గడిపి అయిదున్నర, ఆరుకల్లా వచ్చేస్తుంది.

ఎప్పుడో ఒకసారి ముగ్గురూ తొందరగా వచ్చేస్తుంటారు. అలాంటప్పుడు కూర్చుని తీరి గ్గా తమతమ ఉద్యోగాలను విమర్శించు కుంటూ ఎదుటివాళ్ళ ఉద్యోగాన్ని మెచ్చు కుంటూ నిట్టూరుస్తుంటారు. మొత్తానికి ముగ్గు రూ అన్యోన్యంగా కలిసిపోయారు. అనసూయ రావటం చాలాతక్కువ. స్వప్న మాత్రం తర చుగా వస్తూంటుంది. తనొచ్చినప్పుడు మిగతా ఇద్దరూ లేకపోతే వున్న ఒక్కర్నీ తమింటికి లాక్కెళ్ళి తల్లివచ్చేవరకూ కబుర్లు చెబుతూ కూర్చోబెట్టుకుంటుంది. సాధారణంగా పిక్నిక్స్‌లో వాళ్ళతో కలవటం తగ్గించింది. అంచేత సినిమాలకు వెళ్ళినప్పుడుమాత్రం ఎవరో ఒకరు స్వప్నకు చెప్పిరావట మో,ముందుగానే స్వప్నతో కలిసి అనుకోవ టమో చేస్తుంటారు.

ఆరోజు సుమారు ఏడు కావస్తోంది. ఆనందం రాలేదు. నైట్‌షిఫ్ట్‌కు వెళ్ళిన ఆనందం ఆరుకల్లా వచ్చేస్తుంది సాధార ణంగా. పొద్దునపూట బస్సులు తక్కువగా

న్యంగా వచ్చేస్తుంది. శివలక్ష్మిని నిద్రలేపి చెబుదామా అనుకుంది మయూరి. అప్పటికే తను కాఫీతాగేసి, టీ తాగుతూ కూర్చుంది. టీ పూర్తయ్యేలోగా కూడా ఆనందం రాకపోతే అప్పుడు ఆలోచించవచ్చుననుకుంది. డెయిలీ పేపర్ కూడా రాకపోవటంతో ముందుగుమ్మంలో నిలుచుని టీ తాగుతూ తమ కాంపౌండ్‌లో ఉన్న మొక్కల్ని చూస్తూంది. అంతలో గేటుదగ్గర శబ్దం కావటంతో తలతిప్పి చూసింది. ఎవరో యువకుడు గేటుతీసే ప్రయత్నం చేస్తున్నాడు. అతన్నెక్కడా చూసిన గుర్తు లేదు. ఎవరా అనుకుంటూండగా –

"శివలక్ష్మిగారంటే మీరేనా?" అడిగాడతను.

"శివలక్ష్మా?" ఆశ్చర్యపోయి చెప్పింది – "లోపలుంది. మీరెవరు?"

"అయితే మీరు మయూరి అనుకుంటాను" దగ్గరకొస్తూ అన్నాడు.

మరింత ఆశ్చర్యపడింది మయూరి –

"ఇంతకీ మీరు?"

"నాపేరు రోనీ. ఆనందంగారు పంపించారు"

"ఆనందమా, ఎక్కడుంది తను?"

"కంగారుపడవలసిందేమీలేదు. కొంచెం దెబ్బలు తగిలాయి. హాస్పిటల్లో వున్నారావిడ. మిమ్మల్ని తీసుకురమ్మన్నారు"

"దెబ్బలు తగిలాయా, ఏమైందసలు?" కంగారుగా అడిగింది.

"సీరియస్‌గా ఏమీలేదు. కంగారు పడకండి. మీరొస్తానంటే నేను వెయిట్ చేస్తాను"

"అయ్యో...మిమ్మల్ని బైటేనిలబెట్టి మాట్లాడుతున్నాను. సారీ, లోపలికి రండి" రోనీకి ముందు గదిలో కుర్చీ చూపించి –

"ఇప్పుడే వస్తాను...కూర్చోండి" అంటూ లోపలికెళ్ళింది.

శివలక్ష్మిని నిద్రలేపి విషయం చెప్పి, పనమ్మాయితో రోనీకి టీ పంపించి హడావిడిగా తనగదిలోకెళ్ళింది. అయిదు నిమిషాల్లో యిద్దరూ పనమ్మాయికి జాగ్రత్తలు చెప్పి బయలుదేరబోయారు. మయూరి చటుక్కున తన గదిలోకెళ్ళి సూట్‌కేసులోనుండి డబ్బుతీసి పర్సులో పెట్టుకుంది.

అంతలో శివలక్ష్మి వచ్చి రహస్యంగా అంది

"అవునే, యితనెవరో నీకూ తెలియదన్నావు. అతనుచెప్పేది నమ్మి అతనితో వెళితే ఏమైచస్తుందో తెలియదు...."

"ఒసే ఫూల్, ఏడుంబావయింది. ఇంతవరకూ ఆనందం రాలేదు. అయినా మనం యిద్దరమున్నాం. ఏం చేస్తాడు మనని? నిన్నేమీ రేప్ చేయడుగానీ పద" వినుగ్గా అంది మయూరి.

మెయిన్ రోడ్ పైకెక్కగానే కనిపించిన మొదటి ఆటోని పిలిచింది మయూరి. ఆటోలో ముందుగా శివలక్ష్మి ఎక్కింది చటుక్కున. లోలోపల విసుక్కుంటూ, ఆమె తరవాత మయూరి కూర్చుంది. మయూరి మరోపక్కన కూర్చున్నాడు రోనీ.

"మీరు హాస్పిటల్ స్టాఫా?" ప్రశ్నించింది మయూరి.

"లేదండీ- అప్పుడప్పుడూ పత్రికలకు ఫీచర్స్ రాస్తుంటాను. ఒకసారి నర్సులగురించి రాసినప్పుడు ఆనందంగారు చాలా కోపరేట్ చేశారు. అప్పుడే పరిచయం ఆవిడతో. విమెన్స్ హాస్టల్స్ గురించి ఒక ఫీచర్ రాద్దామనుకుని నిన్న కలిస్తే, తను హాస్టల్‌లో వుండటంలేదనీ, అయినా వివరాలు చెబుతాననీ అన్నారు. ఇవాళ పొద్దున్న ఆరుకల్లా హాస్పిటల్‌కు రమ్మనీ, హాస్టల్‌లో మేట్రన్‌కి పరిచయం చేస్తాననీ అంటే వచ్చాను. నాకు బస్సు దొరక్క ఆరున్నరకు వచ్చాను. ఆవిడింకా బస్టాపులోకి రాలేదా, యింటికెళ్ళిపోయారా, లేక నాకోసం హాస్పిటల్లో వెయిట్ చేస్తున్నారా అని కాస్సేపు ఆలోచించి, ఒకసారి కనుక్కుందామని లోపలికెళ్తే ఈ విషయం తెలిసింది. ఎవరో రౌడీలు బస్టాపుకు వెళ్ళబోతుండగా దాడిచేసారని అన్నారావిడ. పోలీస్ రిపోర్ట్ యివ్వదలుచుకోలేదన్నారు" వివరించాడు రోనీ.

★ ★ ★

ఆరోజు ఆదివారం. బాలకృష్ణ ఒకమ్మాయిని వెంటపెట్టుకుని పిన్ని యింటికి బయలుదేరాడు.

"మీ పిన్ని ఏమైనా అంటె మొదటక మౌనం వస్తుందేమో బాలూ"

"మా పిన్ని ఏమీ అనదు. అయినా, నేనీ అమ్మాయిని లవ్ చేస్తున్నాను-అని యివాళే చెబుతానా ఏమిటి?"

"చెప్పకపోయినంత మాత్రాన ఆ మాత్రం ఊహించుకొరా ఏమిటి? ఎంత కాలేజ్‌మేట్ నని పరిచయం చేసినా కాలేజీలో వున్న మిగతా అమ్మాయిలందర్నీ వదిలేసి నన్ను మాత్రమే ఎందుకు తీసుకొచ్చావని ఆలోచించదా మీ పిన్ని?"

"పోనీ- అలా ఆలోచిస్తే మనకే మంచిది. మనం వేరే చెప్పుకునే అవసరం కూడా వుండదు"

"ఏమో బాబూ, ఆదివారం రోజున చర్చికి కూడా వెళ్ళనీయకుండా లాక్కొస్తున్నావు" గునిసింది అమ్మాయి.

ఇద్దరూ లోపలికెళ్ళేసరికి, ముందు గదిలో టీవీ చూస్తుంది స్వప్న.

"అన్నయ్య ఎవర్నో ఫ్రెండ్‌ను వెంట బెట్టుకొచ్చాడు. ఏమిటీ విశేషం, ఆదివారం పొద్దున్నే నన్ను టీవీ చూడనియ్యదలుచుకోలేదా?"

"ఇదే మా చెల్లెలు స్వప్న. ఇకవాగిందంటే చాటర్‌బాక్స్‌లా లొడలొడా వాగుతుంది. లేదంటే బుద్ధావతారంలా గమ్మునూరుకుంటుంది. మీరు మాట్లాడుతూ కూర్చోండి" లోపలికి నడవబోయాడు బాలు.

"బానే వుంది కానీ యింతకీ ఈమెని నేనేమని పిలవాలి?" కొంటెగా అడిగింది స్వప్న. బాలూ కంగారు చూసేసరికే విషయం సగం అర్థమయిందా అమ్మాయికి.

ఆ ప్రశ్నకు లోనకెళ్ళబోతున్న బాలూ టక్కున ఆగిపోయాడు. అతని ఫ్రెండ్ ముఖం సిగ్గుతోనూ, బాలూపైన కోపంతోనూ ఎర్రబారింది.

"ఏమని పిలవాలేమిటి... నీ మొఖం?" అన్నాడు బాలూ.

"అంతకోపమేమిటి? ఒకరికొకర్ని పరిచయం చేసినప్పుడు ఇద్దరి గురించీ చెప్పాలని తెలీదూ? ఆవిడ పేరేమిటని, ఏదో బస్‌స్టాపులో పక్కనున్నావిణ్ని అడిగినట్లు నేనే అడిగి తెలుసుకోవాలా?"

సిల్వియా. గాటిట్ ఆమె పేరు సిల్వియా అండ్ సిల్వియా, దిసీజ్ స్వప్న. ఓకే"

"సరే సరే సరే" నవ్వుతూ అంది స్వప్న.

"మా అన్నయ్యెందుకో యివాళ చాలా కంగారుగా వున్నాడండీ. అందుకే కాస్త ఏడిపించాలనిపించింది. మీరేమీ అనుకోలేదు కదూ?"

నవ్వేసి ఊర్కుంది సిల్వియా.

"రేపు కాలేజీకి వెళ్ళనంటే మా మమ్మీ ఒప్పుకోదు. అందుకని టీవీ చూస్తూ కూర్చున్నాను. తలనొప్పి వస్తే మానేయొచ్చుకదా, అందుకనన్నమాట. టీవీ ఉంచమంటారా, కట్టెయ్యమంటారా?"

గలగలా నవ్వేసి, ఇల్లంతా కలయచూస్తూ, అడిగింది సిల్వియా-

"మీరేం చేస్తున్నారు... ఎక్కడ?"

"ఇంటర్ విజయవాడలో చేసానండీ. ఇక్కడ బి.ఇ. ఎంట్రెన్స్ రాసాను. రాలేదు. అందుకే మళ్ళీ కోచింగ్ తీసుకుంటున్నానిప్పుడు"

"ఇంటర్ విజయవాడలో చేసారా? ఎందుకు?"

"నేను టెంత్ ఎగ్జామ్స్ రాస్తున్నప్పుడు మా మమ్మీకి విజయవాడ ట్రాన్స్‌ఫరయింది. అందుకని అక్కడే వున్నాను. ఈ సంవత్సరం మళ్ళీ మమ్మీ యిక్కడికొచ్చేస్తుందని ముందుగానే తెలుసు గనుక, మమ్మీకన్నా ముందు నేనే వచ్చేశాను"

"అయితే, వుమెన్స్ హాస్టల్‌లో బాలూ అప్పుడప్పుడూ కలుసుకోవటానికొచ్చేది మిమ్మల్నేనన్నమాట"

"ఇంకెవరైనా గర్ల్‌ఫ్రెండ్ అనుకున్నారా?"

"రియల్లీ యూ ఆర్ సోనాటీ"

"ఇంకా మీ విషయం కూడా మీ కన్నా ముందుగానే చెప్పేస్తే, అప్పుడేమంటారో" మరింత చిలిపిగా అంది స్వప్న.

" మా విషయమా, అంటే..."

"చెప్పిన తరవాత ఏమీ అనకూడదు. చె

వ్వుస్తున్నాను, కాచుకొండి...''

అంతలో గుమ్మంలో స్కూటర్ శబ్దం విని పించటంతో అటు చూసింది స్వప్న.

''తరవాత చెబుతానండీ. మా డాడీ వచ్చారు'' అంది లేచినిలబడుతూ.

''మీ డాడియా'' కంగారుగా లేవబోయిన సిల్వియాను వారించింది స్వప్న.

జీవన్ లోపలికొచ్చేశాడు.

''హాయి డాడ్'' సంతోషంగా అంది స్వప్న.

''హాయి సప్పీ, మమ్మీ ఏంచేస్తోంది?'' సిల్వియా వైపు చూస్తూ అడిగాడు.

''అన్నయ్యతో మాట్లాడుతోంది. అండ్ మీట్ మై ఫ్రెండ్ సిల్వియా''

లేచి రెండుచేతులూ జోడించి-

''నమస్తే అంకుల్''అది సిల్వియా.

అప్పుడే, పిన్నిని వెంటబెట్టుకుని హాల్లోకి వస్తూన్న బాలూ, సిల్వియా గురించి స్వప్న చేసిన పరిచయం విని ఊపిరి పీల్చుకున్నాడు హాయిగా.

''నమస్తే... ఏం చేస్తున్నావమ్మా నువ్వు?''

పిన్నిని లోపలికెళ్ళమని సైగ చేసి-

''డాడ్'' గట్టిగా పిలిచాడు బాలు- ''పిన్ని పిలుస్తోంది''

అది వినగానే, సిల్వియా చెప్పే జవాబు కోసం ఎదురు చూడకుండా లోపలికి నడిచాడు జీవన్.

''నేను టీవీ చూస్తాను డాడీ'' అడక్కుండానే నంజాయిషీ యిచ్చాడు బాలూ, తండ్రి లోపలికి నడుస్తూండగా.

జీవన్ తిన్నగా కిచెన్‌లోకి నడిచాడు.

''హార్లిక్స్ కలుపుతున్నాను... ఒక్కక్షణం'' అంది గౌతమి జీవన్‌ను చూసి.

''ఇప్పుడే తాగాను గౌతమి''-నోటిదాకా వచ్చిన మాటను పెదవి దాటనీయకుండా ఊర్కున్నాడు.

గౌతమి వచ్చిన తరువాత సోమవారం సాయంత్రం వరకూ చూడలేకపోయాడు జీవన్. నిష్ఠూరాలాడటం, అతని మనసు బాధపెట్టడం ఇష్టముండదు గౌతమికి. అందుకే సాధారణంగా ఎప్పుడేతప్ప అతన్ని ఏ విషయానికీ బలవంతపెట్టదు, ప్రశ్నలడగదు. చెప్పిందివిని ఊరుకుంటుంది. తనకు లంచ్ టైం ముందుగానీ, వెనకగానీ పిరియడ్స్ లేనప్పుడు బ్యాంకుకు ఫోన్‌చేసి ముందుగా చెబుతాడు. అలాంటప్పుడు ఇద్దరూ ఏ హోటల్‌కో వెళ్ళి అరగంటపాటు మాట్లాడుకుంటారు. గౌతమి ట్రాన్స్‌ఫర్‌విషయం ముందుగా తెలిసి, టైంటేబుల్ తయారుచేసేటప్పుడు ప్రిన్సిపాల్‌ని రిక్వెస్ట్‌చేసి, శనివారం మధ్యాహ్నం క్లాసులులేకుండా చేయించుకున్నాడు. శనివారం రోజున బ్యాంకు దగ్గర గౌతమిని పికప్‌చేసుకుని సాయంత్రంవరకూ ఆమెదగ్గరే గడుపుతుంటాడు. సాధారణంగా సెలవురోజుల్లో సరస్వతి ఏ బంధువింటికో, సినిమాకో ప్రోగ్రాం వేస్తుంటుంది. లేదా ఎవరైనా యింటికి ఆహ్వానిస్తుంటుంది. అలాంటప్పుడల్లా తప్పించుకుని గౌతమి దగ్గరికి వస్తాడు. ఆ రోజుఎవరో దూరపుబంధువులు నాలుగురోజులు తిష్టవేసే ప్రాతిపదికమీద వచ్చారని బాలూ చెప్పడంతో అతనొస్తాడని ముందుగానే గౌతమి అనుకుంది. అంతలో రానేవచ్చాడు.

గౌతమి హార్లిక్స్ గ్లానుతీనుకుని యిటుతిరగటం చూసి డైనింగ్‌రూంలోకి నడిచి, ఓ కుర్చీలాక్కుని కూర్చున్నాడు. అతను ముందుగా హార్లిక్స్ గ్లానుంచి, తనుకూడా కూర్చుంది.

''ఏమిటి విశేషాలు? ఇవాళ సాయంత్రం వరకూ నాకు తీరికే'' అన్నాడు జీవన్.

టేబుల్‌మీది గ్లాను స్టాండులోంచి ఓ గ్లాను తీసి, అందులోకి సగం హార్లిక్స్ వంపి, గౌతమి కందించాడు.

''నాకు విశేషాలేముంటాయి? రొటీన్ వర్క్. నువ్వే చెప్పాలి, కాలేజ్ సంగతులు''

''కాలేజ్ అంటే గుర్తొచ్చింది. నువ్వొచ్చే ముందోసారి సప్పీ సంగతి చూశాను. మ్యాథ్స్‌లో పర్‌ఫెక్షన్‌లేదు. నాకా మ్యాథ్స్ రానిసంగతి నీకు తెలునుకదా, వెరీ బోర్. అప్పుడప్పుడూ చెక్ చేస్తూండు''

''అవును. మొన్న నేనూ చూశాను. అనలా కోచింగ్‌సెంటర్‌లో మేథమెటిక్స్ సరిగా చెబుతున్నట్లు లేదు. నీకు తీరికెప్పుడో చెబితే

... వెళ్ళ మళ్ళీవద్దాం.

స్వప్న సిల్వియా, బాలు కలిసి గౌతమికి చెప్పేసి యింట్లోంచి బైటపడ్డారు. స్వప్నను మయూరి వాళ్ళ గదిదగ్గర ఆటోలో దింపేసి సిల్వియాతో వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్న బాలూ తండ్రితో మరేమీ మాట్లాడకుండా జాగ్రత్తపడ్డాడు.

అంత తీరిగ్గా వుండే అవకాశం గౌతమి, జీవన్‌లకు ఎప్పుడోగానీరాదు. తలుపు పెట్టేసి లోపలికి వస్తున్న గౌతమి నడుంచుట్టూ చెయ్యి వేసి దగ్గరికి లాక్కున్నాడు జీవన్.

"ఇంత వయసొచ్చినా యింకా సిగ్గులేదు నీకు" చిన్నగా కసిరింది గౌతమి.

"అప్పుడే మునలాళ్ళం అయ్యామా ఏమిటి?" గునగునలాడుతూ ఆమెను మరింత దగ్గరకు తీసుకున్నాడు.

★ ★ ★

"మ్యారేజస్ ఆర్ మేడిన్ హెవెన్, పెళ్ళిళ్ళు స్వర్గంలో నిర్ణయించబడతాయి - అన్నారు. కానీ నా పెళ్ళి మాత్రం యమధర్మరాజుతో యమలోకంలో నిర్ణయించబడి, ఆయన ప్రతినిధిని నా మొగుడిగా పంపించారేమో అనిపిస్తుంది, తలచుకున్నప్పుడల్లా. ఇంటర్ పూర్తి చేసి, నర్సుట్రెయినింగ్ చేశాను. అప్పుడే పెళ్ళి సంబంధాలు చూడటం మొదలయ్యింది. ఏడెనిమిది సంబంధాలు కుదరలేదు. చివరగా ఒక సంబంధం కుదిర్చారు. నల్లగా తుమ్మమొద్దురంగు, ముందు పళ్ళురెండూ బైటికొచ్చి, డ్రాకులాను చూస్తున్నట్టుగా అనిపిస్తుందాయన ఆకారం. అర్ధరాత్రి పిశాచాలు అరిచినట్టుగా వినిపించే కీచుగొంతు - అన్నీ చూసినా, మనిషి రూపానికీ మనసుకూ సంబంధం వుండదని సరిపెట్టుకున్నాను. అమ్మానాన్నలు ఇవ్వగల కట్నంతో నాకు అంతకన్నా మంచి సంబంధం వస్తుందనే ఆశకూడా లేదు. ఏ రెండోపెళ్ళివాడినో కట్టుకుని ఈడు కుదరలేదనుకునే కన్నా జోడుకుదరకపోయినా ఫర్వాలేదు, ఒద్దికగా వుండగలిగితే అదే చాలనుకున్నాను. కానీ ఫస్ట్‌నైట్ రోజునే నగం అర్థమయింది, నా బతుకులో తెల్లవారటమనేది వుండదని"- ఆగి, ఊపిరి పీల్చుకుంది ఆనందం.

మయూరి, శివలక్ష్మి, స్వప్న- ముగ్గురూ మౌనంగా వింటున్నారు.

"గదిలోకి రాగానే ఆయనడిగిన మొట్టమొదటి ప్రశ్న మాటాడిన మొట్టమొదటి మాట ఏమిటో తెలుసా? ఇది నీకు ఎన్నోరాత్రి? నేను ఎన్నోవాణ్ని? చెప్పు- ఫర్వాలేదు. నేనేమీ అనుకోనులే - అన్నాడు. కడుపురాకుండా వుండాలంటే నిరోధ్ వాడటంకాక ఏం చేయాలో చెప్పు, నువు నర్సుట్రెయినింగ్ చేశావు కదా, నీకు బాగా తెలిసుండాలి - అన్నాడు. మాటిమాటికీ అబార్షన్ చేయించటం, కొన్ని రోజులు దూరంగా వుండటం తాను భరించలేనని జోకేశాడు. ఏం మాట్లాడవచ్చో, ఏం మాట్లాడకూడదో తెలియని స్థితి. మనసంతా జుగుప్స. ఆయన తత్వమే అంతో, లేక నన్ను మాటలతో హింసించదలచుకున్నాడో తెలియదు. తనతో గడిపినంతసేపూ శృంగారం గురించి విచ్చలవిడిగా, పచ్చిగా మాట్లాడి, ఆ తరవాత మాత్రం తనను ఎంతోమంచిగా చూసుకునేవాడని నా ఫ్రెండ్ తన భర్తగురించి చెప్పిందోసారి. ఇతనిదీ అలాంటి మనస్తత్వమే నేమో అనుకున్నాను. కానీ కాదని మరి కాస్సేపటికి తెలిసిపోయింది.

నీకా, ఇరవయ్యేళ్ళుకూడా నిండలేదు. మంచి వయస్సులో వున్నావు. కాలేజీ అని ఊరంతా తిరిగావు. ట్రెయినింగని హైదరాబాద్‌లో ఒంటరిగా హాస్టల్‌లో వున్నావు. మరి నిన్ను సుఖపెట్టాలంటే నేనొక్కణ్నే మామూలుగా అయితే ఏం సరిపోతాను? అందుకే ఈ మందు తెచ్చుకున్నాను. అప్పటికీ సరిపోకపోతే తర్వాత ఆలోచిద్దాం, ఏమంటావు - అంటూ, ఏదో మందు వేసుకున్నాడు. ఆయనన్న మాటలకే నా ఒళ్ళంతా భయం భయంగా వుంది. అనలా పనంటేనే వెగటు పుట్టుకొస్తున్న స్థితి, అలాంటి స్థితిలో నా మీద పడ్డాడు.

రేప్ చేయబడిన వాళ్ళను చూస్తే 'అయ్యో... పాపం' అనిపిస్తుందంటారు. కానీ ఆ తెల్లవారుఝామున నన్ను చూస్తే, గ్యాంగ్ రేప్‌కు గురైన వాళ్ళు కూడా పలవలా ఏడ్చేవాళ్ళేమో. శరీరంలోని సున్నితమైన చోటల్లా కొరికి కొరికి రక్తం కారుతుంటే చూసి, మరోచోట కొరికి, అట్లా ఆ రాత్రంతా నన్ను పీక్కుతినడం తప్పిస్తే, అచ్చం నరభక్షకుడిలా నమిలేశాడు.

ఒంట్లో ఎక్కడ నొప్పివుందో, ఎక్కడలేదో తెలియని స్థితిలో, మరొకరితో ఎలా చెప్పుకోవాలో, ఏమని చెప్పుకోవాలో తెలియని పరిస్థితిలో దాదాపు పొద్దున్న పదిగంటల వరకూ స్పృహతప్పిన స్థితిలో పడివున్నాను.

ఇలాంటి మొగుడు దొరికినందుకు కాంపెన్సేషన్‌గానో ఏమో మా అత్తగారు, చల్లటి తల్లి, పాపం, ఏ లోకంలోవుందో, పుణ్యాత్మురాలు దొరికింది. కొడుకు వెలగ బెట్టిన నిర్వాకానికి అలిసిపోయి పడుకున్నాననుకుని, ఏకసెక్కెంచేస్తూ గదిలోకొచ్చి నన్ను చూడగానే గాభరా పడింది. ఆమె ఆప్యాయంగా అడిగిన మాటకు ఆమెను పెనవేసుకుని బావురుమని ఏడ్చేశాను. ఫస్ట్ ఎయిడ్ తెలుసు కనుక ఆమె సహాయంతో మందు పూసుకుని టేబ్లెట్లు మింగి పడుకున్నాను. ఆ జ్వరం వారంవరకూ తగ్గలేదు. మొదటిరాత్రి గురించి నేను ఎప్పుడూ కలలు కనలేదు ఆ అనుభవం గురించి ఊహించుకోనూలేదు. మానాన్న నన్ను చదివించి, పెళ్ళి చేయగలిగిందే పదివేలని నాకు తెలుసు. ఏ మన్మథాకారుడో భర్తగా దొరకాలని కోరుకోలేదు. ఏ కోటీశ్వరుడో, రాచకుమారుడో పెళ్ళాడాలనీ ఆశించలేదు. నాకంటూ ఒక సంసారం, నన్ను తన మనిషిగా చూసుకోగల భర్త - అంతే... నా ఆశ, కోరికా. కానీ నాలాంటి అల్ప సంతోషికి అంత చిన్న కోరికలు కూడా గగన కుసుమాలైపోయాయి. మొదటి రాత్రి జీవితాంతం గుర్తుంచుకోగల అనుభవమని అంటుంటారు. చాలామంది విషయంలో అది మధురానుభవాల్ని తలపుకు తెస్తే, నాకు వెన్నులోంచి వణుకు పుట్టుకొస్తుందాతలపు.

తల్లి ఏం చివాట్లు పెట్టిందో ఏమో, ఆ వారంరోజులూ నా జోలికి రాలేదు. ఆ తరవాత మళ్ళీ మొదలు. ఆయన రూపం వల్లనో, మరెందువల్లనో గానీ ఆ మనిషిలో విపరీతమైన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్.... పెళ్ళాం మీద అధికారం చెలాయించి, తన గొప్పతనం నిరూపించుకునే రూపంలో మనసులోని ఆ భావనను అదుపులో పెట్టుకునేవాడు. తనను నేను మనస్ఫూర్తిగా పెళ్ళి చేసుకోలేదని నేను చేసిన ఏ తప్పునో నాలోని ఏ లోపాన్నో కప్పిపుచ్చుకుని తనను మభ్యపెడుతున్నాననీ అనుకునేవాడు.

అంతలోనే నెలరోజుల కల్లా సుఖరోగం అంటుకుంది నాకు. లేడీ డాక్టర్‌కి ఈ విషయం చెబితే, ఇద్దరమూ సరిగ్గా మందులు వాడితే తప్ప విముక్తి లేదని చెప్పింది. విషయం వినగానే అంతెత్తున ఎగిరిపడ్డాడు. లేడీ డాక్టరైతే మాత్రం, చెప్పుకోవడానికి సిగ్గులేదా అన్నాడు. అసలు తనకే నావల్ల వచ్చివుంటుందని ఆరోపించాడు. జరిగింది చాలుననీ, యిక మళ్ళీ డాక్టర్ దగ్గరికి వెళ్ళటం, మందులు వాడటంలాంటివి వద్దనీ హెచ్చరించాడు. చివరకు సంసార సుఖానికి శాశ్వతంగా దూరమవుతానని చెప్పడంతో అయిష్టంగా ఒప్పుకున్నాడు. వచ్చిన రోగం తగ్గిపోయేవరకూ కలవవద్దని డాక్టర్లు చెప్పిన మాట పెడచెవిన పెట్టాడు. చేసేదేమీ లేక మా అత్తగారి సలహామీద మా పుట్టింటికి వెళ్ళాను. అక్కడికొచ్చి, నడిబజార్లో, చెప్పుకోకూడని తిట్లు తిట్టి, అభాండాలు వేసి, తన్ని నన్ను మళ్ళీ తీసుకుపోయాడు. అయితే నేను మాత్రం ఇక అతనికి లొంగలేదు. ఎన్ని తన్నులు తిన్నా దగ్గరికి రానీయలేదు. ఒకరోజు తాగి వచ్చి, నానా గొడవ చేసి, పశువులాగా నా మీద పడి లొంగదీసుకున్నాడు. ఆ తరవాత మళ్ళీ మామూలే. మళ్ళీ కొన్నాళ్ళకు రోగం తగిలించుకొనివచ్చి నాకూ అంటుపెట్టాడు. ఇక ఏమైనా అదయ్యిందని నేను మళ్ళీ మా పుట్టింటికి వెళ్ళాను. ఐదారు సార్లు వచ్చి గొడవచేసి, చివరకు నాకు విడాకులిచ్చి, మళ్ళా పెళ్ళి చేసుకుంటానని ఉత్తరం రాశాడు. మా వాళ్ళు భయపడి నన్ను ఆయన దగ్గర దిగవిడిచేశారు.

నా బతుకుకు యిక విముక్తి లేదని అనుకున్నాను. అంతలో మా అత్తగారు మంచం పట్టి, మరణించారు. ఇక ఓర్చుకునే ఓపిక నాలో పోయింది. ఎందుకైనా పనికొస్తుందని, విడాకులిస్తానని ఆయన రాసిన ఉత్తరం తీసుకుని, చెవి కమ్మలు, మంగళసూత్రమూ అమ్మేసి, హైదరాబాద్‌కు వచ్చాను. నర్సు ట్రెయినింగ్‌లో పరిచయమైన ఒక స్నేహితురాలు దగ్గర నెల్లాళ్ళపాటువున్నాను. తను నా కథంతా ఒక తెలిసిన డాక్టర్‌కు చెప్పి, అక్కడ ఉద్యోగం ఇప్పించింది. వండుకోవటం, తినటం, డ్యూటీకి పరిగెత్తడం - ఇదేపనిగా ఒకటి, రెండు

నెలలు గడిచాయి. ఊపిరి పీల్చుకునే వ్యవధి లేదు. ఒకటే యాంత్రిక జీవితం.... కానీ ఆయన బాధలేదు. తిన్నదేదో ఒంట పడుతుంది. కంటికి కమ్మటి నిద్ర, ప్రాణానికి హాయిగా వుంది. అదే చాలనుకున్నాను.

అప్పుడే జానకి, అదే నన్ను ఆదరించిన నా స్నేహితురాలు నన్ను వేరుగా వుండమని సూచించింది. అందుకు కారణం కూడా లేకపోలేదు. మా ఇద్దరికీ ఎప్పుడూ వేర్వేరు షిఫ్టులు పడేవి. జానకి అత్త మామలు, ఒక మరిదీ, ఇద్దరు పిల్లలూ కూడా అదే ఇంట్లో వున్నప్పటికీ, తన భర్తకూ, నాకూ ఏదైనా సంబంధం ఏర్పడే అవకాశం వుందని తన భయం. అది నిజమేనని నేనూ గ్రహించాను. మొగుణ్ని వదిలేసిన ఆడదంటే పబ్లిక్ పార్కులో పువ్వులాగా కనిపిస్తుందనుకుంటాను అందరికీ. ఒక గది తీసుకుని ఒంటరిగా వుండగలనా అని ఆలోచనలో పడ్డాను.

నా ఆలోచన ఇలాసాగుతూనే వుంది. అప్పటికే మా డాక్టర్‌గారు నాతో క్లోజ్‌గా మాట్లాడుతుండేవారు. అలాగని ఆయన నాతో ఎప్పుడూ అసభ్యంగా మాత్రం ప్రవర్తించలేదు. కష్టసుఖాల గురించి మాట్లాడుతుండేవారు. ఆదరంగా వుండేవారు. తన పిల్లలగురించీ, భార్య గురించీ, కుటుంబం గురించీ మాట్లాడుతుండేవారు. ఆ చనువుకొద్దీ నా సమస్యను ఆయనకు చెప్పుకున్నాను. ఆలోచిద్దాం- అని దాటేసారు. రెండు మూడు రోజులవరకూ ఏమీ మాట్లాడలేదు.

ఆరోజు నాకు నైట్‌డ్యూటీ వుంది. రాత్రి ఎనిమిదింటికి తను యింటికి వెళ్ళేముందు నన్ను పిలిచారు. నామీద నీకు గౌరవం వుందా, నేనేమైనా చెబితే అపార్థం చేసుకుంటావా- అని ప్రశ్నించారు. హఠాత్తుగా ఆయనలా అడిగేసరికి నాకు ఎలాబదులివ్వాలో తెలియలేదు. ఆలోచనలు పరిపరివిధాలపోయాయి. ఒంటరిగా బతకాలని వచ్చినదాన్ని యింత చిన్నవిషయానికే బాధపడితే ఎలా- అనుకుని, ఆయనేం చెబుతారో వినాలని అనుకుని, చెప్పండి- అన్నాను. ఎందుకు, ఏమిటి, అని నన్ను యిప్పుడు ప్రశ్నలేమీ అడగకు. రేపు సాయంత్రం డ్యూటీకి రావద్దు. సరిగ్గా నాలుగింటికి, మీ యింటి దగ్గరి బస్టాపులోనో, ఆ సమీపంలోనో నిలుచో. నేను వచ్చి, నిన్ను పికప్‌చేసుకుంటాను. కాస్సేపు ఎక్కడైనా తీరిగ్గా మాట్లాడుకుందాం. ఆలోచించుకోవాలా, సరేనంటావా- అనడిగారు. ఏమనాలి? మళ్ళీ అదే డైలమా. ఏమవుతుందో అవనీ, ఏదైనా వుంటే అప్పుడు చూసుకోవచ్చుననుకున్నాను. సరేనన్నాను.

ఆయన వెళ్ళిపోయారు. ఆ రాత్రంతా డ్యూటీమీద వున్నాననేగానీ మనసు మనసులో లేదు. డాక్టర్లనూ, నర్సులనూ కలిపి లోకమంతా అనుకునేవన్నీ నిజమేనా, ఈయన కూడా ఏ లాడ్జింగు గదికో పోదాం, వస్తావా- అనడుగుతారా అనిపించింది. నాతో చాలా చనువుగా వుండే మరో సిస్టర్‌ను కదిలించి ఇండైరెక్టుగా మా డాక్టర్‌గారి గురించి ఆరాతీశాను. ఆయన అలాంటి పనులు ఎప్పుడూ చేయకపోవటమే కాక, మా హాస్పిటల్లో పనిచేస్తున్న డాక్టర్లలో ఒకాయన ఎవరో నర్సును ఒకసారి ఏదో అలాంటిమాట అన్నందుకు క్షమాపణ చెప్పించారని చెప్పింది తను. అప్పటివరకూ నాకు తెలిసికూడా ఆయన అలాంటివారుకాదు. మరి ఎందుకు రమ్మన్నారు?

మరునాడు పొద్దున్న నేను వెళ్ళేసరికి జానకి ఒంట్లో బాగాలేదని లీవ్‌పెట్టి, యింట్లోనే వుంది. తనతో చెబుదామనుకున్నానుగానీ చెప్పబుద్ధివేయలేదు. ఎప్పట్లాగా పదింటికి పడుకున్నానేగానీ నిద్రపట్టలేదు. అటూయిటూ దొర్లి, పదకొండుకల్లా లేచిపోయాను. ఇక అదిపని కాదని చెప్పి, వేరేపనుందని, బయట భోంచేస్తానని చెప్పేసి, మార్నింగ్‌షోకు వెళ్ళాను. ఏదో హొటల్లో టిఫిన్‌చేసి, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్ నుండి అబిడ్స్ వరకూ తీరిగ్గా షాపులు చూసుకుంటూ నడిచాను. అక్కడ బసెక్కేసి, యింటిదగ్గర దిగేసరికి నాలుగవటానికి పదినిమిషాలుంది. బస్టాపులో ఏదోపత్రిక కొనుక్కుని, స్టాపుకు రెండొందలగజాలు దూరంగా నడిచి, పత్రికతిరగేస్తూ నిలుచున్నాను. కాస్సేపటికి డాక్టర్‌గారి కారొచ్చి నాముందు నిలబడింది. ముందువైపు డోర్ తెరిచి నన్ను కూర్చోమన్నారు. కూర్చున్నాను. కారు కదిలింది.

ఎక్కడైనా పార్కులో కూర్చుని మాట్లాడుకుందామా లేక మా ఫ్రెండ్ గదొకటి వుంది

క్కడ, అక్కడయితే డిస్టర్బెన్సుండదు. అక్కడికెళదామా- అనడిగారు. అక్కడికెళ్ళినాక ఏమనడుగుతారు? నామీద తనకు మనసైందనీ, తనకోరిక తీర్చమనీ అడుగుతారేమో. తనుకాదంటే, రేప్ చేస్తారా? మంచి హెూదాలోవున్న ఒక మనిషి, ఆఫ్టరాల్ ఒకపూట శారీరక సుఖంకోసం అంతకు దిగజారతాడా? ఏమో, బ్రహ్మకైనా పుట్టురిమ్మతెగులు- అన్నారు కదా. ముక్కూముఖం తెలీనివాడి ముందు తల వంచి తాళికట్టించుకుని బతుకుఅర్పించుకున్నాను. అంతవరకూ అతనిగురించి ఒక్కవిషయమూ తెలియకుండా, ఒక్కమాటైనా మాట్లాడుకోకుండా, గదిలోకి పంపించి తలుపేస్తే నోరుమూసుకుని అనుభవించాను. నన్ను కన్నవాళ్ళనే పేరుతో, నాకన్నా పెద్దవాళ్ళనే విచక్షణతో నాజీవితంమీద అధికారం ఇచ్చి ఒకనరకం అనుభవించాను. అయిపోయింది. నాకు రెండు నెలలుగా తెలిసినమనిషి, మంచివాడేనని మనసు చెబుతున్న మనిషీ. ఏకాంతంగా గదిలో మాట్లాడుకుందామని నా అనుమతి అడుగుతున్నాడు. నాజీవితాన్ని నిర్ణయించే అధికారం పెద్దవాళ్లపై ఒకసారి వదిలేసాను. ఈసారి ఇంత చిన్నవిషయంలో కూడా యితరుల అవసరంలేకుండా నేను నిర్ణయించుకోలేనా- యిదంతా అయిదారు క్షణాల్లోనే ఆలోచించుకున్నాను. మీ యిష్టం- అన్నాను. అయితే మాఫ్రెండుగదికి వెళదాం- అన్నారు. అయిదారు నిమిషాల తరవాత ఒకవీధిలో ఒక చిన్నయింటిముందు కారాగింది. ఆ ఏరియాలో అన్నీ ఖరీదైన యిళ్ళలాగా వున్నాయి. విడివిడిగా, దూరంగా వున్న భవంతులమధ్య చిన్నపాటియిల్లు. నా వరకూ అడిగితే, అదేఖరీదైన యిల్లనుకోవాలి. లోపల కారుషెడ్‌లో కారాపేసి, తాళం తీశారు. ఇద్దరమూ లోపలికి నడిచాము.

హాలు అని చెప్పుకునే చిన్నముందుగది, ఆ పక్కనొక చిన్నగది, విశాలమైన బెడ్‌రూం, ఒక వంటగది, అటాచ్డ్ బాత్‌రూం, ఇంట్లో టెలివిజన్, ఫ్రిజ్‌లాంటివన్నీ వున్నాయి. కానీ ఎవరూ వుంటున్న జాడలేదు. మధ్యగదిలో సోఫాలో కూర్చున్నాను నేను. డాక్టర్‌గారు గుమ్మం తలుపుపెట్టి వచ్చి, నా ఎదురుగా మరో సోఫాలో కూర్చున్నారు.

"నేను చెప్పేవిషయం జాగ్రత్తగా విను. నీమీద నాకేదో తక్కువభావం వుందనీ, నిన్ను గురించి చెడుగా ఆలోచిస్తున్నాననీ మాత్రం అనుకోకు. నేనడిగేదానికి జవాబు చెప్పు"- అన్నారు.

నేను మౌనంగా తలూపాను.

"ఎంతకాలం ఇలా ఒంటరిగా వుంటావు, ఏం చేయాలనుకుంటున్నావు"- అడిగారు.

"మీరు చెప్పండి, ఏంచేయమంటారు?" అన్నాన్నేను.

"అలాకాదు... ఇది నీజీవితం. నువ్వు ఏంచేయాలనుకుంటున్నావో నాకెలా తెలుస్తుంది. నీ అభిప్రాయం ప్రకారం నేను సలహాయివ్వగలనేమో. అంతేకదా. పోనీ, మళ్ళీ పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నావా?"- ఆయన ప్రశ్నకు విరక్తిగా నవ్వాను.

"పెళ్ళా... ఒకసారి అయిన అనుభవం చాలు. ఇంకా యిప్పుడు నన్నెవరూ చేసుకుంటారు?"

"మీ ఆయన దగ్గరికి వెళ్ళదలుచుకోలేదని విన్నాను- నిజమేనా?"

అవునన్నట్టు తలూపి చెప్పాను- "ఆయన మళ్ళీ పెళ్ళికూడా చేసుకున్నారట. నేనుకాదంటే, బహుశా విడాకులిస్తానంటాడు. నేను మళ్ళీ తన దగ్గరికి వెళ్ళనన్నధైర్యం ఆయనలో బాగావున్నట్టుంది"

"ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడా? ఎప్పుడు? ఎవర్ని? అయినా ఈ విషయం ఇంతవరకూ నాకు తెలీదు"

"ఈ దేశంలో మగవాడు పెళ్ళిచేసుకుంటానంటే పిల్లనిచ్చేవాళ్ళకు కరువా? పోయిన నెలలో మా తమ్ముడొచ్చి చెప్పాడు. ఆయన పెళ్ళిచేసుకోబోతున్నారని. చేసుకోనీయమన్నాను. వాడు వెళ్ళిన వారంరోజులకు వాడి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది, పెళ్ళయిపోయిందని. ఆ ఉత్తరం చూడగానే బాధపడ్డాను- పాపం మరో అమ్మాయికి నేననుభవించిన నరకం అనుభవించే డ్యూటీ వచ్చిందనుకొని. నాషిఫ్ట్ అయిపోయింది. మళ్ళీ మొదలయ్యే ప్రశ్నలేదు. ఆ అమ్మాయి షిఫ్ట్ ఎంతకాలమో. ఈ విషయం జానకితో కూడా చెప్పలేదు. ఎవరికి చెప్పుకుని ఏం లాభం?"

"చూడు ఆనందం... నేనొకమాట చెబుతాను జాగ్రత్తగా విను. మనిషికితోడు కావాలి. శారీరకంగాకానీ, మానసికంగాకానీ అలసిపోయిన మనిషి సేద తీర్చుకోవడానికి ఒక తోడు లేకుండా బతకటం చాలా కష్టం. ఉదాహరణకు నన్నే తీసుకో. నాభార్యకు ఎంతసేపూ క్లబ్బులూ, స్నేహితులూ తప్ప ఇల్లూ, పిల్లలు అనే ధ్యానవుండదు. అందుకే మానసికమైన ఒంటరితనంతో నేను బాధపడుతున్నాను, కొన్ని సంవత్సరాలుగా. దీన్ని స్నేహితుల్లాంటి వాళ్ళెవరూ పూడ్చలేరు. శారీరకవాంఛలకోసమే అయితే అందుకు డబ్బుంటే సరిపోతుంది. కానీ నాకు ఆర్తిగా పెనవేసుకోవటానికొక మనిషి కావాలి. అది దొరకదు. ఇన్ని ఉన్న నేనే యింతగా తపిస్తుంటే, నీకు ఎలా వుంటుందో చెప్పనవసరంలేదు. నువ్వు ఒంటరిదానివి. మన సమాజంలో ఒంటరిస్త్రీ బతకటం ఎంత కష్టమో అనుభవంతో తప్ప తెలియదు. నేను చెప్పేది సరిగ్గా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. నీ అసహాయతను ఆధారంగా చేసుకుని నేనిలా అడగడం లేదు. నా అసహాయతను కూడా నువ్వు అర్థంచేసుకోమని చెబుతున్నాను. ఈ వయసులో ఏ కన్నెపిల్లనో రెండోపెళ్ళి చేసుకుని, ఆమె గొంతు కోసే కాఠిన్యం లేదు. నాభార్యకు విడాకులిచ్చి, నా పిల్లల్ని సంసారాన్ని ఛిన్నాభిన్నం చేసుకునే ధైర్యమూలేదు. విచ్చలవిడి శృంగారం మీద ఆసక్తేలేదు. డబ్బు సంపాదించిపెట్టే యంత్రంగా ఇంట్లోనూ, రోగాలు నయంచేసే మంత్రదండంగా హాస్పిటల్‌లోనూ, అంతే తప్ప మనసువిప్పి మాట్లాడుకునేందుకు నన్ను మనిషిగా చూసేవారులేరు. నువ్వు ఒప్పుకుంటే.... ఒప్పుకుంటే... నీకు నేను... నాకు నువ్వూ.... నీకు మళ్ళీ పెళ్ళి చేసుకునే ఆలోచన లేకపోతేనే... ఆగు, అప్పుడే మాట్లాడకు. నేను చెప్పేది సాంతం విను. ఇందులో బలవంతం లేదు. అలాగే నీ వుద్యోగానికీ, దీనికీ సంబంధంలేదు. నువ్వు నా హాస్పిటల్‌లో నేని



చ్చ జలంమీద ఆధారపడి బతుకుతున్న అన హాయురాలివనే తృణీకారంతో నిన్నిలా అడ గడం లేదు. నువ్వెందుకు ఒప్పుకోకపోయినా సరే- అందులో నేను బాధపడేదేమీ లేదు. నువ్వూ నాలాగే నిస్సహాయస్థితిలో వున్నావు. మనిద్దరికీ పొత్తు కుదురుతుందనే అభిప్రా యంతో అడుగుతున్నాను. నీ మెడలో తాళికట్ట మని మాత్రం నన్నడగకు. చట్టవరంగా తప్పి స్తే, అన్నివిధాలా నిన్ను భార్యలాగే చూసు కుంటాను. ఈ విషయం నా భార్యకు తెలిస్తే ఎలాగని భయపడకు. ఇలాంటివి ఎంతోకాలం దాచిపెట్టలేము. తెలిసినరోజున తెలియనీ. అప్పటికీ నేనుమాత్రం దూరంకాను. అయితేగి యితే నాభార్య నాకు మరింత దూరమవు తుంది. అదినేను లెక్కచేయను. పదిహేడేళ్ళు గా సంసారం చేస్తున్నాను. నాభార్య నాకు ఎంత సుఖం యివ్వగలదో, సంసారాన్ని ఎంత బాగా చక్కదిద్దుకోగలదో నాకు తెలుసు. ఆమెకు కావలసింది డబ్బు, హెూదా మాత్రమే. మహాఅయితే స్త్రీసహజమయిన బు ద్ధితో గొడవ చేస్తుందేమో. తనుకూడా అంతక న్నా ఎక్కువ పట్టించుకోదు. నువు బాగా ఆలో చించుకుని, నీ అభిప్రాయం ఏదైనా సరే నాకు స్పష్టంగా చెప్పు. ఒకవేళ నేను తప్పుగా ఆలో చించి వుంటే సరిదిద్దుకుంటాను. నీకు క్షమాప ణలు చెప్పుకుంటాను...''

''నాకు మళ్ళీ పెళ్ళిచేసుకునే ఉద్దేశంలేదు. నన్ను ఏం చేయమంటారో మీరే చెప్పండి'' అడిగాను నేను.

''ముందుగా నువు ఏం చేయకూడదో చెబు తాను విను. నా దగ్గర డబ్బు మాత్రమే ఆశించి ఒప్పుకోకు. అలాగని నేను నీకు ఏలోటూ చేయను. చెప్పాను గదా- తాళి కట్టిన భార్య లాగా చూసుకుంటాను. నువూ అలాగే వుండు. నాభార్య దగ్గర నేను పొందలేకపోయిన స్వాంతన, నీ భర్త దగ్గర నువు పొందలేకపో యిన మనశ్శాంతి—అదీ మన మధ్య దొరకవల సింది. నాకిప్పుడు ముప్పైయ్యేడేళ్ళు. బహుశా నాకన్నా పదిహేనేళ్ళు చిన్నదానివనుకుంటా ను. ఇంకో అయిదేళ్ళు ఓపిక పడితే మరో యిల్లు కట్టుకుందాం. అప్పుడు నీకు యిష్టు డు కనిపించే దూరంకూడా కనిపించదు. ఉద్యోగం, పిల్లలు—అన్నీ నీయిష్టం''

నేను ఏమీ మాట్లాడలేదు. నన్నేం చేయ మంటారో మీరే చెప్పండి—అని ఆయనను అడగడంలో నాఉద్దేశం, ఆయన సలహా కావా లని. కానీ ఆయన అర్థంచేసుకోలేదు. నేను క్లారిఫికేషన్స్ అడుగుతున్నాననుకుని అదంతా చెప్పారు.నాకు ఎటూ పాలుపోలేదు. ఆలో చించుకోవాలి. సలహాలు ఎవర్నీ అడగడానికి లేదు. ఇందులో కష్టం ఎదుర్కోవాల్సినా, నష్టం ఎదురైనా నేనే భరించాలి. అంతలో ఆయన మళ్ళీ చెప్పారు—

''ఈ యిల్లు మా అన్నయ్యది. ఆయన ప్రాక్టీస్‌పెట్టిన మొదట్లో కట్టుకున్నాడిది. పదేళ్ళ యింది, తను ఫారిన్ వెళ్ళి. ఇప్పుడు ఫామిలీ తోసహా సెటిలైపోయాడు. మూడేళ్ళనుండీ ఖాళీగా వుంటూంది. నాకు ఒంటరిగా గడపటా నికి బాగుంటుందని ఎవరికీ అద్దెకివ్వకుండా వుంచేశాను. ఏమీ తోచనప్పుడల్లా ఇక్కడికొ స్తూంటాను. నా థిక్కెస్ట్ ఫ్రెండ్స్ వచ్చినప్పుడు వాళ్ళను ఇక్కడుంచుతాను. మీ ఫ్రెండ్ యింట్లో బహుశా నువు హాస్పిటల్‌కు వెళ్ళావ నుకుంటారనుకుంటాను. నీకు యిష్టమైతే ఈ రాత్రికి యిక్కడే వుండు, ప్రశాంతంగా ఆలో చించుకో. నేను మరో గంటలో హాస్పిటల్‌కు వెళ్ళి, ఒకసారి రౌండ్స్ వేసి యింటికి వెళ్ళాలి. పొద్దున్న నేనొచ్చేవరకూ హాయిగా వుండొచ్చు- ఏమంటావ్?''

పొద్దున్న బయలుదేరినదాన్ని ఎటూగాని సమయంలో ఏమని వెళ్ళాలి. అప్పటికే నా మనసులో ఒక అభిప్రాయం సగందాకా వచ్చే సింది. అందుకే సరేనన్నాను.

నేను వద్దంటున్నా బలవంతంచేసి హెూట ల్‌కు తీసుకెళ్ళారాయన. టెన్షన్‌మూలంగా నేను ఏమీ తినలేకపోయాను. దారిలో ఒక డజను పత్రికలు కొన్నారు. అవన్నీ తనకోసమే ననీ, ఆ రాత్రికి నా దగ్గరుంచుకోమనీ చెప్పారు. తనమాట నేను ఒప్పుకునేందుకు లంచంకా దని జోక్ వేశారు. నాక్కూడా నవ్వొచ్చింది. నన్ను మళ్ళీ ఆ యింట్లో వదిలేసి ఆయన వెళ్ళిపోయారు.

కాసేపు టీవీపెట్టుకొని కూర్చున్నాను. చూడబు ద్ధికాలేదు. టేప్ రికార్డర్ ఆన్ చేశాను. వినబుద్ధి

కాలేదు. పుస్తకాలు తిరగేశాను. కళ్ళకు కనిపిస్తున్న అక్షరాలు మెదడుకు చేరటంలేదు. మనను పరిపరి విధాలపోతోంది. ఆయన మాటలు విన్న తరవాత నా జీవితానికి భద్రత లేదన్న విషయం నాకు మొదటిసారిగా స్పష్టంగా తెలిసింది. నేనేం చేయాలి?

ఒకసారి పెళ్ళయి మొగుణ్ని వదిలేసినదాన్ని. నన్ను అంత సహృదయంతో పెళ్ళిచేసుకునేవాళ్ళుంటారా? ఉంటే నాకు తారసపడతారా? వేలూ లక్షలూ కట్నాలు కుమ్మరించీ, లాంఛనాలిచ్చీ చేసిన పెళ్ళిళ్ళే నిలవటంలేదు. కట్నాలు చాలలేదనీ, లాంఛనాలు కావాలనీ పెళ్ళాల్ని పుట్టింటికి పంపీ, తన్నీ వీధిలోకి నెట్టేసి, చివరకు కిరోసిన్‌పోసి తగలబెడుతున్న భర్తలూ, అత్త, మామలూ సంచరిస్తున్న ఈ జనారణ్యంలో నేను మళ్ళీ పెళ్ళిచేసుకుని, లక్షణంగా కాపురం చేసుకోగలననుకోవటం జరిగేపనేనా? నా దగ్గరేముందనినన్ను ఎవరైనా ప్రేమిస్తారు? నేనేమీ కన్నెపిల్లను కాదు. అందమైనదాన్నీకాదు. వేలరూపాయల జీతం వచ్చే ఉద్యోగస్తురాలినీ కాదు. వెనక ఆస్తిపాస్తులున్నదాన్నీ కాదు. ఎవరైనా నన్ను ఏమని పెళ్ళిచేసుకుంటారు? కట్నాలూ, లాంఛనాలూ తీసుకుని పెళ్ళిచేసుకున్నవాడే అన్నెంపున్నెం ఎరుగని మొదటిరోజునే నన్ను అనుమానించాడే. అలాంటిది మొగుణ్ని వదిలేసి, ఒంటరిగా ఉద్యోగం చేసుకుంటూ జీవిస్తున్న యిప్పుడు నా నిజాయితీని గుర్తించి నన్ను పెళ్ళి చేసుకునేందుకు ఎవరు ముందుకొచ్చి, ఇవన్నీ సవ్యంగా అర్థంచేసుకుని నన్ను ఆదరిస్తారు?

ఆ స్థితిలో నేను నాపుట్టింటికి వెళితే, మహా అయితే నాకంత ఆశ్రయం దొరుకుతుందేమో. అంతకన్నా వాళ్ళు నాకు ఏంచేయగలరు? ఇంకా ఏం చేయాలని ఆశించాలి? ఎప్పటికైనా నా జీవితం నాదేకదా?

ఎవరి అండాలేకుండా ఎంతకాలం బతకగలను? నాసంసారం అనేది లేకుంటే పోనీ. నామనుమలనేవాళ్ళు నాకెవరు మిగులుతారు? నాపిల్లలు.... అవును, పిల్లలే నావాళ్ళు అవుతారు. నా ఉద్యోగం నేను చేసుకుంటూ, నా పిల్లల్ని నేను పెంచుకుంటూ, ఏ ఆత్యాశలూ లేకుండా ఉండగలిగితే చాలుకదా. డాక్టరుగారు నాకు తోడుగా ఉంటానన్నారు. అందులో నష్టంకన్నా లాభమే కనిపిస్తోంది. ఒక మగతోడు వున్నాడు, కష్టసుఖాల్లో పంచుకునే ఒక మనిషి వున్నాడు ఇతర సమస్యలుండవు. ఆయన తాళికట్టకపోతేనేంగాక అంతేచాలు. ఆయనా దుర్మార్గుడైతే..... విడిపోవటానికి క్షణం చాలు. అప్పుడు యింతకన్నా ఎక్కువ జరిగే నష్టం ఏముంటుంది? ఆయన మంచివాడైతే.... ఇక ఈ జీవితానికి చింతలేదు, ప్రశాంతంగా బతకొచ్చు.

అప్పుడు తట్టింది సమాజంలో నా హోదా ఏమిటి? డాక్టర్‌గారి ఉంపుడుకత్తె నంటారు. అనుకోనీ. కన్నతండ్రిని ఒకడు 'నాన్నా' అంటాడు, మరొకడు 'అయ్యా' అంటాడు, యింకొకడు 'డాడీ' అంటాడు, కోపం వచ్చినప్పుడు ఎదుటి వాడు 'అమ్మ మొగుడు' అంటాడు. ఏదన్నా తండ్రి తండ్రేకదా. మా సంబంధానికి ఎవరేం పేరుపెడితే నాకేమిటి? ఆయనగారు చేసిన ప్రచారానికి మా ఊళ్ళో అందరూ నన్ను కులటననీ, ఒళ్ళు కొవ్వి మొగుడి దగ్గర్నించి లేచిపోయిందాన్ననీ అనుకుంటున్నారు. అప్పుడులేని బాధ యిప్పుడెందుకు? అప్పుడు నాభర్త తప్పు సరిదిద్దలేనివాళ్ళంతా ఇప్పుడు నాజీవితాన్ని నేను సరిదిద్దుకుంటూంటే మరోరకంగా నన్నే ఎత్తిపొడిస్తే నేనెందుకు పట్టించుకవాలి?

నేను మరో కాపురంలో నిప్పులు పోస్తున్నానా? లేదు. కట్టుకున్నవాడు స్వయంగా నాకాపురం కూలదోశాడు. అప్పుడు చక్కదిద్దుకునేపాటి తెలివిలేని దాన్ని నాకు మరో కాపురం పాడుచేసే శక్తియుక్తులెక్కడివి? డాక్టర్‌గారి భార్య తానే స్వయంగా తన భర్తను దూరం చేసుకుంది. ఆయనఅభిప్రాయానికొచ్చాడంటే అందులో ఆవిడ ప్రవర్తనే ముఖ్యకారణమేమో కానీ నా ప్రసక్తి మాత్రంలేదు. నా జీవితానికి నేను భద్రతకూర్చుకుంటున్నాను. అంతే నాకు తెలిసింది. దీన్ని సమర్థించుకోవడమంటారో, సవ్యంగా విశ్లేషించడమంటారో నాకు తెలియదు. అది నాకు కలిగిన ఆలోచన- అంతే!

అలా ఆలోచిస్తూ ఎప్పుడు నిద్రపోయానో తెలియదు. హఠాత్తుగా మెలకువొచ్చింది. చూసుకునేసరికి తెల్లవారుఝామున అయిదవుతోంది. మత్తులోంచి తేరుకుని గబగబా స్నానం అదీ

కానిచ్చాను. కాసెట్లలో సుబ్బలక్ష్మి పాడిన సుప్ర
భాతం వున్నట్టు గుర్తొచ్చి, అది తీసి ప్లేచేశాను.
తలుపులూ కిటికీలూ తెరిచాను. అప్పుడే
ఎండ లేలేత కిరణాలతో దూసుకొస్తూంది. చు
ట్టువక్కల ఎవ్వరూ నిద్రలేవనట్టుంది. తల
స్నానం చేసిన శరీరమూ, తేలికపడిన మన
సూ, ఆహ్లాదంగా వున్న వాతావరణం, చెవుల
కింపుగా వినిపిస్తున్న సుప్రభాతం- నాజీవితాని
కి సుప్రభాతంతో తొలిపొద్దు పొడుస్తున్నట్టుంది.
చాలారోజుల తరవాత మనసంతా హాయిగా
అనిపించింది.

అప్పుడు గుర్తువచ్చింది- నేను సమ్మతించిన
విషయం ఆయన కెలా తెలియజెయ్యాలని?
వెంటనే ఒక ఆలోచనొచ్చింది. ఇల్లంతా వెతగ్గా
ఒక చీపురుకట్ట దొరికింది. వాకిలి శుభ్రంగా
ఊడ్చి, గచ్చుమీద నీళ్ళు చల్లాను. ఇల్లంతా
ఊడ్చేసి, అన్నీ శుభ్రంగా సర్దిపెట్టాను.
వంటింట్లో పాలపొడి, కాఫీపొడి కనిపించాయి.
కాఫీ చేసి, ఫ్లాస్కులో పోశాను. చక్కెర లేన
ట్టుంది, కనిపించలేదు. చక్కెర లేని కాఫీ ఇస్తే
ఆయన మళ్ళీ ఏం అపార్థంచేసుకుంటారోనను
కుని ఇల్లు తాళంపెట్టి, వీధి చివరకు నడిచా
ను. మెయిన్ రోడ్డుమీద ఒక కిరాణా దుకాణం
కనబడింది. అక్కడ చక్కెర కొంటుండగా
బ్రెడ్ కనిపించింది. ఫ్రిజ్‌లో గుడ్లున్నట్టు గుర్తొ
చ్చి, బ్రెడ్ తీసుకున్నాను. ముగ్గు కావాలి. ఎలా?
ముగ్గు అమ్మరుకదా? పోనీ బియ్యంపిండి?-
అడిగాను. నాకేసి విచిత్రంగా చూసి,
బియ్యంపిండి ఏకొట్లోనూ అమ్మరని అన్నాడు
కొట్టతను. మళ్ళీ ఎందుకని అడిగాడు. ముగ్గే
యటానికని చెప్పగానే చాక్‌పీస్‌లున్నాయని
ఇచ్చాడు. అన్ని రంగులవీ రెండేసి కొను
క్కుని, జాగ్రత్తగా మళ్ళీ వచ్చేశాను. తెచ్చిన
వంచదారలో సగందాకా ఫ్లాస్కులో పోసి, స్పూ
నుతో కలిపి మూతపెట్టాను. చాక్‌పీస్‌లు నీళ్ళ
ల్లో ముంచి, నాకొచ్చిన మంచి ముగ్గులు గుర్తు
కుతెచ్చుకుని, వాకిట్లో గచ్చునిండా రంగు
రంగుల ముగ్గులు గీశాను. అప్పటికీ సంతృప్తి
కలగలేదు. ఆముగ్గులన్నీ దాటి గుమ్మం దగ్గ
ర్నించి లోపలికడుగుపెట్టే దగ్గర 'వెల్‌కమ్'
అని అక్షరాలు రాశాను.

సర్దిన ఇల్లూ, తీర్చిదిద్దిన ముగ్గులూ చూసు
కుంటూంటే అది నాఇల్లయి, నేనా ఇంటి
ఇల్లాలినన్నట్టు అనిపించిందో క్షణం. అంత
అదృష్టం నాకు లేదు. నా జీవితానికి నాకు
అందనున్న అవకాశమే గొప్పది. మళ్ళీ
ఉత్సాహం తెచ్చుకుని వంటగదిలోకెళ్ళాను.
అక్కడ వంట వరికరాలు తప్ప వంట చేసు
కునే సామాన్లేవి లేవు. స్పైస్ స్టాండులో కొంచెం
ఉప్పు, కొంచెం మిరియాల పొడి వున్నాయి.
షెల్ఫులో సాస్ సీసా వుంది. ఇల్లంతా నిరాశగా
తిరగ్గా తిరగ్గా కొబ్బరి నూనె సీసా కని
పించింది. సరే అనుకుని ఫ్రిజ్‌లోని గుడ్లు
తీసి వగలకొట్టి, బ్రెడ్ ముక్కలు అందులో
ముంచి, ఎగ్‌టోస్ట్ చేశాను కొబ్బరి నూనెతో.
అవన్నీ ఒక డిష్‌లో పెట్టి మూతపెట్టేశాను.
టేప్ రికార్డర్ టపాటపామని కొట్టుకుంటున్న
శబ్దం వినిపించింది. పెట్టిన కేసెట్ అయిపో
యింది. కేసెట్ పాతబడినట్టుంది. ఆటోస్టాప్
వని చెయ్యక కొట్టుకుంటున్న శబ్దం వస్తుంది.
దాని సంగతే మరచిపోయాను. వెళ్ళి దాన్ని
ఆఫ్ చేశాను. నాదస్వరం కేసెట్ కనిపించింది.
ఊహు- బారెడు పొద్దెక్కింది. ఇప్పుడు
బావుండదు. మళ్ళీ ఉన్న కేసెట్లన్నీ వెతికాను.
చౌరిసియా బాసుర్ తీసి ప్లేచేశాను. ముందు
గదిలోకెళ్ళి కూర్చున్నాను.

ఏదో పత్రిక తీసి తిరగేస్తూ కూర్చున్నాను.
వేణుగానం హాయిగా వినిపిస్తూంది. మన
సంతా గజిబిజిగా తమాషాగా ఉంది. గుండెలో
తుల్లో ఎక్కడో ఏదో సంకోచం, మరో మూలలో
ఏదో భయం, ఇంకో మూల చెప్పరాని ఉద్వేగం,
ఇవన్నీకాదని ఎందుకో తన్నుకొస్తున్న
ఉత్సాహం, కుదురుగా కూర్చోనీయని అయో
మయస్థితి. ఎందుకో మళ్ళీ పదహారేళ్ల ప్రా
యంలోకి తిరిగి వెళ్ళి, జీవితాన్ని అప్పుడే
ఎదుర్కోబోతున్న విచిత్రానుభూతి, "పువ్వు
పూసి మొగ్గయ్యింది"-అని ఎక్కడో విన్న కవి
త్వం గుర్తొచ్చింది.

అంతలో కారు ఆగిన చప్పుడు ... డాక్టర్‌గా
రు లోపలికొస్తున్నారు. నిలబడకుండా అక్క
ణ్నించి తొంగిచూశాను. కాంపౌండ్ లోపలకొచ్చి
ముగ్గులన్నీ కలయచూస్తున్నారు. గుమ్మం దగ్గ
రకొచ్చి ఆగిందాయనచూపు. అక్కడ నేను
రాసిన 'వెల్‌కమ్' కనిపించినట్టుంది. ఆ అక్ష
రాల మీద కాలువడకుండా కాబోలు జాగ్రత్తగా

లోపలికొచ్చారు.

"ఏమిటిదంతా?" అన్నారు తమాషాగా నవ్వుతూ.

నేను చప్పున లేచి నిలుచున్నాను.

"ఇప్పుడే వస్తాను" అని లోపలికి నడిచాను.

ఆయన నా వెనుకే లోపలికొచ్చారు. నేను సర్దినదంతా చూస్తున్నారు పరీక్షగా. కప్పుల్లో కాఫీ పోసుకొచ్చి ఆయనకో కప్పు అందించాను. ఎందుకో చెయ్యి గడగడా వణికింది. సాసర్ మీద నాట్యంచేస్తున్న కప్పు తాలూకు గణగణ సంగీతం విని ఆయన కాఫీ కప్పు అందుకుని-

"కూర్చో... రిలాక్స్ రిలాక్స్" అన్నారు అనునయంగా.

కాఫీ ఒక గుక్క తాగగానే గట్టిగా నవ్వారు-

"అయితే నీ సమ్మతి తెలపటం కోసం కాఫీలో ఇంత పంచదార పోశావా? రోజూ ఇలాంటి కాఫీ ఇచ్చావంటే పేషంట్నైపోతాను" అన్నారు.

అనాలోచితంగా సగం పొట్లం కుమ్మరించిన సంగతి గుర్తొచ్చి సిగ్గుపడ్డాను.

"అదక్కడ పెట్టేయండి, మళ్ళీ కలుపుతాను" అన్నాను కంగారుగా.

"ఊహుఁ- వద్దు. కాఫీలో పంచదార ఎక్కువైనా తక్కువైనా ఫర్వాలేదు. సంసారంలో సయోధ్యమాత్రం కరువు కావొద్దు. నువు తొలిసారిగా ఇచ్చిన కాఫీ తియ్యగా ఉంటే నష్టమేముంది?" అన్నారు తాగేస్తూ.

కాస్సేపైనాక మళ్ళీ అన్నారు-

"ఇదే ఆనందం నేను కోరుకున్నదీ, నాకు కరువైందీ కూడా. స్త్రీ స్వాతంత్ర్యం, సమానహక్కులూ అని ఆ ట్రాష్ అంతా నాకు నచ్చదు. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నప్పుడు ఇద్దరూ సర్దుకుపోవాలి. కానీ ఉద్యోగం చేసే అవసరం లేనప్పుడు చేయాలని ఇష్టం లేనప్పుడు, సంపాదన అనే పనిని భర్త నిర్వహిస్తున్నప్పుడు, ఇల్లు చక్కదిద్దుకోవటమనే పనిని భార్య నిర్వహించడమంటే అందులో తప్పులేదు. కానీ ఉందంటుంది నాభార్య. తను ఆ పనులన్నీ చేయటానికి పుట్టలేదంటుంది. ఒక్క పనులు చేయటమనే కాదు, చేయకపోయినా ఫర్వాలేదు. ఒద్దిక అనేది మనసులోనుండి రావాలి. అది తనలో లేదు. నువ్వేమనుకున్నా సరే, ఇప్పుడనిపిస్తూంది- ఆభార్యా, ఆసంసారం లేకుండా ఉంటే ఇదే మనఇల్లయి, నువ్వే నా ఇల్లాలివైతే ఎంతబాగుండేదని. నా జీవితానికి ఇక ఆ అవకాశం లేదు. ఇదే నాకు మహా అదృష్టం అనుకుంటాను"

నేను మౌనంగా వింటున్నాను, ఆయన చెప్పుకుపోతున్నారు-

"ఇంతకూ నువు మనస్ఫూర్తిగా ఒప్పుకున్నానని ఈ సింబాలిజమ్‌లతో అనుకోమంటావా?"

ఆయనడిగిన ప్రశ్నకు సిగ్గువిడిచి అవునని ఎలా చెప్పాలో అర్థం కాలేదు. తలదించుకుని కూర్చున్నాను.

"ఏమంటావు?" లేచి నాపక్కన కూర్చుని అడిగారు.

"మీ ఇష్టం" ఎంతనెమ్మదిగా అన్నానంటే, ఆయనకు వినిపించిందోలేదో తెలియదు.

"థాంక్స్" అన్నారు.

"నేనే మీకు థాంక్స్ చెప్పుకోవాలి" మనసులోని మాట బైటికి అనలేకపోయాను.

"ఒక వారంరోజుల తరవాత మెడ్రాస్ వెళదాం. ఒక పదిరోజులు అక్కడుండి వద్దాం. ఆ తరవాత ఏం చేయాలనేది ఈవారం రోజులూ మాట్లాడుకుందాం. ఒకరికొకరం సన్నిహితమవుతాం. నీ మనసులో వున్న భయాలూ, అనుమానాలూ ఆ లోగా తీరిపోతాయి. అది మనిద్దరికీ మంచిది. అవునూ...నేనే మాట్లాడుతున్నాను నువు మాట్లాడేదేమీలేదా? ఏమైనా మాట్లాడు, ఏమైనా అడగాల్సింది వుంటే అడుగు"

నాక్కూడా ఒక మాట చెప్పాలనే వుంది. గొంతు పెగుల్చుకుని మెల్లిగా చెప్పాను-

"నేను మీ మాటకెప్పుడూ ఎదురుచెప్పను. మిమ్మల్ని ఏమీ అడగను. కానీ మీరు మాత్రం....నన్ను...నన్ను...ఎప్పుడూ కొట్టకూడదు. దెబ్బలంటే నాకు భయం"

"యూ స్టుపిడ్- నిన్ను నేను కొట్టడమా, అలాంటివేమీ పెట్టుకోకు. ఈ ఓల్డేజ్‌లో ఫస్ట్‌లవ్‌లాగా అనుకో. ఎందుకో నీ గురించి మీ

జానకి చెప్పి ఉద్యోగం యిప్పించమన్నప్పుడు నీమీద జాలి కలిగింది. నువు ఉద్యోగంలో చేరిన మొదటి రోజున నీ సిన్సియారిటీ చూసి సంతోషం కలిగింది. వారంరోజుల్లో, మరో లేడి ఆఫ్ ద ల్యాంప్, అదే ఫ్లారెన్స్ నైటింగేల్‌ను చూస్తున్నందుకు గౌరవం కలిగింది. ఆ తరువాత బహుశా నీతో మాట్లాడుతున్నప్పుడనుకుంటాను, ఒకరకంగా నేనూ నీలాంటి పరిస్థితిలోనే వున్నాననే ఆలోచన వచ్చిందేమో, అప్పట్నించీ నువ్వూ, నేనూ ఒకటేనన్న భావన రోజు రోజుకూ అది నీ పట్ల ఆకర్షణగా మారింది. నువు నమ్మినా నమ్మకపోయినా నువులేకుండా బతకలేనేమోననిపించింది. పరీక్షలు రాసి, రిజల్ట్స్ కోసం ఎదురుచూసే కాలేజీ కుర్రాడిలా గడిపాను రాత్రంతా- నువ్వేమంటావో, కాదంటే ఎలా, ఏం చేయాలి-యిదే ఆలోచన.అన్నట్లు నువు చలం పుస్తకాలు చదివావా? ఒకచోట చలం అంటాడూ-ఎంత ప్రేమ కలిగినా శృంగారం లేనిలోటును భర్తీచేయలేదు. అందుకే కొందరు భర్తలు తమ భార్యల్ని ఎంతో ప్రేమిస్తూ కూడా మాయమైన శృంగారానుభవం కోసం పై సంబంధాలు వాంచిస్తారు-అని. కానీ యిది నేను ఒప్పుకోను. ఆ భార్య ఎంత శృంగారానుభవం పంచియిచ్చినా నరే, అందుకే మానసిక వాంఛలేకపోతే, ఆ శృంగారం కూడా వెగటుపుడుతుంది. ఆఫ్టరాల్, శృంగారం కూడా మనసులో నుండి జనించే మానసికానుభూతే కదా. అది తరవాత శారీరక అనుభవంగా మారుతుందేగానీ, మనసులో సంతృప్తిలేకుండా శృంగారంలో ఎక్కణ్నించి వస్తుంది సంతృప్తి ? అందుకని, నిన్ను నేను కొడతాననో, తిడతాననో భయాలు పెట్టుకోకు. సమాజం గురించి యిక మరచిపో. మనిద్దరం భార్యాభర్తలం. ఏం చేసినా మనకు సంబంధించిన ప్రతిపనీ నిన్నడిగే చేస్తాను... అర్థమయిందా?''

కాపురం చేసే లక్షణం కాలిగోరే చెబుతుందన్నట్టుగా, అప్పుడాయన అన్న మాటలతోనే నాకాయనతత్వం అర్థమయింది. మేం మెడ్రాస్ వెళ్లేవరకూ ఆయన నన్ను కోరలేదు. కోరితే నేను కాదనే దాన్నికాదేమో. కానీ అదాయన స్వభావం కాదు. ఆ వారంరోజులు ఎన్నో సంగతులు మాట్లాడుకున్నాం. నాకు ఉద్యోగం వదులుకోవటం యిష్టం లేదనీ, కాలక్షేపానికైనా వుండాలనీ అనగానే ఒప్పుకున్నారు. కానీ నన్ను తన హాస్పిటల్లో మానేయమన్నారు. "మన వృత్తిలో మనకు కొన్ని నియమాలుండాలి. నువు నా హాస్పిటల్లో నర్సుగా పనిచేస్తూ నాతో జీవిస్తున్నావంటే, అది మనిద్దరివృత్తికీ కళంకమే. అందరూ మామూలుగా డాక్టర్లనూ, నర్సులనూ గురించి చెడుగా అనుకునే మాటల్ని నిజం చేయడమవుతుంది'' అని అన్నారు. నెలరోజుల్లో తన ఫ్రెండ్ హాస్పిటల్లో ఉద్యోగం యిప్పించారు. అదే యిప్పుడు నేను చేస్తున్న ఉద్యోగం.

మద్రాను వెళ్ళి, ఓ గుళ్ళో పూలదండలు మార్చుకున్నాం. హొటల్లో మా ఫస్ట్ నైట్ డెకరేషన్ చూసి నాకు ఎంతో సంతోషం కలిగింది. ఆయనతో పంచుకున్న సుఖంకాదు- ఆయన నాకిచ్చిన విలువకూ, నాపట్ల చూపుతున్న శ్రద్ధకూ నాకు ఆనందం కలిగింది. ఆయన అన్నది నిజమేనని అప్పుడు పూర్తిగా అర్థమయింది. 'తన' అనే మానసికభావనలోంచే ప్రేమ,ఆదరణ, సంతృప్తీ పుట్టుకొస్తాయి. ఆ పదిరోజులూ హనీమూన్ అన్నమాటకు నిజమైన అర్థం ఎలా వుండాలో తెలిసింది. నా గతమంతా మరచిపోయాను. కొత్త జీవితం ప్రారంభించాను.

మద్రాను నుండి రాగానే జానకి దగ్గర్నించి వెళ్ళిపోయాను. తాత్కాలికంగా ఆయన అన్నగారి ఇల్లని చెప్పానే, అందులో ఉంచారు నన్ను. ఈ ఉద్యోగం వచ్చిన వెంటనే హాస్టల్‌లో ఉంటానని చెప్పాను. సరేనన్నారు. అప్పుడప్పుడూ ఆ ఇంట్లో కలుసుకుంటాం. లేదా ఏ హొటల్‌కో వెళ్ళి భోంచేసి, మాట్లాడుకుంటూ కారులో తిరుగుతాం. అందరూ అనుకున్నట్టు ఒళ్ళు కొవ్వెక్కిన కోరికలు తీర్చుకునేకన్నా మా కాలంలో చాలాభాగం కబుర్లతోనే గడుపుతామంటే మీరు నమ్ముతారో లేదో కానీ అదే నిజం. కోరికలంటారా నేనూ మనిషినే, ఆయనా అంతే... కానీ ప్రధానమైనది అది కాదు. అర్థం చేసుకున్నవాళ్ళే చేసుకుంటారు.

"మొదటి నెలలో బోల్డు చీరలూ, ఒక

చెయినూ తీసుకున్నారు. ఆ తరవాత నేనేవద్దని మాన్పించాను. అయినా ఇప్పటికీ నాకు అవసరమైనవన్నీ ఆయనే కొనిపెడతారు. నా పేరున నెలకు వెయ్యి రూపాయలు ఆయనే బ్యాంకులో వేస్తారు. మూడో నెలలోనో, నాలుగోనెలలోనో నాకు పాస్‌బుక్ ఇచ్చినప్పుడు నాకా డబ్బు అవసరం ఉండదనీ, రికరింగ్ డిపాజిట్‌గా మార్చమనీ చెప్పాను. ఇప్పుడలాగే వేస్తూ ఉన్నారు. కలిసినప్పుడల్లా దగ్గరుంచుకోమని ఎంతోకొంత డబ్బు ఇస్తుంటారు. ఖర్చుపెట్టుకోమంటారు. ఏడాది కింద నా పేరున ఒక ప్లాట్ కొన్నారు. మరో రెండేళ్ళ కల్లా అక్కడ ఇల్లు కట్టడం పూర్తయిపోతే మేం ఇద్దరమూ అక్కడే ఉండవచ్చునన్నారు. అంతవరకూ పిల్లల్ని కనకూడదని అనుకున్నాము. అప్పుడు ఉద్యోగం మానేసి, పిల్లలకు స్కూలుకు వెళ్ళే వయసువచ్చిన తరవాత కావాలకుంటే మళ్ళీ ఉద్యోగం చేసుకోమన్నారు. "అప్పుడైనా ఉద్యోగం మానేయడానికి భయమైతే ఎలాగోలా కష్టపడి, నీకు ఎలాంటి భయాలూ ఉండకుండా ఓ లక్ష రూపాయలు నీ పేరున డిపాజిట్ చేస్తాను- సరేనా?" అంటుంటారు.

"నేనెక్కడ బాధపడతానో, ఏ మాటను చెప్పకుండా దాచుకుని మధన పడుతున్నానో అనుకుంటూ తనంతట తనే అన్ని జాగ్రత్తలూ తీసుకుంటారు.ఆయన చూపించే ఆప్యాయతను తలుచుకున్నప్పుడల్లా భోరున ఏడవాలనిపిస్తుంది. అయ్యో- నేనెంత దురదృష్టవంతురాలిని, ఆయన మొదటి భార్యను కాలేకపోయానే అనుకుంటాను. అంతలోనే ఈ రకంగానైనా ఆయనకు దగ్గరయ్యానే, ఈ జన్మకింతే చాలుననుకుంటాను - ఇదే నా కథ" అంది ఆనందం.

"సరేగానీ ఆనందం... డాక్టరుగారి భార్య తన తమ్ముణ్ని నీ మీదకు దాడికి పంపించింది గదా. మరి ఇంతకాలం సహించి ఇప్పుడెందుకు ఇలా కోపమొచ్చిందావిడకు?" అడిగింది మయూరి.

"ఇన్ని రోజులెక్కడిదే, నీ మొహం. మేమిద్దరం కలిసి రెండేళ్ళనించీ యిలా వుంటున్నా ఆవిడకు మొన్నమొన్ననే తెలిసింది. అసలు దీన్ని బట్టి తెలియటంలేదూ, ఆవిడ ఎంతగొప్పగా కాపురం చేస్తున్నదీ" - వివరించింది ఆనందం.



"హల్లో రోనీగారూ... వాటేసర్‌ప్రైస్" ఆహ్వానించాడు కోటేశ్వరయ్య.

"ఈమధ్య వరంగల్‌లో పనేమీ లేకపోవడంవల్ల నాలుగైదునెలలుగా రావటం లేదండి... ఇంతకూ సర్‌ప్రైస్ ఏమిటి?"

"మీరు రావటం, మీ అంకుల్ రావటం"

"అంకుల్ ఎప్పుడొచ్చాడు... ఏ రూం?"

"నిన్నొచ్చారు. ఇందాకే మీ అంకుల్ బైటికెళ్ళారు. థర్టీవన్‌లో వున్నారు" తనగదిలోకెళ్ళి, స్నానం చేసి, పైనున్న గదికి వెళ్ళాడు రోనీ. తలుపులోపల గొళ్ళెం పెట్టివుంది. ఆవిడ పడుకుందేమో అని ఒకక్షణం తటపటాయించాడు. డోర్‌మీద చిన్నగా శబ్దంచేశాడు.

"ఎవరూ?" అంటూ తలుపు తీసింది రేవతి. రోనీని చూడగానే పూర్తిగా తెరిచింది.

"లోపలికి రావచ్చా"? తమాషాగా అడిగాడు గుమ్మంలో నిలుచుని.

"రాకూడదైతే ఎందుకొచ్చావు?" నవ్వుతెచ్చిపెట్టుకుంటూ అంది రేవతి. లోపలికి నడిచి కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమిటి - యిట్లా ఊడిపడ్డావ్, మానీడ లాగా" రేవతి మాటల్లో ఎప్పటి ఉత్సాహం లేకపోవటం గమనించాడు.

"భలేవారే... మీరు నిన్న వచ్చారని నేనేమైనా కలగన్నానా ఏమిటి?" అంటూ ఆమెను పరీక్షగా చూశాడు.

ఏడ్చినట్టు కళ్ళు బాగా ఉబ్బివున్నాయి.

ఏమైవుంటుంది. పొరుగూరికి పనిమీదొచ్చి ఈ లాడ్జింగు గదిలో ఏడుస్తూ కూర్చోవాల్సిన అవసరం ఏమొచ్చింది?' - అనుకున్నాడు.

"ఏమైంది... అలా వున్నారు?"

"ఏంలేదు... ఒంట్లో కాస్త బాలేదు" ముభావంగా అంది.

"ఒంట్లో బాలేకపోతే ఏడుస్తూ కూర్చోవటానికి మీరేమైనా పసిపాపా ఏమిటి? నాకు చెప్పకూడదా?" చొరవగా అడిగాడు.

మొదటి పరిచయం తరవాత రోనీ వచ్చిన చాలా తడవల్లో మరోమూడుసార్లు కృష్ణకుమార్, రేవతీ కూడా రావటం జరిగింది. కృష్ణకుమార్ ఎప్పుడొచ్చినా ఆఫీసుకు సంబంధించిన వ్యవహారాలు జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లో చూసుకోవటానికి వస్తాడు. అందువల్ల అతనికి తీరికుండదు. ఆ కారణంగా రేవతి అభ్యర్థన మీద తన పని పూర్తయిన వెంటనే మిగతా ఖాళీ సమయమంతా ఆమెతో మాట్లాడుతూ గడిపేవాడు రోనీ. అతని పని గురించీ, తమ స్నేహితులు గురించీ, అలాగే చిన్నప్పటి సంగతులూ, కాలేజీ సంగతులూ, సినిమాలూ, పుస్తకాలూ-ఇలా ఏదో ఒక విషయం గురించి కబుర్లు చెప్పుకుంటూ కూర్చునేవారు. అందువల్ల ఆ యిద్దరికీ మధ్య ఒక స్నేహబంధం ఏర్పడింది. అయినా మొదటిరోజులాగే ఆమెను బహువచనంతోనే సంబోధిస్తున్నాడు.

"అంకుల్ ఏమైనా గొడవ చేశాడా? దేని గురించి? ఫర్వాలేదు, అమ్మ పుట్టింటి సంగతి మేనమామ దగ్గర దాయడమెందుకు?"

"ఏమని చెప్పుకోవాలి, అందునా నీలాంటి మగపిల్లాడికి?"

"మనిద్దరమూ ఇన్నిరోజుల్నించీ యిలాగే మాట్లాడుకుంటున్నాం. ఇన్ని రోజులనుంచీ లేని ఆడా మగా భేదం యిప్పుడు మాత్రం ఎందుకు?"

కాస్సేపు ఆలోచించి, ఓసారి నిట్టూర్చి చెప్పింది రేవతి-

"అవును... నువు చెప్పిందీ నిజమే. ఒక మగవాడు తనెదురుగా వున్న స్నేహితురాలిని 'ఆడది' అనే దృష్టితో చూస్తే అతన్నెలా తప్పు పడతామో, అలాగే ఒక స్త్రీ, తనెదురుగా వున్న వాణ్ణి 'కేవలం మగవాడు' అన్నదృష్టితో చూడటం కూడా తప్పే అవుతుంది"

మౌనంగా వింటూ కూర్చున్నాడు రోనీ.

"అయినా ఎలా చెప్పాలో తెలీటం లేదు రోనీ... నాకు పీరియడ్ రాక రెండు నెలలయింది. అక్కడ, మేం వుంటున్నవూళ్ళో లేడీ డాక్టర్ లేదు. ప్రెగ్నెన్సీ అని నాకు తెలుసు. నిన్న సాయంత్రం రాగానే పెథాలజీ లాబ్‌లో యూరిన్ పరీక్ష చేయిస్తే కన్‌ఫామ్ అయింది. మీ అంకుల్ అబార్షన్ చేయించుకోమంటున్నారు"

"అబార్షనా... ఎందుకు?"

"ఎందుకంటే ఏమని చెప్పాలి? ఆయనకు నేను ఆడదాన్నిగానే కావాలి కానీ నాలోని స్త్రీ మనసు అక్కర్లేదు. అయినా యిది మొదటిసారి కాదుకదా" నిర్లిప్తంగా నవ్వింది రేవతి.

"పోనీ నచ్చ చెప్పలేకపోయారా? ఎప్పుడో ఒకప్పటికి పిల్లలు కావాలికదా" ఏదో ఆలోచిస్తూ అన్నాడు రోనీ.

"అట్లా అన్నందుకేకదా పోట్లాట. అసలు పిల్లలే వద్దంటాడు. ఏమైనా సరే- ఈసారి అబార్షను చేయించుకోకూడదనుకున్నాను. కానీ ఆయన మనసులో వున్న ఆలోచన నాకేం తెలుసు? ఇవ్వాళ పొద్దున చెప్పాడు- నాకు పిల్లలు పుట్టడమే తనకిష్టంలేదట. అందుకు నేనొప్పుకోనందుకు యిదిగో యిలా తన్నులు... కొట్టేదెబ్బ ఎక్కడ తగులుతోందో అని కూడా చూసుకోకుండా... అలాగైనా అబార్షన్ అయిపోతుందని ఆశ కాబోలు... ఇక నా అదృష్టంయింతే"

రేవతి చెప్పింది విని నిర్విణ్ణుడయాడు రోనీ. అతనికి కృష్ణకుమార్ గురించి తెలుసు, ఆ భార్య గయ్యాళితనం గురించీ తెలుసు. వాళ్ళిద్దరూ పోట్లాడుకోవటం, ఆవిణ్ణి అతను అప్పుడప్పుడూ తన్నటం - యివన్నీ ఆ చుట్టుపక్కలవాళ్ళకు మామూలు విషయాలు. కానీ ఆవిడతో సుఖశాంతులు లేకపోవటంవలన ఈవిణ్ణి చేసుకున్నాడేమోననుకుని సరిపెట్టుకున్న రోనీకి ఈ విషయాలు మింగుడు పడలేదు. కాస్సేపటికి ఆలోచనల్లోంచి తేరుకుని అన్నాడు-

"పోనీ అంకుల్‌తో నేను మాట్లాడనా?"

అబార్షన చెయించుకోవాలని నిర్ణయించుకున్నాం. అయిపోయింది. నువు చెప్పేదేముంటుందింకా? అయినా కొన్ని విషయాలు బైటివాళ్ళు మాట్లాడటం బాగుండదు కూడా. మాట్లాడుకోవటానికి ఎవరూలేని ఒంటరితనంలో, నీతో ఫ్రెండ్లీగా చెబుతున్నానే కానీ నువ్వేదో చేయాలనే ఉద్దేశంతో కాదు''

''ఏం...? నేను ఎందుకు చేయకూడదు మరి ఆమాత్రానికి స్నేహం అనేమాట ఎందుకు?''

''రోనీ... చిన్న చిన్న సమస్యలెదురైనప్పుడు స్నేహితుల్ని సలహా అడుగుతాం. కష్టసుఖాలు స్నేహితులతో మనసువిప్పి చెప్పుకుంటాం. సహాయం అవసరమైనప్పుడు అడుగుతాం. కానీ, ఇది జీవితమంతా వుండే సమస్య. దీనికి పరిష్కారం నేనే వెతుక్కోవాలి. రోట్లో తల దూర్చి రోకటి పోటు గట్టిగా తగలకుండా చూడమని నిన్నడిగి ఏం లాభం? అడిగినా నువ్వు ఆమాత్రం సహాయం చేసినంతమాత్రాన ఏం ప్రయోజనం. అసలా రోకట్లోంచి తలబైటకు తీసుకోవాలనుకుంటే అప్పుడు నీ సలహా తప్పకుండా తీసుకుంటాను''

ఇక తర్కించకుండా ఊర్కున్నాడు రోనీ. సంభాషణ మరోవైపు మళ్ళింది. కాస్సేపటికి కృష్ణకుమార్ వచ్చాడు.

''ఏరా... నీకు తీరికుంటుందా? పిన్నిని హాస్పిటల్లో అడ్మిట్ చేయిస్తున్నాను. నాకు కొంచెం పనుంది. సాయంత్రం రాలేను'' అడిగాడు.

''అతనెందుకు? అయినా తనొచ్చి చేసేదేముంటుంది?'' మామూలుగా అంది రేవతి.

''ఏవైనా మందులూ అవీ అర్జెంటుగా అవసరమైతే చూసుకుంటాడు''-రేవతికి బదులిచ్చి, యిటు తిరిగాడు- ''అన్నట్టు నీకు చెప్పలేదుకదూ. మీ పిన్నికి అబార్షన్ అయింది. క్యురేట్ చేయించటానికి హాస్పిటల్లో చేర్పిస్తున్నాను. ఇంతకూ ఏమంటావ్?''

అబార్షన్ అయిందనే అబద్ధంతోపాటు విషయం ఎంత మామూలుగా చెబుతున్నాడు-అని ఆశ్చర్యపోయిన రోనీ, నిరాసక్తంగా బదులిచ్చాడు-

''ఉంటాన్లే. నా పనులు కాస్త అటూయిటూ అయినా కొంపమునగదు''

''అమ్మయ్య... ఒక ప్రాబ్లం తీరిపోయింది. అనుకోకుండా నువ్వు రావటం మంచిదే అయ్యిందిరా'' నిశ్చింతంగా అన్నాడు కృష్ణకుమార్.

''మరి నేను వెళ్ళాలి. మధ్యాహ్నం రెండు, మూడువరకు వస్తే ఫర్వాలేదా?'' అడిగాడు రోనీ లేచి నిలబడుతూ.

''నాలుగువరకొస్తే చాలు. మేం ఇక్కడ లేకపోయినా డైరెక్టుగా హాస్పిటల్‌కు వెళ్ళిపో- తెలుసుగదా లక్ష్మీటాకీస్ దగ్గరుంది?''

''తెలుసు'' తలూపి బైటకు నడిచాడు రోనీ.

రోనీ మధ్యాహ్నం వచ్చేసరికి గదితాళం వేసివుంది. తిన్నగా కృష్ణకుమార్ చెప్పిన ఆసుపత్రికి వెళ్ళాడు. చిన్న నర్సింగ్‌హోం కావడంతో రేవతిని కనుక్కోవటం కష్టంకాలేదు. బెడ్‌లో కూచుని ఏదో చదువుకుంటున్న రేవతి, రోనీని చూడగానే పుస్తకం మూసేసి, పలకరింపుగా నవ్వింది. స్టూలుమీద కూర్చున్నాడు రోనీ.

''నాకు అబార్షన్ గురించి సరిగ్గా తెలియదు- అయిపోయిందా?'' అడిగాడు రోనీ.

''పెళ్ళయితే కదా అవన్నీ తెలిసేది. సాయంత్రం సెవెన్‌కు వస్తానంది డాక్టర్. అప్పుడు చేస్తారు''

''మీకేమైనా అవసరముంటే చెప్పండి ముందుగా తెచ్చిపెడతాను''

కాస్సేపు ఏమీ మాట్లాడకుండా ఉండిపోయి, నిరాశగా అంది రేవతి –

''నాకు అవసరమైంది ఆపేక్ష. అదెక్కడ దొరుకుతుంది రోనీ?''

జవాబివ్వకుండా గమ్మునుండిపోయాడు రోనీ. అంతలో మళ్ళీ తనే అంది రేవతి –

''ప్రసవం పునర్జన్మలాంటిదంటారు. దాని గురించి నాకు ఏమీ తెలియదు. కానీ గర్భస్రావం కడుపుకోతతోపాటు గుండెకోతకూడా రోనీ. తలుచుకుంటే భయంతో ఒళ్ళు జలదరిస్తుంది. కన్నవాళ్ళులేరు, కట్టుకున్నవాడూ పక్కనలేడు. ఏదో నా అదృష్టంకొద్దీ కాస్సేపు మాట్లాడుకోవటానికైనా నువ్వైనా ఉన్నావు. కానీ నీతో ఏమని చెప్పుకోమంటావు'' కనుకొలుకుల్లోంచి

చిప్పిల్లిన కన్నీరు తొలకరిలా మొదలై మాటలు పూర్తయ్యేసరికి శ్రావణమేఘపువర్షంలా జలజలా రాలింది. మోకాళ్ళమధ్య తలదాచుకుని భోరుమంది రేవతి.

ఎప్పుడూ నవ్వుతూ సరదాగావుండే రేవతి అలా కరిగి నీరయ్యేసరికి నివ్వెరపోయాడు రోనీ. కాసేపు ఏంచేయాలో తెలియక మ్రాన్పడి చూస్తూండిపోయాడు. కానీ ఆ స్థితిలోంచి చప్పున తేరుకుని అనునయించాడు –

"ఏమండీ... ప్లీజ్... ప్లీజ్ గెట్ యువర్సెల్ఫ్... ఇది హాస్పిటల్. ఎవరైనావస్తే ఎలా ఉంటుంది చెప్పండి"

ఉప్పెనలా పొంగుకొస్తున్న ఉద్వేగానికి వివేకం ఆనకట్ట వేయటంతో రెండు క్షణాల్లో తేరుకుని కళ్ళు తుడుచుకుంది.

"సారీ... నా పెళ్ళయిన తరవాత నాలో నేనేతప్ప ఎప్పుడూ ఇలా బయటపడలేదు" జీరబోయిన గొంతుతో చెబుతున్న రేవతిని చూస్తూ మాట్లాడకుండా ఊర్కున్నాడు.

"ఏం చెప్పను రోనీ. ఇలాంటప్పుడు మనకు తెలిసినవాళ్ళు ఒక్కరైనా ఆడవాళ్ళు దగ్గరుంటే బాగుండుననిపిస్తుంది. కానీ నాకోసం ఎవరొస్తారు చెప్పు. ఈ నర్సులకు ఎంత చెప్పినా వాళ్ళు హాస్పిటల్లో అందరితోనూ ఒకేలా ఉంటారు. ఎంతసేపూ మందుల గురించీ, ట్రీట్మెంట్ గురించీ ఆలోచిస్తారేతప్ప అంతకుమించి ఏంమాట్లాడుతారు? ఎందుకో పొద్దుట్నుంచీ మనసంతా అదోలావుంది. ఈ జన్మకిక పిల్లల్నికనే యోగం లేదంటే ఏమిటోగా అనిపిస్తూంది. ఈ మాత్రం మాట్లాడుకోవటానికి నువ్వైనా ఉన్నావు"

"అంకుల్ ఎప్పుడొస్తానన్నాడు?"

"ఆయనకు తెలిస్తేగనుకనా నాకు చెప్పటానికి?"

"అదేమిటి... ఆటైంవరకైనా రానన్నాడా?"

"ఎందుకొస్తాడు? ఆఫ్టాల్ అయామ్ నోబడీ. నేనేమైనా డాక్టర్నా ఏమిటి, నేనులేకుంటే ఇక్కడేదో ఆగుతుందనుకోవటానికి – అని వెళ్ళిపోయాడు. దిసీజ్ హెవెన్ మేడిన్ ఎ హెల్ రోనీ. చేతులారా ఎంచుకున్న స్వర్గం! నువ్వెందుకయ్యా అనవసరంగా బాధపడతావ్? ఆఫ్టాల్, నువ్వేం చేయగలవని? ఎంత ఆపుకున్నా ఏడుపు ఆగటంలేదు. ఎలా చెప్పుకోమంటావ్ నా మనసులో గూడుకట్టుకున్న [illegible] చెబితే అర్థమవుతుందని? గుండె గొంతుకలోన కొట్టాడుతున్నది అంటారే... నో... అది కూడాకాదు... గుండే గొంతుకను నులిమేసినట్టుంది. ప్లీజ్... ప్లీజ్ లీవ్మీ అలోన్ ఫరెవైల్" అభ్యర్థించింది నిస్సహాయంగా.

"సారీ... నేను వెళ్ళను" స్థిరంగా అన్నాడు రోనీ.

అతనివంక విచిత్రంగా చూసింది.

"ఇందాక మీరన్నారే, నాకూ అలాగేవుంది. ఎలా చెప్పాలో, ఏమని చెప్పాలో అర్థంకావటంలేదు. నేను మాట్లాడేది మీకు కఠినంగా అనిపించవచ్చు. కానీ కొంచెం స్థిమితంగా ఆలోచించండి. జరిగిపోయినదాన్ని మార్చగలిగేశక్తి మనకులేదు. బాధపడినంత మాత్రాన గతం మారి, పరిస్థితి మళ్ళీ మనచేతిలోకి వచ్చేటట్టయితే ఈ లోకంలో ఎన్ని విచిత్రాలు జరుగుతాయో! ఇదంతా మీకు తెలియదని నేను చెప్పటంలేదు. ఇందాక మీరన్నట్టు ఆఫ్టాల్ అయామే థర్డ్ పర్సన్. అలాంటి నాముందు మీరింతగా బరస్ట్ అయ్యారంటే మీ మనసులోవున్న బాధ ఎంతటిదో అర్థం చేసుకోగలను. కానీ మీరు బాధపడినా, నేను అర్థం చేసుకున్నా ఇప్పుడు మార్పు ఏమైనా ఉంటుందా చెప్పండి?"

– ఆగి ఆమెవంక చూశాడు.

ఇక తర్కించకుండా అంతటితో ఆగిపోయింది రేవతి.

★ ★ ★

ఆనందం, మయూరీ, శివలక్ష్మి- ముగ్గురూ సినిమా పరిశ్రమ గురించీ, నటుల గురించీ, అక్కడి రాజకీయాలగురించీ సరదాగా మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

ఆరోజు సాయంత్రం మయూరి వెళ్ళాల్సిన విషయం పొద్దున చెప్పగా విన్న ఆనందం, అది గుర్తొచ్చి మాటల మధ్యలో అనాలోచితంగా అడిగింది–

"అవునే మయూరీ, ఇన్ని సినిమాల్లో నటించిన తరవాత యిప్పుడు నీకు ఈ స్క్రీన్ టెస్ట్ ఎందుకు? అందునా రాత్రిపూట...?"

అడిగిన తరవాత మయూరి ఏమైనా నొచ్చు
కుందేమోననుకుంది.

అయితే మయురి మాత్రం ఏమీ బాధపడ
లేదు. నవ్వుతూనే జవాబు చెప్పింది-

"ఇందులో రహస్యం ఏముందని? ఆ
ఎందుకో నీకూ తెలుసు. నీకు తెలుసని నాకు
తెలుసు. ఇటీజ్ ఆలింద గేమ్. ఈరోజుల్లో
సినిమాల్లో పైకి రావాలనుకునేవారందరికీ
దాదాపుగా యిది తెలుసు"

మయూరి జవాబు విని యిద్దరూ మౌనంగా
వుండిపోయారు.

"ఏవిటి? ఇద్దరూ అలా చూస్తున్నారు?
ఎంత బరితెగించి మాట్లాడుతున్నానూ అను
కుంటున్నారా?"

"అలా అనుకోవడానికి నాకుమాత్రం అస
లు యింతకుముందు నువ్వు ఏంమాట్లాడావో
తెలియదు మరి"

ముగ్గురూ చప్పున గుమ్మంవైపు తిరిగారు.
అక్కడ స్వప్న కనబడింది.

"పిల్లిలాగా నువ్వెప్పుడు వచ్చావే, కనబడి
చావకుండా"

"కాస్త దీనినోరు కట్టేసి చావండి ఎవరైనా,
మాట్లాడి చావకుండా" అంటూ లోపలికొ
చ్చింది స్వప్న. "ఇక చెప్పవే తారామణీ-
అసలువిషయం, కొసరువిషయం"

"ఏమీలేదుకానీ ఏమిటిలా వచ్చావు?"
అంది ఆనందం మాటమారుస్తూ.

"ఆనందం, మనం నలుగురమూ ఒక ఊరి
వాళ్ళంకాకపోయినా, ఒకఆఫీసులో ఉద్యోగం
చేయకపోయినా ఒక్కలాగా కలిసిపోయాం.
ఈమాత్రానికి స్వప్నదగ్గర రహస్యంగా దాచేదే
ముంది? ఏమీలేదే స్వప్నా ఒక సినిమాలో
హీరో గోపాల్ చెల్లెలిగా ఒక కాంట్రాక్టుమీద
సంతకంచేశాను. ఇవాళ సాయంత్రం ఎనిమి
దింటికి డైరెక్టర్‌గారు స్క్రీన్‌టెస్టుకు రమ్మన్నా
రు. రాత్రిపూట టెస్టేమిటే అని వీళ్ళ సందేహ
మట. అదీసంగతి. మరి అంతావిని నువ్వు
నాతో మాట్లాడనని వెళ్ళిపోతావా, మునుపట్లాగే
వుంటావా?" చాలా మామూలుగా మాట్లాడినా
మయూరి గొంతులో సన్నటి జీర తొంగిచూ
సింది.

"ఒకవేళ నేను నీతో మాట్లాడనన్నానే అను
కో. అలాంటి స్వప్న స్నేహంమాత్రం
నీకెందుకు? నలుగురమూ కూర్చునివున్నాం.
ఇప్పుడు ఒకమాట చెబుతాను, వినండి.
మనం నలుగురమూ స్నేహితులం, వియార్
ఫ్రెండ్స్. దట్సిట్. ఎవరు ఏమైనా కానీయండి,
మనంమాత్రం యిలాగే వుండాలి. తెలి
సిందా?" అందరివైపు ఒకసారి చూసి మళ్ళీచె
ప్పింది స్వప్న- "నలుగురు మగాళ్లుంటారు.
అందులో ఒకడు తాగుబోతుంటాడు. ఒకడు
తిరుగుబోతుంటాడు. ఒకడు లంచగొండి
వుంటాడు. మరొకడు శుద్ధ బుద్ధావతారం
వుంటాడు. లంచగొండితో తిరిగితే తన
ఉద్యోగం పోతుందని బుద్ధావతారం అనుకో
డు. తిరుగుబోతుతో తిరిగితే తనకు అదికూడా
అంటగడతారని తాగేవాడూ అనుకోడు. మరి
ఆడవాళ్ళకుమాత్రం ఎందుకే ఈ కట్టుబాట్లు.
మయూరి ఏమైనా అనుకోనీ, నేనోమాట చెబుతా
ను. అది యిన్నాళ్ళూ సినిమాల్లో ఎక్స్‌ట్రా
వేషాలు వేస్తూంది. సినిమాల్లో నటించే ఆడవా
ళ్ళగురించి పరమనీచంగా అందరూ చెప్పు
కుంటారు. దానికన్నా ముందునుండీ ఎక్స్‌ట్రా
లుగావున్నవాళ్ళు అలాగే వుండగా మొన్న
దానికో చిన్నపాత్ర దొరికింది. ఇవాళ, గుర్తింపు
లభించే మరోపాత్రవచ్చింది. ఏడైరెక్టర్‌కో, ప్రొ
డ్యూసర్‌కో అందం అప్పగించకుండానే
వచ్చిందా అని అందరూ అనుకుంటారు.
అందులో నిజం మనక్కూడా తెలియదు.
మాటవరుసకు నేనడుగుతున్నాను, అది ఎవ
డిదగ్గరికోపోయే ఈవేషం సంపాదించిందను
కుందాం. అయితే ఏమయిందటా? అది అవి
నీతి అవుతుందా? అమెరికాలో పెళ్లికాకముందే
కన్నెతనం పోగొట్టుకున్నవాళ్లు సగంకంటే
ఎక్కువమంది వుంటారట. మరి ఆసమాజంలో
కన్నెపిల్లలుగా పెళ్లిచేసుకున్నవారే సమాజ
న్యాయం తప్పినవాళ్లని అంటామా? ఆడదాని
శీలం తప్ప ఈప్రపంచంలో చెడిపోతున్నవి
ఏమీలేనట్టు ఎందుకీ వాదనలు? మీరంతా
ఏమైనా అనుకోండి, మగవాడి అండలేకుండా
ఏఆడది ఒంటరిగా బతకడం అసాధ్యమని
అనుకునే ఈదేశంలో మయూరి ధైర్యంగా బతు
కుతూంది. అదేదాని ప్లస్‌పాయింట్. ఆ ధైర్యం
అందరికీవచ్చిన్నాడు అసలీ శీలం అనేమా

టకు విలువేవుండదు. అసలు ఏమిటే శీల
మంటే? నవలల్లోని కథానాయకుల్లాంటి వారు
తమభర్తలు కావాలనీ, సినిమాహీరోలు తమ
ను పెళ్లిచేసుకోవాలనీ కలలుగంటూ,
ఊహించుకోవటం మానసిక వ్యభిచారంకాదా?
పక్కింటావిడ మొగుడిలాగా తనమొగుడు
పట్టుచీర కొనిపెట్టడంలేదని ప్రతిరోజూ తన
మొగుణ్ని సాధిస్తూ, పరోక్షంగా ఆపక్కింటావిడ
మొగుణ్ని మెచ్చుకోవటం పతివ్రతా లక్షణమా?
శీలం అనేది ఆఒక్కచోటులోనే వుంటుందా,
అదికూడా ఆడదానికి మాత్రమే?

కనీసం మనలాంటి ఆడవాళ్ళైనా, చదువుకు
న్న వాళ్ళైనా వ్యక్తిత్వం అంటే ఏమిటో సరిగ్గా
తెలుసుకుంటే, మిగతావాళ్ళకు కూడా కాస్త
మంచిబతుకు అనుభవంలో కొస్తుంది. అంతే
గానీ మాట్లాడితేనే మనసు మలినమై
పోయేంతగా భావిస్తే మన బతుకులూ
యింతేనే''

''ఎక్కడ చచ్చివస్తున్నావే తల్లీ, యింత
పెద్ద ఉపన్యాసం ఏకదమ్మున దంచి చంపే
శావ్'' ఆశ్చర్యం నటిస్తూ అంది శివలక్ష్మి.

''ఉపన్యాసం అనకు శివా, నిజంగానే స్వప్న
చెప్పిన మాటలు ఎంత సరిగ్గా వున్నాయి''
అంటూ స్వప్న వైపు తిరిగి అడిగింది
ఆనందం—''అవునూ ... యింత చెప్పిన తర
వాత నిన్నోమాట అడుగుతానూ, నీకూ ఎవరైనా
బాయ్‌ఫ్రెండ్ వున్నాడా?''

''నీ శ్రాద్ధం, నీ పిండాకూడు ... నేను యింత
వరకూ చెప్పినదానికి అర్థం కనపడ్డవాడితోన
ల్లా తిరిగితేనే స్త్రీకి స్వాతంత్ర్యం వస్తుందని
కాదే. ఎవరిష్టం వాళ్లది. అలా మగవాళ్ళు
తిరిగితే పట్టించుకోని లోకం ఆడవాళ్ళు
నెందుకు తప్పుపట్టాలి అని. కనీసం ఆడవాళ్లై
నా సరిగ్గా అర్థం చేసుకోగలిగితే, ఆ తరవాత
మగాళ్ళు మారుతారేమోననీ- అంతే''

''కానీ నేను మాత్రం అలా కనిపించిన
వాడితోనల్లా తిరగటం లేదు స్వప్నా...''

''మయూరీ, సినిమాల్లోలాగా అపార్థపు డై
లాగులు చెప్పకు. నేను నిన్నలా అన్నానా''
మధ్యలో అంది స్వప్న.

''ఛ ... నువ్వన్నావని కాదు. నా సంగతి
చెబుతున్నాను. అసలు చాలామందికి యిదో
రోగం వుంది. సినిమా వాళ్ళంటే సిగ్గూ, లజ్జా
లేని వాళ్ళనుకుంటారు. హాస్పిటల్లో పనిచేసే
నర్సులంతా డాక్టర్ల వుంపుడుకత్తెలనుకుంటా
రు. లేడీ సెక్రెటరీలందరూ ఆఫీసర్ల గర్ల్
ఫ్రెండ్స్ కాదా అంటారు. కూలీ చేసుకునే
ఆడవాళ్ళంతా మేస్త్రీ గారి జనానా తాలూకే
అంటారు. అసలు ఆడా, మగా కలిసున్న చోట
'సెక్స్' తప్ప మరేమీ కనిపించదు. సినిమాల్లో
ఆడవాళ్ళు ఒళ్ళప్పగిస్తే తప్ప పైకి రాలేదను
కుంటారు చాలామంది. కానీ అదొక్కటే క్వాలి
ఫికేషన్ కాదు. నిజానికి అట్లా పొరపడిన
వాళ్ళెంతో మంది కాల్‌గర్ల్స్‌గా మారిపోయి
తెరపైకికూడా ఎక్కకుండానే మరుగైపోయారు.
అయితే అలాగని యివన్నీ అబద్ధమని నేను
చెప్పటంలేదు. అందులో నేను కూడా ఎక్సెప్షన్
కాదు. కానీ నేను చెప్పేదేమిటంటే యింత
విశృంఖలంగా వుండదు. పబ్లిక్ పార్కుకు
పోయి అందమైన పువ్వు కనపడగానే దొంగత
నంగా కోసుకుని తల్లో పెట్టుకోవాలనిపిస్తుంది.
కళ్ళ ముందు అందమైన ఆడది కని
పిస్తూంటే, అందునా ఆమె టాలెంట్‌ను వెలికి
తీసి, తెరకెక్కించే పని తన చేతుల్లో వుండగా,
ఆ అందాన్ని ఒకసారి అనుభవిస్తే తప్పే
ముందీ అనే భావన వుంటుంది ప్రొ
డ్యూసర్లూ డైరెక్టర్లలో. కట్టుకున్న పెళ్ళాం
ముందు కూడా బనియన్ లేకుండా కనబడా
లంటే సిగ్గుతో గిలగిల్లాడిపోయే మగాడుంటా
డు. ఒక ఉద్యోగం వస్తుంది. మెడికల్ చెకప్
కోసం మరో మగాడైనా డాక్టర్ ముందు గుడ్డల
న్నీ విప్పుకుని ఒంటిమీద నూలుపోగు
లేకుండా నిలబడాలి. అలాంటప్పుడు అతగా
డు ఏంచేస్తాడు. అయిదు నిమిషాలు భరిస్తే
పోయేదానికి ఉద్యోగం వదులుకోవడ
మెందుకూ అని ఆలోచిస్తాడు. మా సంగతీ
సరిగ్గా యిలాగే వుంటుంది. అయిదు నిమిషా
లు కళ్ళు మూసుకుంటే పోయేదానికి అవకాశం
పోగొట్టుకోవడమెందుకూ అనిపిస్తుంది. అది
తప్పుకాదా, ఒళ్ళప్పగించి ఛాన్సు సంపాదించు
కోవటం తప్పు కాదా అని మీరనవచ్చు. లంచం
యిచ్చి ఉద్యోగం సంపాదించటం తప్పుకాదా?
లంచంయిచ్చి పనులు జరిపించుకోవటం
తప్పుకాదా? దొంగ ఓట్లతో గద్దెనెక్కటం తప్పు
కాదా? అంతెందుకు, ఆఫ్టాల్ ఒక సినిమా

టిక్కెట్టు కోసం అడ్డదారిలో ఐదు రూపాయలు ఎక్కువిచ్చి సినిమా చూడటం తప్పుకాదా? గొంగళి లాంటి సమాజంలో బతుకుతూ, గొంగళి పురుగులాంటి ఒక చిన్న విషయాన్ని వేలెత్తి చూపించటం సమంజసమా చెప్పండి. ఇందాక మన స్వప్న చెప్పినట్టు మన వాళ్ళకు స్త్రీని ఆస్తిగా భావించటం ఆనవాయితే. అందుకే ప్రతి మగాడూ "నేనో ఆడదాన్ని అనుభవించాను" అని చెప్పుకుంటాడే కానీ "అనుభవం పంచుకున్నానూ" అని చెప్పుకోడు. నేను నడుస్తున్నదారి సరైనదనీ, యిదే మంచిదనీ నేను చెప్పటంలేదు. నేను చేస్తున్నది తప్పుకూడా కాదని అర్థం చేసుకోమనే చెబుతున్నాను. ఒక్కో సమాజంలో మనిషి ఏర్పరచుకునే నియమనిబంధనలనుబట్టి సమాజానికీ, సమాజానికీ మధ్య నైతిక విలువలు మారుతాయి. కొన్ని దేశాల్లో అన్నా చెల్లెళ్ళు పెళ్ళి చేసుకోవటం సాంప్రదాయం. మనదేశంలో వరాయి ఆడదానిపైనే, మగాడిపైనే తనకా దృష్టిలేదని చెప్పుకోవటంకోసం సోదర భావం వుందని చెప్పుకుంటాం మరి. ఈ రంగంలో పైకి రావాలంటే యింతే. నాకు యిష్టం లేకపోయినా తప్పదు. తప్పనిసరిగా ఎన్నో సహిస్తున్నాం మనమంతా. అందులో యిదెంత చెప్పండి?"

నైట్ డ్యూటీ వున్న ఆనందం, వెళ్ళాల్సివున్న మయూరి వెళ్ళిపోగా స్వప్న శివలక్ష్మి కలిసి మాట్లాడుకుంటూ వుండిపోయారు.

సిల్వియాను గౌతమికి పరిచయం చేసిన తరవాత ఒకసారి సిల్వియా ఆహ్వానం మీద వాళ్ళింటికి వెళ్ళాడు బాలూ. ఐతే, విచిత్రంగా ఆ మరునాటినుంచీ అతన్ని తప్పించుకుతిరగసాగింది సిల్వియా. ఆ రోజు క్యాంపస్‌లోని ల్యాండ్ స్కేప్ గార్డెన్‌లో కూర్చుని వున్న సిల్వియాను చూడగానే ఆమెదగ్గరికెళ్ళి సూటిగా అడిగాడు బాలూ, అసలు విషయం ఏమిటని.

ఆమె చెప్పిన జవాబు వినగానే మనసు వికలమైపోగా నిస్త్రాణగా అడుగులేస్తూ పార్కులోంచి బైటకడుగుపెట్టాడు. జరిగిందేదో కలలాగానో, కల్పనలాగానో అనిపిస్తూంది బాలూకి ఆలోచిస్తూంటే.

"బాలూ" అన్న పిలుపు విని ఆగిపోయాడు.

"డిగ్రీ చేతికి రాకముందే యింత విచారమెందుకోయ్" నవ్వుతూ పలకరిస్తున్న రోనీని చూసి బలవంతంగా నవ్వాడు.

"ఏమిటి నువ్వు కనిపించక మూడు నెలలైంది. ఏం చేస్తున్నావ్?" అన్నాడు బాలూ, రోనీతో కలిసి నడుస్తూ.

రోనీ బాలూకు సీనియర్. ఇద్దరూ మంచి స్నేహితులు.

"క్లాస్‌రూంలో బుక్సున్నాయి. తీసుకువస్తాను పద. ఇప్పుడు క్లాసులేమీ లేవు. అదీకాక నువు కలవక కొన్ని సంవత్సరాలైనట్టుంది" అన్నాడు బాలూ.

"కొయ్యొద్దు, కొయ్యొద్దు. అసలు నీవాలకం చూసే అనుకున్నాను గానీ ప్రేమలో యింత యిది వుందా బాలూ? ఇవాళ సిల్వియా కాలేజీకి రానట్టుంది. అందుకే క్లాసులెగ్గొట్టి నాతో వస్తానని అంటున్నావ్. అవునా?" నవ్వుతూ అన్నాడు రోనీ.

"స్టాపిట్. నో సిల్వియా, నో లవ్... నథింగ్" కోపంగా అంటున్న బాలూని ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు రోనీ—

"ఇదేమిటి? కథ యిలా తిరిగింది. ప్రణయ కలహమా, ప్రళయ మోహమా? తొందరగా బుక్స్ తీసుకొని అదేమిటో నా నెత్తినకొట్టు. అసలు ఈ చిన్నచిన్న ఉద్యోగాలకన్నా 'యిచట ప్రేమ రోగములు బాగుచేయబడును' అని బోర్డు పెట్టుక్కూచుంటే బాగుండునని ఆలోచిస్తున్నాను"

"సరేలే... పోయి పోయీ ప్రేమగురించి అడగటానికి నీ దగ్గరికొచ్చే తలకుమాసిన వాడెవడుంటాడు?"

"ఇదిగో ఆమాటే అనొద్దు. రాజీవ్ గాంధీకి సలహాదారులున్నారా? ఆయన వాళ్ళు చెప్పినట్టే వింటాడని చెప్పుకుంటారా? మరి వాళ్ళే ప్రధానమంత్రి పదవిలోకి ఎందుకు రాలేదంటే ఎలా? ఇదీ అంతే. అర్థమయిందా?"

ఇద్దరూ కాలేజ్‌నుండి బస్టాప్‌వైపు నడిచారు.

"అవునూ పిన్నికి ఇక్కడికి ట్రాన్స్‌ఫరయింది. నీకు చెప్పానా?" అడిగాడు బాలూ.

''ఎప్పుడూ?''

''అయితే లాస్టైమ్ నువ్వు కలిసినప్పుడు చెప్పలేదన్నమాట. సారీ''

''ప్రేమ లోకంలో మునిగి తేలుతున్నావ్. నీకు ఈ విషయాలెక్కడ గుర్తుంటాయి? చివరకు పిన్ని వచ్చిన సంగతి కూడా నాకు చెప్పటానికి నీకు గుర్తు లేదన్నమాట''

''డోంట్ బీ సిల్లీ. నీకు తెలుసనుకున్నాను. విజయవాడ వెళ్ళినప్పుడు నాతో నువ్వొచ్చావు కదా. పిన్నికి బాగా గుర్తున్నావు నువ్వు. నీ గురించి అడుగుతుంది కూడా అప్పుడప్పుడూ''

''ఎక్కడుంటున్నారిప్పుడు?''

''అశోక్‌నగర్‌లో''

''అయితే పద. మనం నిదానంగా వెళ్ళేసరికి ఆవిడ వచ్చేస్తుందనుకుంటాను. స్వప్న కూడా కనిపించి చాలారోజులైంది. ఈ దారిలో మార్గాయాసం తెలియకుండా మీ సిల్వియా గారి కోపవృత్తాంతం చెబుదువుగానీ''

ఇక రోనీ వదలడని అర్థమయింది బాలూకి. అదీగాక మామూలు స్నేహితుల్ని వదిలేస్తే రోనీకిగానీ, బాలూకిగానీ అంత సన్నిహితులైన స్నేహితులెవ్వరూ లేరు. ఇద్దరికీ ఒకరి గురించి మరొకరికి అన్ని విషయాలూ తెలుసు.

''అయితే మీ రూంకు పోదాం పద'' అన్నాడు బాలూ.

రోనీ గదిలో కూర్చుని యిద్దరూ మాట్లాడుకున్నారు. అంతా విన్నాక అన్నాడు రోనీ—

''బాలూ... తొందరపడ్డావేమో?''

''తల్లీ- మా డాడీ, మా పిన్నీ తప్పు చేశారు. నన్ను క్షమించు—అని ఆవిడ కాళ్ళు పట్టుకోవాలా?''

''ఛ... అదికాదు. కొంచెం సామరస్యంగా మాట్లాడితే బావుండేదేమో?''

''అదే నేనూ అంటున్నాను. తనే ఈ విషయం నిదానంగా అడిగితే బావుండేదికదా! నేనేదో తప్పుచేసినట్టు, యిక నాకు అమ్మాయిలే దొరకరన్నట్లు, పెద్ద మనసుతో అర్థం చేసుకోమని ఆవిణ్ని బతిమాలాలా?''

''ఎందుకట్లా కోపం తెచ్చుకుంటావు? నేనలా అననని నీకూ తెలుసు''

''నో రోనీ... ఇలాంటి అభిప్రాయాలున్న మనిషితో నేను జీవితాంతం కలిసి వుంటే నిజంగా పిచ్చెక్కిపోయేది. ఇది చాలా మంచిది. రియల్లీ అయామ్ హేపీ ఫర్ ద కాన్సిక్వెన్స్. నిజంగా యిలాంటిదాన్ని ఎంత ఫూల్‌లాగా ప్రేమించానూ అనిపిస్తోంది''

''సరే- యింకా నయం ఏ మజ్నూలాగానో, దేవదాసులాగానో అయిపోలేదు'' నవ్వుతూ అన్నాడు రోనీ.

''నాకేం ఖర్మ? ఆలోచిస్తుంటే ఎంత చిత్రంగా అనిపిస్తోంది. పొద్దున్నదాకా సిల్వియా ఎందుకు మాట్లాడటంలేదో అని బాధపడ్డాను. ఇప్పుడు ఆవిడతో యిక మాట్లాడే అవసరంలేదుకదా అని సంతోషిస్తున్నాను. ఆ సంగతి పోనీగానీ రోనీ- అసలు ఈ ఆడవాళ్ళు ఒకసారి పెళ్ళై, సంసారం వున్నవాళ్ళను మళ్ళీ ఎందుకు పెళ్ళిచేసుకుంటారంటావ్?''

''అదే నాకూ అంతుపట్టక నీకు చెబుదామనుకుంటున్నానో విషయం. నువ్వే నన్నడుగుతున్నావా?''

''నీకెందుకొచ్చింది సమస్య. ఎవరి విషయం ఇంతకూ?'' కుతూహలంగా అడిగాడు బాలూ.

''రేవతి గురించి'' వివరించాడు రోనీ.



**షూ**టింగ్ కేన్సిల్ అవటంతో మయూరి ఒంటిగంటకల్లా యింటికి చేరుకుంది. ఆనందంకు నైట్ షిఫ్ట్ కనుక యింట్లోనే వుంది. ఇద్దరూ కలిసి భోజనాలు చేసేశారు.

''నువు పడుకుంటావా, కాస్సేపు కబుర్లు చెప్పుకుందామా?'' అడిగింది మయూరి.

''ఇంకా ఏంపడుకుంటాను, ఎప్పుడైనా యింతే. ఒంటిగంటవరకూ పడుకుంటే చాలు'' అంది ఆనందం. ''అయినా నాకివ్వాళ ఆఫ్ కదా, మొన్నరోజు ఎక్స్ట్రా డ్యూటీ చేసిన దాని కాంపెన్సేషన్''.

తనకు మరో రెండు సినిమాల్లో వస్తాయను కుంటున్న మంచి పాత్రలగురించి చెప్పింది మయూరి-

''ఆ రెండూ కూడా అనుకున్నట్లుగా నాకేవ స్తే, ఆ సినిమాలుగానీ హిట్టయితే యిక సెకండ్ హీరోయిన్ ఛాన్స్వచ్చి కాళ్లముందుకు వాలినట్టే అనుకోవే'' ఉత్సాహంగా చెప్పింది మయూరి.

''ఆ తరువాత విజయశాంతి, రాధల లెవ ల్లో టాప్ హీరోయిన్వై పోయావనుకో, ఆ తర్వాత శ్రీదేవి, భానుప్రియల్లాగా హిందీకి ... యిక అప్పుడు చూడాలి నీ దర్జా. ఒక పి.ఎ బ్రహ్మాండమైన కారు...''

''ఉండవే ... నువ్వు కారంటే గుర్తొచ్చింది. ఇవాళ మన శివలక్ష్మి కార్లో కనిపించింది''

''ఏమిటి శివలక్ష్మి కార్లో కనిపించిందా! నీ మొహం- ఎక్కడ?'' అంది ఆనందం కాస్త ఆశ్చర్యంగా.

''ఇవాళ మా షూటింగ్ నార్సింగే దగ్గరని చెప్పాను కదా. అక్కడ రోడ్డుమీద తీసే సీన్లు న్నాయివ్వాళ. అందరూ రోడ్డుకు అటూ, యిటూ కూర్చున్నారు. టైం పదకొండున్నరవు తూందనుకుంటా. హీరో గోపాల్ మద్రాస్ నుండి రావటం ఆలస్యమయి, షూటింగ్ కాన్సి లయింది కదా. ప్లేన్ ఆలస్యమయిందేమో, ఆయన యికొస్తాడు, యికొస్తాడు అనుకుంటూ సిటీవైపు నుండి వస్తున్న కార్లన్నిటినీ చూస్తూ కూర్చున్నాం. దూరంనుండి కాడిలాక్ కారు కనిపించింది. ఆయనే అయివుంటాడని అందరమూ లేచి నిలుచున్నాము. అప్పుడే రోడ్డుమీదికి గొర్రెలమంద వచ్చింది. ఆయన కారెటూ ఆగిపోతుంది గదాని ఎవ్వరమూ ఆ



గొర్రెల్ని తరిమే ప్రయత్నం చెయ్యలేదు. అయితే కారు ఆగకుండా వెళ్లిపోయింది. కారు మీద దృష్టివుండటంమూలాన ఒకటీ, గొర్రెల మంద వల్ల స్లోకావడం ఒకటీ, నేను స్పష్టంగా చూశాను. కార్లో, ముందు సీట్లో మన శివలక్ష్మి కూర్చుంది గాగుల్స్ పెట్టుకుని. అదేనా కాదా అని నేను తటపటాయిస్తున్నాను అంతలో కారువెళ్లిపోయింది''

''దానికి గాగుల్స్ ఎక్కడున్నాయి? అయినా ఆఫీస్ టైమ్‌లో, అందునా కాడిలాక్ కారెక్కడిది, ఎక్కడికి పోతుంది? నువ్వు ఎవర్నిచూసి ఎవరనుకున్నావో?''

''వాళ్ల ఆఫీసర్ అనుకుంటా డ్రైవ్ చేస్తున్నాడు. గండిపేటవైపు పోతూంది కారు. అది ఖచ్చితంగా శివలక్ష్మే'' నమ్మకంగా అంది మయూరి.

''ఏ చీర కట్టుకుంది?'' క్రాస్ పరీక్ష చేసింది ఆనందం.

''స్కై బ్లూ వరేలీ'' సాలోచనగా అంది మయూరి.

''నీమొహం ... ఇవ్వాళ అది ఆర్గండీ చీర అదే వైట్ బ్యాక్ గ్రౌండ్‌మీద గ్రీన్ పువ్వులున్నాయి చూడూ అది కట్టుకుంది. అదీగాక దానికసలు వరేలీ చీరవున్నదే ఒక్కటి. అదీ పింక్ కలర్‌ది. ఆ ఎండలో కూర్చుని, కూర్చునీ, నువు ఎవర్నిచూసి ఎవరనుకున్నావో'' తేలిగ్గా తీసేసింది ఆనందం.

ఆమాట వినగానే మయూరికి తనమీద తనకు సగం నమ్మకం పోయింది.

''కానీ నేను అంతపొరపాటు పడటానికి కారు దూసుకుపోలేదు. స్లోగా పోయింది. అదీగాక హీరో గోపాల్‌కోసం ఎదురుచూస్తున్నాం కదా. నా దృష్టంతా కార్లో మనుమలమీదే వుంది. అది శివలక్ష్మే అని నా నమ్మకం'' మరీ అంత ధీమాగా మాత్రం అన్లేకపోయింది.

''పోనీ ... శివలక్ష్మే అనుకుందాం. ఆఫీసర్‌తో అటువైపు ఎటు వెళ్తుంది? గండిపేటలో వాళ్ల బ్రాంచ్ ఏదైనావుందా మరి, నాకు మాత్రం తెలియదు''

''వాళ్లిద్దరినీ చూస్తే, గండిపేటకు పిక్నిక్‌కు పోతున్న వాళ్లలా వున్నారు గానీ ఆఫీసువని మీద పోతున్న వాళ్లలా మాత్రంలేరు'' చిలిపిగా అంది మయూరి.

''ముయ్యవే నోరు. పాపం, ఎవర్నోచూసి, ఏదో అనుకుని, మధ్యలో దానిగురించి లేనిపోనివన్నీ కొయ్యకు. అదనలే బుద్ధావతారం'' కసిరింది ఆనందం.

''అవునే ... అది కూడా నిజమే. ఆరోజు నువు హాస్పిటల్లో అడ్మిటైనప్పుడు ఎవరో ఒకాయనొచ్చాడు చూడూ. అదే జర్నలిస్ట్ అన్నావు, ఆయనతో ఆటోలో పోదామన్నప్పుడు గడగడా వణికింది ఎవరో, ఏమిటో అంటూ''

''మరికనేం. శివలక్ష్మి గురించి మనకు తెలియదు కనుకనా? అయినా, కాస్సేపు ఆగితే అదే వస్తుంది కదా. అప్పుడడగొచ్చు. ఇక నీ కథలకు ఫుల్‌స్టాప్ పెట్టు'' అంది ఆనందం.

మళ్లీ టాపిక్ మారింది.

''అది సరేగానీ, నువ్వు నిజంగా పెద్ద హీరోయిన్ వయ్యావనుకో. అప్పుడెలా వుంటావే?'' కుతూహలంగా అడిగింది ఆనందం.

''ఎలా వుండటమేముంది, యిలాగే వుంటాను''

''అది కాదే, అప్పుడైనా మీవాళ్లదగ్గరకు వెళతావా, లేదా?''

''ఇప్పుడు మాత్రం నేను వాళ్లదగ్గరికి వెళ్లనన్నానా? వాళ్లే నా దగ్గరికి రావటం లేదు కానీ. అయినా పోనియ్యవే, యిప్పుడా సంగతులన్నీ ఎందుకు?'' నిరాసక్తిగా అంది మయూరి.

''ఎందుకేమిటే? అయినా నిన్ను ఎప్పుడడిగినా చెప్పవేం మీ యింటి విషయాలు. అసలేమయింది? ఎందుకని నువ్విలా ఒంటరిగా వుంటున్నావ్?''

ఏమీ మాట్లాడకుండా మౌనంగా వుండిపోయింది మయూరి.

''అంత చెప్పకూడని విషయాలేమైనా వుంటే వద్దులే. ఇన్నాళ్లుగా కలిసున్నాం. ఇంతగా కలిసిపోయాం. ఆ మాత్రం అడిగే చనువు లేదా నాకు?'' అనునయంగా అడిగింది ఆనందం.

''అదేమీలేదే ... ఇంటి సంగతి గుర్తొచ్చినప్పుడల్లా అమ్మా, నాన్న గుర్తొచ్చి బాధేస్తుంది''

''నువ్వు డబ్బు పంపినా వాళ్ళు తీసుకోరా?''

"ఛ... బాధంటే వాళ్ళు ఇబ్బందులు పడు తున్నారనికాదు. నేనంటే వాళ్లకి చాలా ఇష్టం. నాకూ అంతే. ఏడాదిన్నరయింది వాళ్లని చూడక. అసలు మానాన్న ఊరకే అంటూండేవాడు- నన్ను అత్తారింటికి పంపించననీ అల్లుణ్ణే ఇల్లరికం ఉంచుకుంటాననీ"

"మరి ఎందుకని నువ్విలా వచ్చావు? ఏమైనా లవ్ ఎఫైరా? ఏమిటో వివరంగా చెప్పకూడదూ?"

"లవ్ ఎఫైరా ... అలాంటిదేమీ లేదు. ఉంటే ఇలా రావాల్సిన అవసరమేలేదు. నేనడిగితే నేను కోరుకున్నవాడికిచ్చి పెళ్లిచేసేవాడు మానాన్న. నా అంతటనేనే సిటీకివచ్చాను"

"ఎందుకు?"

"సినిమాల్లో చేరటానికి"

"మీవాళ్ళు ఒప్పుకోలేదా?"

"ఏ తల్లిదండ్రులైనా ఒప్పుకుంటారా? మా వాళ్ళూ అంతే. మా నాన్న మోతుబరి రైతుబిడ్డ. పదెకరాల వరి మాగాణీ, పాతికెకరాల మామిడి తోటా వున్నాయి మాకు. అప్పటికే మా అక్కయ్యా, పెద్దన్నయ్యల పెళ్ళిళ్ళయిపోయాయి. అక్కయ్యకు విడిగా యాభై వేల రూపాయల కట్నమూ, నాలుగెకరాల మాగాణీ ఇచ్చేశాడు. పెద్దన్నయ్య వ్యవసాయం చూసుకుంటాడు. చిన్నన్నయ్య తోట చూసుకోవడంతో పాటు మామిడి కాయల వ్యాపారంచేస్తాడు. నేను చిన్న దాన్నని నన్ను చాలా గారాబంగా చూసేవారు అందరూ. అలాంటిది నేను యింట్లోంచి వచ్చింతర్వాత చిన్నన్నయ్య పెళ్ళి జరిగితే నేను యిక్కడున్నానని తెలిసీ నన్ను పిలవలేదు. మా అన్నయ్య మాత్రం హాస్టల్‌కొచ్చి తన పెళ్ళి గురించి చెప్పాడు. కాస్సేపు నన్ను తిట్టి, కాస్సేపు బతిమాలాడు యింటికి రమ్మని. అంతే"

మయూరి వంక ఆశ్చర్యంగా చూసింది ఆనందం—

"మరి నీకు ఏం రోగమొచ్చిందని యిలా వచ్చావే మొద్దుమొహమా?"

"సినిమాల్లో చేరతానంటే వద్దన్నారు. అంతే- వచ్చేశాను"

"అసలు నీకు ఎందుకే ఈ సినిమాలు, గతిలేనివాళ్ళలాగా. ఇప్పుడీ అవస్థ లెందుకు?" ఆశ్చర్యపోయి అడిగింది

"ఎందుకేముంది? సినిమా యాక్టర్‌నయితే తప్పా?" ఎదురుప్రశ్న వేసింది మయూరి.

"అసలు నీకీ సినిమా పిచ్చి ఎలా పట్టుకుంది?"

"మంచి ప్రశ్నేవేశావు. నాకసలు చిన్నప్పటి నుంచీ సినిమాలు చూసే అలవాటుంది. సినిమా పత్రికలు చదవటంతో ఆ ఆసక్తి మరింత పెరిగింది. నేను నైంత్ క్లాసులో వున్నప్పుడనుకుంటాను, మా ఊరికి నమ్మాళ్వార్‌గారని ఒక అరవాయన వచ్చాడు. వాళ్ళు కాకినాడనుండి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చారు. ఆయన భార్యకు భరతనాట్యంలో మంచి ప్రవేశం ఉంది. ఆవిడ పేరు కరియమ్మ. మన సినిమాల్లోని డాన్సులు నేను ఆవిడ ముందు చేసి చూపిస్తే, ఆమె సరిదిద్దుతుండేది. ఒకసారి భరతనాట్యం నేర్చుకొమ్మని ఆవిడే ప్రోత్సహించింది. మా అమ్మ ససేమిరా ఒప్పుకోలేదు. మా నాన్నే పోనిమ్మన్నాడు. సరదాపడుతోంది కదా, కొంపమునిగేదేముందీ అని అమ్మకు నచ్చజెప్పాడు. ఓ ఏడాదిపాటు చక్కగా నేర్చుకున్నాను. అంతలో నమ్మాళ్వారుగారికి మళ్ళీ ట్రాన్స్‌ఫరవడంతో నా నాట్యం మూలపడింది. అప్పట్లోనే వీడియో కెమేరాలొచ్చాయి. మావూళ్ళో వెంకటేశ్వర్రావ్‌గారని మాతో సమానంగా వున్నవాళ్ళు, వాళ్ళమ్మాయి పెళ్ళికి మద్రాసు నుండి వీడియో కెమేరా తెప్పించారు. ఒక కేసెట్‌కు పదిహేను వందల రూపాయలు, దారి ఖర్చులన్నీకాక. నా డాన్సు వీడియోగా తీసుకుని చూసుకుంటే బావుండునని పించింది. మా యింట్లోనే కాదు, మా వూళ్ళోనే టీవీ లేదనుకో అప్పటికి. అయినా పక్కవూరి నించి టీవీ అద్దెకు తెచ్చుకుని ఎప్పుడైనా చూసుకోవచ్చుకదా అనుకుని నా డాన్సులు వీడియో తీయించుకుంటానన్నానే. ఇక అంతే, ఎంత గొడవచేసిందనుకున్నావు మా అమ్మ?" అది గుర్తొచ్చి నవ్వింది మయూరి.

"గొడవ చెయ్యరా మరి? నీ బోడిడాన్సులు, అందునా ఇంట్లో టీవీగానీ, వీసీపీగానీ లేకుండా పదిహేను వందలు తగలేస్తానంటే ఎవరూరుకుంటారు?" వాదించినట్టుగా అంది ఆనందం.

"అబ్బా... డబ్బు గురించి కాదే తల్లీ- నేను అడిగానంటే మా నాన్న డబ్బుకు వెనకా ముందూ చూడడు. అదీకాక మన దగ్గర డబ్బులకేం కొదువ? అలిగి, గారాబం చేసి పట్టించినవీ, రాఖీ పండుగరోజు అన్నయ్యల దగ్గర వసూలు చేసినవీ, పండుగలరోజున హారతిపట్టి వసూలు చేసినవీ, ఖర్చులకిచ్చిన వాట్లో దొంగలెక్కలు చెప్పి మిగుల్చుకున్నవీ, మా అన్నయ్య పెళ్ళప్పుడు ఆడపడుచు కట్నంకింద అన్నయ్య దగ్గర లాగినవీ, అబ్బో... అయిదారు వేలదాకా వుండేవి నా పెట్లో. అందులోంచే వీడియో తీయించుకుంటానని అమ్మకు చెప్పి, తర్వాత నాన్న దగ్గర మూడువేలని చెప్పి కొట్టేయొచ్చుననుకున్నాననలు" అప్పటి జ్ఞాపకాల ఉత్సాహంతో సంతోషంగా చెప్పింది.

"ఆ దిక్కుమాలినవాడి ముందర తైతక్కలాడి సినిమా తీయించుకుంటావా? ఆ తర్వాత సినిమాలు చూసినట్టుగా నువు టీవీ తెచ్చి, వేసుకుని చూసినప్పుడల్లా ఊరివాళ్ళంతా సినిమాదాన్ని చూసినట్టు నిన్ను చూడాలా? పెళ్ళికావలసిన పిల్లవు, రేవులో తాడిలాగా ఎదిగావు, నీకసలు సిగ్గూ, శరమూ వుందా–అంటూ మా అమ్మ అంతెత్తున ఎగిరింది. మా నాన్నకూడా ఒప్పుకోలేదు. అలిగి అన్నం మానేశాను"

"ఇంకేం... గారాలకూతురు అన్నం మానేసిందంటే మీ నాన్నగారి గుండె కరిగి వరదలై పారిందన్నమాట" నవ్వుతూ అంది ఆనందం.

"నేనూ అలాగే అనుకున్నాను. కానీ వీడియో కోసం అన్నం మానేసానని వినగానే మా నాన్న వచ్చి నా రెండు చెంపలూ వాయగొట్టాడు. చిన్నప్పుడెప్పుడో అయిదారేళ్ళు వున్నప్పుడు తప్పిస్తే, ఆ తరవాత మా నాన్న నన్ను కనీసం తిట్టనుకూడా లేదు. అలాంటిది కొట్టేసరికి నాకు మరింత కోపం వచ్చింది. గదిలో దూరి తలుపేసుకున్నాను. నా ఖర్మకాలి, ఆ గదికి కిటికి తలుపులేదు. ఇక ఆ కిటికీ దగ్గర చేరి మా వదిన బతిమాలటం, మా అన్నయ్యలు బతిమాలటం, నాన్నేమో నేను అన్నం తిన్లేదని తనూ మానేసి తోటలో వెళ్ళికూచున్నాడు"

"అబ్బ... సినిమా కథలాగా సస్పెన్స్ ఆపి, అసలు వీడియో తీయించుకున్నావో లేదో చెప్పవే తల్లీ ముందర" ఆత్రంగా అంది ఆనందం.

"ఏం చేస్తావు ?" కోపం నటిస్తూ, కుతూహలంగా అడిగింది మయూరి.

ఉదాహరణకు నువ్వు తెల్లచీరకట్టుకోవాలని డ్రైక్లీనింగ్ కేసి తెచ్చి పెడతావుకదా, ఆరోజున నీ వైట్ బ్రాసియర్ నా పెట్లో పెట్టి తాళం పెడతాను. తెల్లచీరా, తెల్ల జాకెట్‌కు వేరే బ్రా వేసుకోలేవు కదా, గంటసేపు బతిమాలించుకుని అప్పుడిస్తాను"

"పోవే... నీ మొహం" నాలుక చప్పరించింది మయూరి - "అసలిప్పుడు బ్రా వేసుకోక పోవడమే ఫేషన్"

"ఛీఛీ... సిగ్గులేని మొహమా" కంగారుగా అంది ఆనందం - "అసలు నా బుద్ధితక్కువగానీ, నిన్ను ఏడిపించటం, అదీ యిలా అని అనుకోవడమేమిటి?"

"ఒసి పిచ్చిదానా, మాటవరుసకు అన్నాను గానీ, నా సంగతి నీకు తెలియదా- నీ యూనిఫామ్ దాచేస్తే సరిపోదూ"

"నువ్వంతటి దానివేలే. ఇంతకూ ఏమంటావ్ ?" చిరుకోపం ప్రదర్శించింది ఆనందం.

అంతలో పనిమనిషొచ్చింది-

"అమ్మగారూ- టీ కాయమంటారా? లేక టిఫినేదైనా చేయమంటారా ?"

"నాకివాళ డ్యూటీ లేదు. భోజనం నిదానంగా చెయ్యొచ్చు. ఇంతకీ ఏం టిఫిన్ చేస్తానంటావ్ ?"

"ఉప్మా చేసేత్తానమ్మగారూ ... చిటికెలో అయిపోద్ది"

"నీ స్పెషాలిటీ కూడా అదే కదా, సరే ... చేసెయ్ పో" పనిమనిషి వెళ్ళగానే అంది మయూరి -

"ఇది ఉప్మా బ్రహ్మాండంగా చేస్తుందన్నంత వరకూ ఒప్పుకుంటాను గానీ, వారానికి మూడు రోజులు అదేతిని, అసలు ఉప్మా అంటే ఎలర్జీ వచ్చినట్టుంది"

"తప్పేదేముంది - దాని చపాతీలు తిన్లేక చచ్చేకంటే ఉప్మా తినటం ఎంతో మేలు కదూ? సరేగానీ, యిక చెప్పవే సంగతి"

"ఐస్‌క్రీం మాత్రం తప్పదు. గుర్తుంచుకో. అన్నట్టు ఎక్కడున్నాం, నేను గదిలో తలుపువే నుకున్నాను కదూ. అయ్యో, చెప్పటం మరచి పోయాను, మా నాన్నకు మలేరియా వచ్చి, అప్పుడే కోలుకుంటున్నాడు. ఆయన కూడా అన్నం మానేసి పోయి తోటలో కూచున్నాడని వినేసరికి నాకు కొంచెం బాధేసింది. కానీ అంతలో మళ్ళీ పట్టుదల కలిగింది. నా డాన్సు లు నేను వీడియోలో చూసుకోకూడదా ? అందులో అంత తప్పు ఏముంది ? సినిమా చూసినట్టు అందరూ చూస్తారే అనుకుందాం, నేనేమైనా హెలెన్ డాన్సులు చేస్తానన్నానా, భరత నాట్యమే కదా ? వీళ్ళకు ఎందుకింత పట్టుదల ? వాళ్ళందరూ బతిమాలుతున్నారు, నా పట్టుదల మానమంటున్నారే తప్ప, దిగిరా వటం లేదు. ఇలా లాభం లేదని కొంచెం ఓవరాక్షన్ చేద్దామనుకున్నాను. మళ్ళీ ఏడుపు లంకించుకుని- చేతిగాజులూ, కాలిపట్టాలూ, మెళ్ళో గొలుసూ, చెవుల దుద్దులూ అన్నీ తీసి గదినిండా విసిరికొట్టాను. దిండు తీసి, పైనున్న ఫ్యాన్‌కేసి విసిరి కొట్టాను. ఫ్యాన్ తిరుగుతున్న సంగతి గుర్తులేదు. దిండు చిరిగి, స్పాంజి ముక్కలన్నీ చెల్లాచెదురుగా గదంతా అయ్యాయి. ఒక్కసారి అవన్నీ చిందరవంద రగా నా చుట్టు పడటంతో క్షణం సేపు కంగారు పడ్డాను. ఇక వస్తువులేవీ పైకి వేయొద్దని జాగ్రత్తపడి, గదిలో వున్నవన్నీ గోడలకు విసిరి కొట్టి, కింద భోరుమని ఏడుస్తూ కూర్చున్నాను. పాపం, మా వదినక్కూడా నేనంటే చాలా యిష్టం. నన్ను బతిమాలటం ఆపేసి మా అన్నయ్యను కోప్పడింది. ఆడపడుచు నట్టింట్లో కూర్చుని ఏడుస్తుంటే మంచిది కాదండీ. అయినా, ఆ పిల్లేం అడిగిందని. నాట్యం, అదీ భరత నాట్యం, ఇంట్లో చేస్తాను, టీవీలో వేసు కుని తన నాట్యం తను చూసుకుంటాను అంది. అందులో తప్పేముంది. స్టేజీఎక్కి ఆడ తానని అడగలేదు కదా. ఆ మాత్రం అర్థం చేసుకుని సర్దుకు పోవాలి- అంటూ మా అన్న య్యను మా నాన్న దగ్గరికి రాయబారానికి పంపింది. ఇక మన కోరిక తీరే సమయం వచ్చిందని లోలోపల సంతోషించాను. పైకి మాత్రం ఏడుస్తూ, ఇదిగానీ జరగకపోతే కాలేజీ కి వెళ్ళను, అన్నం మానేసి కూర్చుంటాను. ఎన్నిరోజులైనా తలుపులు తీయను, అనలెవ్వ రితోనూ మాట్లాడను- అంటూ కాస్సేపు బెది రించాను. నాన్న దగ్గరికెళ్ళిన అన్నయ్యొచ్చేవ రకూ ఊరుకోమని మా వదిన నచ్చచెప్పటంతో కాస్సేపు డోసు తగ్గించాను. పది నిమిషాలకల్లా మా అన్నయ్య..."

"ఏమండీ" ఎవరో పిలిచినట్టు వినిపించ టంతో ఇద్దరూ గుమ్మంకేసి చూశారు. ఆనందం చప్పున లేచి నిలబడి-

"మీరా.. రండిరండి" అంటూ ఆహ్వా నించింది గుమ్మంలో నిలుచున్న రోసీ, బాలూ లని.

ఇద్దరూ లోపలికి నడిచారు.

"మీరు స్వప్న బ్రదర్ కదూ" బాలూ నడి గింది మయూరి.

"అవునండీ"

"మిమ్మల్నొకసారి హాస్టల్ దగ్గర చూశాను, స్వప్నతో మాట్లాడుతున్నప్పుడు. కానీ పరి చయం లేదు".

"మీతో ఒక్క నిమిషం మాట్లాడాలని రోసీ అంటే, నేను కూడా వచ్చాను. మీ దగ్గరికని తెలియదు" వివరించాడు బాలూ.

"నాతో కాదనుకుంటాను" నవ్వింది మయూరి - "ఇప్పుడు లోపలి కెళ్ళింది చూ డండి, అది, ఆనందం. నా పేరు మయూరి".

"ప్లీజ్ టు మీట్ యూ" మర్యాదగా అన్నా డు బాలు.

"మేం యిద్దరమే కాదు, మా రూమ్మేట్ మరో మెంబర్ వుంది, శివలక్ష్మి. మేం ముగ్గుర మూ రావటం కంటే స్వప్న ఒక్కతే వస్తే సులువని దాన్నే రమ్మంటుంటాం" అంది మయూరి. వచ్చిన అతిథులక్కూడా టిఫిన్ చేయమని పనమ్మాయికి పురమాయించటాని కి లోపలికెళ్ళిన ఆనందం, తిరిగి ముందు గదిలో కొచ్చి, ఆనరికే కలుపుగోలుగా మాట్లాడు తున్న మయూరిని చూసి ఆశ్చర్యపోయింది. ఆడా, మగా, ఎవరైనా సరే, పరిచయమైన వాళ్ళతో క్షణాల్లో కలిసిపోయే మయూరిని చూ సినప్పుడల్లా ఆనందం అలా ఆశ్చర్యపడు తూనే వుంటుంది.

"అవునండీ ... యింతకూ స్వప్నేం చే స్తూంది?" అడిగింది మయూరి.

"స్వప్నకు ఒంట్లో బాలేదండి ... ఫ్లూ అన్నాడు డాక్టరు"

"అయ్యో ... ఎప్పటినుంచీ?"

"అరరే, మాకు తెలీదండీ"

"నిన్ననే కాస్త జ్వరంగా వుందండి. సాయంత్రం కల్లా ఎక్కువయ్యింది. పిన్ని లీవ్ పెట్టేసిందీవాళ. కొంచెం ఫరవాలేదనుకోండిప్పుడు"

"శివలక్ష్మి రాగానే మనం వెళదామే" అంది ఆనందం.

"డాక్టర్ దగ్గరికి వెళతామన్నారు. కలవకపోవచ్చు- మీరిప్పుడు వెళితే" అన్నాడు బాలు.

కాస్సేపు రోగాలూ, డాక్టర్ల గురించి సంభాషణ జరిగాక రోనీ అన్నాడు—

"మీ ఈవినింగ్ పాడుచేసినట్టున్నాం, మేం వచ్చి. అసలు సంగతేమిటంటే, లేడీస్ హాస్టల్స్ గురించి రాస్తున్నానని చెప్పి, ఆ మధ్య మిమ్మల్ని కూడా కొంచెం వివరాలు అడిగాను గుర్తుందా, ఆ ఆర్టికల్ పబ్లిష్ అయింది. మీకు ఓ కాపీ యిద్దామని వచ్చానండీ" అంటూ ఆనందంకు ఆ పత్రికలో ఆ వ్యాసం వచ్చిన దగ్గర తెరిచి అందించాడు.

"చాలా పెద్దగా వున్నట్టుందే"-పేజీలు తిరగేస్తూ అంది ఆనందం- "థాంక్సండీ, యింత గుర్తు పెట్టుకుని తెచ్చిచ్చారు"

"ఆ మాత్రం కూడా యివ్వకపోతే నువ్వు మరోసారి మరేదైనా విషయం గురించి అడిగినప్పుడు కోపరేట్ చెయ్యొద్దూ" అంది మయూరి.

నవ్వి ఊర్కున్నాడు రోనీ.

అంతలో శివలక్ష్మి వచ్చింది, ఆకుపచ్చ రంగు పువ్వులున్న తెల్ల ఆర్గెండీ చీరలో. అయితే మయూరి ఆ విషయం ఏమీ ప్రస్తావించలేదు. రోనీ, బాలు యిద్దరూ వెళ్ళటానికి సిద్ధమయ్యేంతలో టిఫిన్ చేయమని బలవంతం చేసి కూర్చోబెట్టేశారు.

"మీకు ఈ పత్రికల్లో రాయటంతో ఏ మాత్రం వస్తుందండీ ఇన్‌కమ్?"

"మీ వయసు ఏ మాత్రం వుంటుందండీ మయూరిగారూ" వ్యంగ్యంగా అంది ఆనందం.

"మగవాడి వయసూ, ఆడదాని సంపాదనా అడక్కూడదని రోజులొచ్చాయే తల్లీ యిప్పుడు. మగాళ్ళు కూడా నెరిసిన మీసాలకు రంగేసుకుని, ముఖానికి పౌడర్లు అద్దుకుని, అమ్మాయిల్ని ఆకర్షించటానికి కాలేజీ కుర్రాళ్ళలాగా టీనేజీ వేషాలేస్తున్నారిప్పుడు" అంది మయూరి.

"మీరన్న విషయం నాకు వర్తించదనుకోండి, ఐనా మీరు చెప్పిన మాటతో ఏకీభవిస్తున్నాను" అన్నాడు బాలూ.

"లేకపోతే ఏమిటండీ, దీనివన్నీ పాతకాలం బుద్ధులు. ఆడవాళ్ళు వంటింటికే అంకితమైనప్పటి సామెతలు యిప్పుడు చెబితే ఎలాగా? ఇప్పుడు మరి ఆడవాళ్ళు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. స్కూలు సర్టిఫికెట్ మీదా, ఉద్యోగం అప్లికేషన్ మీదా పుట్టిన తేదీ వుండనే వుంటుంది. ఇంక వయసు దాచుకునే ఛాన్సేదీ. అలాగే పాతకాలంలో అంటే కులవృత్తులు చేసుకునే వారు గనుక సంపాదన సంగతి తెలీదుకానీ యిప్పుడైతే పనిచేసే డిపార్ట్‌మెంటూ, ఉద్యోగమూ చెబితే జీతం ఎంతో ఆటోమేటిగ్గా తెలిసిపోతుంది కదా, బల్లకింద చేతుల్లోకి వచ్చేదికూడా చెప్పేయొచ్చుననలు"- మయూరి వివరణ వినగానే కుతూహలంగా అడిగాడు రోనీ-

"అవునూ ... మీరేం చేస్తున్నారు?"

"ఇప్పుడిప్పుడే సినిమాల్లో చిన్నచిన్న వేషాలు వేస్తున్నాను"

కాసేపు వివరాలు అయ్యాయి. అంతలో మళ్ళీ అడిగింది మయూరి-

"ఇంతా చేసి మీరు మా ఆనందం చెప్పిన పాతకాలం సామెతని నిజం చేశారు"

"మాటల్లో పడి ఆ విషయం మరిచిపోయాను. జర్నలిజం నాకు పార్ట్‌టైం లాంటిదనుకోండి. అలాగని ఫుల్‌టైం ఉద్యోగమేదీ లేదు. ఒక ప్రైవేట్ ఇన్‌స్టిట్యూట్‌లో జాబ్‌వర్క్ చేస్తాను. మనకు వీలున్నప్పుడు వెళ్ళటం, వచ్చి దాంట్లో వాళ్ళకు సగం, మనకు సగం. తీరికున్నప్పుడు యిలాంటివి రాస్తుంటాను. ఓ ట్యుటోరియల్ కాలేజ్‌లో గెస్ట్ లెక్చరర్‌గా పనిచేస్తున్నాను" నవ్వుతూ అన్నాడు రోనీ.

"గెస్ట్ లెక్చరరా, అంటే?"

"ఏంలేదు ... నా సబ్జెక్ట్‌లో వాళ్ళ రెగ్యులర్

లెక్చరర్ రానప్పుడు పిలిచి ఆ క్లాసు యిస్తుంటార్, రోజు కూలీ అన్నమాట''

"ఎక్కడైనా లెక్చరర్‌గానో, ఏ పత్రికలోనో సబెడిటర్‌గానో చేరకపోయారా?''

"నాక్కూడా చేరాలనే వుంది గానీ చేర్చుకునే వాళ్ళేలేరు''

"అదేంటీ?'' ఆశ్చర్యంగా అడిగింది ఆనందం.

"ఎమ్.ఎ.లో నేను రాసింది ఎగ్జామినర్స్ మొఖాలకు అర్థమై వుండదు. ఏదో పాస్ చేసేరు దయతలచి. ఆ మార్కులకు లెక్చరర్‌ని కాలేను. జర్నలిజమ్ నాకు పెద్దగా ఇంట్రస్ట్ లేదు. ఇప్పుడు డ్రాయింగ్ నేర్చుకుంటున్నాను. మరోసారి ఎమ్.ఏ. రాసి, బి.ఇడి చేస్తే గానీ మంచి వుద్యోగం వచ్చే ఛాన్స్ లేదు''.

కాస్సేపటికి అథితులిద్దరూ సెలవు తీసుకున్నారు. ముగ్గురు స్నేహితురాళ్ళూ ముచ్చటించుకుంటూ ముస్తాబు చేసుకుంటుండగా శివలక్ష్మి గురించి మయూరి చెప్పిన విషయం గుర్తొచ్చి అడిగింది ఆనందం. "నాకు కారేమిటి? నీ మోహం, ఎవర్ని చూసి ఎవరనుకుని చచ్చావో' కొట్టేసింది శివలక్ష్మి.

"అబ్బ ... నువ్వేనే తల్లీ, మీ ఆఫీసర్‌తో గానీ పిక్నిక్ వెళ్ళావేమోననుకున్నాను'' కొంటెగా అంది మయూరి.

"నేనెందుకు చస్తానే మా ఆఫీసర్‌తో, నువ్వసలు ఎలా చూసి చచ్చావోగానీ మధ్యలో మమ్మల్ని చంపుతున్నావు'' కసిరింది శివలక్ష్మి.

"ఐతే చిన్నప్పుడు నీతో పాటు పుట్టిన కవలపిల్ల, నీకు అక్కో చెల్లెలో యింకెక్కడో పెరుగుతూంది. ఎక్కడో కథ క్లైమాక్స్‌లో నీ మొగుడో, ఆమె మొగుడో అనుమానపడి చచ్చాక మన ఆనందం, అంటే, అదే, హాస్పిటల్లోని ఒక నర్సు రహస్యం చెబుతుంది, అప్పుడే చచ్చిపోయిన బిడ్డను కన్న ధనిక దంపతులకు మరో కవలపిల్లను ఎలా యిచ్చిన సంగతీ''.

"అబ్బా ... అందరూ సినిమాల్లోలాగానే చస్తారనుకుంటున్నావా?''

"చావరు. ఓవరాక్షన్ చేయకుండా అందరూ మామూలుగా, సహజంగా చస్తారు. ఆ కవలల్ని మార్చిన నర్సు ఎవరో మహాతల్లి, బతికుందో చచ్చిందోగానీ వాళ్ళకు నిన్నిచ్చినా బావుండేది, ఈ చావుమేళం తప్పేది.'

"అబ్బ... పోనియ్యండే. నువ్వు ఎలా చూశావో ఏమిటో, ఏడున్నరయిందిప్పటికే. తొందరగా తెమిలి చావండి. వెళ్ళాలి, రావాలి, తినాలి, పడుకోవాలి'' కోప్పడింది ఆనందం.

వాళ్ళు వెళ్ళేసరికి యిల్లు తాళం వేసివుంది. కాసేపు వెయిట్‌చేద్దామని గేటు తీసుకొనివెళ్ళి అరుగులమీద కూర్చున్నారు ఎదురుచూస్తూ. అప్పుడే జీవన్ వచ్చాడు. ఒకరినొకరు తెలుసుకున్నాక అడిగాడు జీవన్-

"మయూరి అంటే నువ్వేనా అమ్మాయ్'' మయూరివైపు పరీక్షగా చూస్తూ అడగటంతో ముగ్గురూ ఆశ్చర్యపోయారు.

"అవునండీ, ఎలా గుర్తుపట్టారు?''

"అబ్బె, ఊరికే అడిగాను, మీరు ముగ్గురూ కలిసే వుంటున్నారా?''

"అవునండీ''

"ఎక్కడ, మీరుంటున్నది?''

ఇంటి అడ్రస్ వివరంగా అడుగుతున్న జీవన్ ధోరణి ముగ్గురికీ వింతగానే అనిపించింది గానీ, స్వప్నతండ్రి అనే మర్యాదకొద్దీ, ఊసుపోక మాట్లాడుతున్నాడేమోననే ఆలోచనతోనూ అన్నిటికీ వివరంగా సమాధానమిచ్చారు. ఇంకా ఏదో అడగబోయాడు జీవన్. కానీ అంతలోనే స్వప్న గౌతమీ రావటంతో ఆగిపోయాడు.

స్నేహితురాళ్లని చూసి స్వప్న సంతోషపడింది. అయితే కొద్దిసేపటికే జీవన్ గదిలోకొచ్చి-

"సప్పీ, కొంచెం రెస్ట్ తీసుకో' అనేసరికి ముగ్గురూ నిర్వెరపోయారు.

రెండు నిమిషాల్లో బైటపడ్డారు ముగ్గురూ.

వంటింట్లో స్వప్నకు సూప్ తయారుచేస్తూంది గౌతమి. ఆమె దగ్గరికి నడిచి, కొంచెం మెల్లిగా అడిగాడు జీవన్.

"వీళ్ళుముగ్గురూ సప్పీకి మంచిఫ్రెండ్సా?''

అతని గొంతుతో వినిపించిన చిరాకును గమనించింది గౌతమి.

"అవును, ఎందుకలా అడుగుతున్నావు జీవన్?"

"వీలైనంత వరకూ వాళ్ళతో దూరంగా వుండమని చెప్పు" సీరియస్‌గా అన్నాడు.

"అదేమిటి, అసలేమయింది?" విస్తుపోయింది.

"ఏమీ అవలేదు. మంచిది కాదు కనుక కాదని చెప్పాను. ప్రతిదానికీ వాదించకు. వివరాలు తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందాం. కానీ నేను చెప్పింది ఎందుకూ అని కాస్త ఆలోచించు అంతే. నేను నష్పీ దగ్గర కూర్చుంటాను, నువ్వు సూప్ చేసి తీసుకురా" అనేసి, విసవిసా పక్క గదిలోకి నడిచాడు జీవన్.

అతని మాటలకు, అతని ధోరణికీ చాలా ఆశ్చర్యపడింది గౌతమి. కానీ చిరాగ్గా వున్నప్పుడు రెట్టించటంకన్నా ప్రశాంతంగా వున్నప్పుడు మరోసారెప్పుడైనా నిదానంగా అరాతీయచ్చుననుకుని, అతను ఎందుకలా మాట్లాడాడా అని ఆలోచిస్తూ, సూప్ తయారుచేయటంలో మునిగిపోయింది.

★ ★ ★

రెండు మూడు రోజుల్లో స్వప్న జ్వరం తగ్గుముఖం పట్టింది. గౌతమి వారంరోజులు సెలవుపెట్టి యింట్లోనే వుండిపోయింది. బాలూ కూడా అక్కడే వుండిపోయాడు. బైంకు కాలేజికి వెళ్ళిరావటం, ఏదో ఒక సమయంలో తల్లికి ముఖం చూపించటం, పిన్నికి పనుల్లో సహాయపడటం, చెల్లెలితో కబుర్లు చెప్పటం- అదే దినచర్యగా మారింది బాలూకు ఆ నాలుగురోజులూ. అంతకుముందు ఒకటి రెండుసార్లూ, ఈ నాలుగు రోజుల్లోనూ రోజూ కనీసం ఒకసారి స్వప్న గౌతమి- యిద్దర్లో ఎవరో ఒకరు సిల్వియా గురించి ప్రస్తావించారు. కానీ బాలూ మాటమార్చేశాడు. ఆరోజు విడిచి పెట్టకూడదని నిశ్చయించుకుని, పట్టుబట్టి బాలూ ఎన్నిసార్లు మాట తప్పించినా విడవకుండా అడిగింది స్వప్న.

"నీకెందుకు అవసరంలేని విషయాలు. జ్వరం తగ్గి కొంచెం ఓపికొచ్చిందో లేదో, పెద్ద ఆరాలు మొదలెట్టావు. కాస్సేపు పడుకో. నేనలా బైటికి వెళ్ళొస్తాను" కోపం నటిస్తూ లేచి నిలుచున్నాడు బాలూ.

"ఎందుకంత ఉడుక్కుంటావు. కూర్చో బాలూ, అయినా, నీకు నువ్వుగా తీసుకొచ్చి పరిచయం చేసి, యిప్పుడు వివరాలడిగితే అలా తప్పిస్తావేమిటి?" నవ్వుతూ అంది గౌతమి.

"మమ్మీ, నీ ముందరే చెబుతున్నాను. ఇప్పుడు కూర్చుని విషయం చెప్పక పోయాడో, ఆరునెలలు నేను మాట్లాడనని చెప్పు. నా సంగతి తెలుసు కదా" మంచంలోంచి లేచి కూర్చుని అంది స్వప్న.

"ఓకే, నేనూ, సిల్వియా మాట్లాడుకోవటంలేదు. ఆ విషయం అయిపోయింది. ఇప్పుడింకేమీ లేదు. చాలా?" కోపంగా చెప్పాడు బాలూ. అతనికి స్వప్న అలక విషయం తెలుసుకనుక ఆ మాత్రం చెప్పక తప్పలేదు.

"నిజంగానా?" ఆశ్చర్యపోయింది స్వప్న- "అలా అయితే రెండు మాటలు చెప్పి, 'చాలా' అంటే సరిపోదు; చాలా చెప్పాలి. ఏమయిందీ?"

మళ్ళీ కాసేపు వాదప్రతివాదాలయినాక యిక తప్పనిసరిగా చెప్పాడు-

"చెప్పక పోవటం మంచిదంటే వూర్కోరు కదా. ఆవిడగారు ఏమందో తెలుసా?" మళ్ళీ ఒక్క క్షణం తటపటాయించాడు. ఎందుకంటే అప్పటికి రెండు మూడు రకాలుగా అబద్ధాలు చెప్పాడుగానీ అలాంటి చిన్న విషయాలైతే తను సిల్వియాతో మాట్లాడి నచ్చజెవుతాననీ తను నమ్మననీ, అంత చిన్నవిషయాలైతే అసలింత దూరం రాదనీ ప్రతిదాన్నీ పీకి పాకం పెట్టింది స్వప్న. అందుకే చెప్పక తప్పదని తెలుసుకున్నాడు. కానీ గౌతమి ముందర చెప్పటానికి చాలా యిబ్బంది పడ్డాడు. చెప్పలేక చెప్పలేక ఈ విషయాన్ని కొంచెం మృదువుగానూ, గొంతును కోపంగానూ మార్చిచెప్పాడు. "మీడాడి రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు కదా, నువ్వుమాత్రం నన్నుచేసుకున్నాక మరొ ర్ని చేసుకోవని గ్యారంటీ ఏమిటీ?- అంది. ఆ విషయం ఆమెకు యిప్పుడు తెలిసిందట అంత మాటన్నాక నేను మాత్రం ఏం చెయాలి? ఆ ప్రేమ కోదండం అని సాల్యూట్ కొట్టి, జనగణమణ పాడేసి వచ్చాను".

కొద్దిక్షణాలు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు



# సంపూర్ణమైన పెరుగుదల కోసం రుచికరమైన ఫారెక్స్® మార్గం.

| మీ పాపాయి పొడవు, బరువు తనిఖీ చేసుకోండి* | మగ పిల్లలు | | ఆడ పిల్లలు | |
|---|---|---|---|---|
| | బరువు | పొడవు | బరువు | పొడవు |
| **3** నెలలు | **5.2** కిలోలు | 59.1 సెం.మీ. | **4.9** కిలోలు | 58.4 సెం.మీ. |
| **6** నెలలు | **6.7** కిలోలు | 64.7 సెం.మీ. | **6.1** కిలోలు | 63.7 సెం.మీ. |
| **9** నెలలు | **7.3** కిలోలు | 68.2 సెం.మీ. | **6.9** కిలోలు | 67.0 సెం.మీ. |
| **12** నెలలు | **8.4** కిలోలు | 73.9 సెం.మీ. | **7.8** కిలోలు | 72.5 సెం.మీ. |

*ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్ ద్వారా విడుదల చేయబడినవి.

ఇవి భారతీయపిల్లల కోసం సగటు బరువు, పొడవులు మాత్రమే. వీటితో సరిపోలకపోయినా, మీ పాపాయి పెరుగుదల మీ డాక్టరుకు సంతృప్తికరంగా వుంటే ఆందోళనపడే అవసరం లేదు.

పిల్లల పెంపకం సంబంధంగా తీసుకోవలసిన శ్రద్ధను గూర్చి తెలిపే చిన్న రంగుల పుస్తకపు ఉచిత ప్రతి కోసం వీరికి వ్రాయండి:
గ్లిండియా లిమిటెడ్, (FPD/66),
డా. ఆనీ బెసెంట్ రోడ్,
వర్లీ, బొంబాయి-400 025.




సంపూర్ణమైన వికాసం
మరియు పెరుగుదల కోసం
మీ పాపాయికి ఇవ్వండి

**ఫారెక్స్®**

పెరుగుదల కోసం
రుచికరమైన విధానం

26/173

ఎవరి ఆలోచనలో వాళ్ళు మునిగిపోయారు. అప్పుడే, ముందురోజు ఇంట్లో జరిగిన గొడవ గుర్తొచ్చింది బాలూకు. ఏడ్చి, అలిగి, తిండితిన కుండా వుండీ భర్తను సాధించటంలో సరస్వ తిని ఆదర్శంగా చెప్పుకోవచ్చు, అలాంటివా ళ్ళు. అందుకే ముఖ్యమైన సందర్భాలలో జీవన్, గౌతమి దగ్గరికి వెళ్ళకుండా అడ్డుపడి, అతను తనకు చేసిన అన్యాయానికి బదులు తీర్చుకుంటుంటుంది. గౌతమి ఎప్పుడూ ఏ విషయంలోనూ జీవన్‌తో పోట్లాడదు. అంతే కాక, మనసుమూలలోవున్న అపరాధ భావన మూలంగా సరస్వతి పోట్లాడినప్పుడు గమ్మున ఊరుకుంటాడతను. అయితే అతన్ని అదుపు చేయగలదు కానీ బాలూని మాత్రం అదుపు చేయలేక ఉక్రోషంతో పోట్లాడి, రణరంగం సృష్టిస్తుంది సరస్వతి అప్పుడప్పుడూ.

ముందురోజు కూడా అదే జరిగింది. కాలేజ్ నుండి తిరిగొచ్చిన జీవన్, బాలూద్వారా స్వ ప్నకు జ్వరం వచ్చిన విషయం తెలుసుకుని ఎక్కడికో వెళతానని భార్యతో చెప్పి వెళ్ళాడు. ఆరోజు అతను ఇంటికి తిరిగివెళ్ళేసరికి పది దాటింది. అక్కడికే వెళ్ళాడని కనిపెట్టిన సర స్వతి, ఇక అతను వెళ్ళకుండా అడ్డుపడింది. కానీ బాలూ ఏకంగా అక్కడే వుండటం మూడు రోజులు చూసి, యిక ఆ రోజున బాలూ ఇంటికి రాగానే తిట్టాలనీ, వీలైతే అక్కడికి వెళ్ళకుండా చేయాలనీ అనుకుంది. అంతేకాక ఈమధ్యలో సరస్వతికి రెండు విషయాలు కొత్తగా తెలి శాయి. బాలూ, సిల్వియాల స్నేహం ఎందుకు చెడిందన్న విషయం, వాళ్ళయింటి దగ్గరుండే సిల్వియా ఫామిలీ ఫ్రెండ్స్‌ద్వారా నూ, మయూరి అనే సినిమాలమ్మాయితో స్వప్న స్నేహం చేస్తుందంటే ఏమనుకోవాలనే సంగతి తన బంధువు చెప్పగానూ తెలిసింది. ఆ విషయం తెలిసి, పరోక్షంగా తన నోటికివచ్చిన ట్టు స్వప్నగురించీ, గౌతమిగురించీ సరస్వతి అన్నమాటలతో మనసు కలతగా వున్న జీవన్, ఆ మరునాడే స్వప్నను చూడటానికి వచ్చి, మయూరిని చూడటంతో అతని చిరాకు మరింత ఎక్కువై ఆ రోజు అలా ప్రవర్తించాడు.

మయూరితో స్నేహం చేయటంలో తప్పేమీ లేదని తండ్రితోనూ, తను అక్కడికి వెళ్ళటం మానుకోనని తల్లితోనూ పోట్లాటపెట్టుకోవలసి వచ్చింది బాలూకు.

"ఆ సినిమా ముండతో ఆ పిల్ల తిరుగు తూందంటే తల్లి బుద్ధులు రాకేమవుతాయి? మీ డాడీ చేసిన నిర్వాకానికి నిన్ను పెళ్ళి చేసుకోనూ అని ఆ సిల్వియా నీ మొహానచె ప్పుతో కొట్టినట్టు చెప్పినా నువ్వేమో యింకా పిన్నీ పిన్నీ అని ఆ పిన్ని చుట్టూ తిరుగుతు న్నావు. నీకు బుద్ధెప్పుడొస్తుంది? నువ్వు అక్కడి కి వెళ్ళటానికి వీల్లేదని చెబుతున్నాను. మాను కో"

"మధ్యలో నువ్వెందుకురా ఆ సినిమా యా క్టర్‌ని వెనకేసుకొస్తావు. దాంతో తిరగొద్దని సప్పికి నచ్చచెప్పటంపోయి"

"నువ్వుకూడా పూలిష్‌గా మాట్లాడకు డాడీ" విసురుగా అన్నాడు బాలు.

"ఒరేయ్, నన్ను 'పూల్' అనేంత మొనగాడి వయ్యావా నువ్వు. హెూల్డ్ యువర్ టంగ్, యూ స్టుపిడ్. అయినా, నీకు అనవసర విష యాల్లో నువ్వు జోక్యం చేసుకోకు" తర్జని చూపి హెచ్చరిస్తూ, మరో చేత్తో బాలూ జబ్బ గట్టిగా పట్టుకుని కోపంగా అన్నాడు జీవన్.

"మీరు పిన్నిని చేసుకున్నారని సిల్వియా నన్ను చేసుకోనంది. మరి మిమ్మల్నికూడా వది లెయ్యమంటారా? స్నేహితులన్నాక వాళ్ళ జీవి తాలు వేరు, స్నేహం వేరు. ఆ అమ్మాయి స్వప్ననేమైనా సినిమాల్లోకి ఈడ్చుకు పోతుందా?"

"మరి అంత తెలివున్నవాడివి యింకా వాళ్ళి ంటికెందుకూ వెళ్ళటం?" కొడుకు భర్తని విమర్శించిన సంతోషం లోపల దాచుకుని అడిగింది సరస్వతి.

"టూమచ్ బాలూ. ఈ విషయం యింత టితో వదిలెయ్యి. యూనో, దట్ గర్ల్...షీ యీజె బిచ్. దాని గురించి నా ఫ్రెండ్స్ ఎంత వల్గర్‌గా మాట్లాడారో తెలుసా? అలాంటి వాళ్ళ తో స్నేహం మంచిది కాదు. స్వప్నకెలా చె ప్పాలో గౌతమి చూసుకుంటుంది. నువ్వేమి కల్పించుకోకు"

"సారీ డాడీ" తండ్రి మయూరిని కులట న్నందుకు బాధపడుతూ అన్నాడు బాలూ - "మీ మాటలు విని స్వప్న ఆ అమ్మాయితో స్నేహం వదులుకుంటుందని నేననుకోను. ఒక వేళ వదలుకుంటే వదులుకోవచ్చు గాక. కానీ మీకు యిద్దరు కూతుళ్ళున్నారు. మీ కూతుళ్ళ లాంటి మరో అమ్మాయిని మీరు యింత నీచంగా తూలనాడటం, డిస్‌గ్రేస్ టు యువర్ ప్రొఫెషన్. వద్దు... మీరేమీ చెప్పొద్దు. ఈ విషయం యిక నేను మీతో మాట్లాడను. వదిలె య్యండి" ఖచ్చితంగా అన్నాడు బాలూ.

సినిమాల్లో నటిస్తున్నందుకు, ఆమెగురించి వ్యక్తిగతంగా ఏమీతెలియకపోయినా మయూ రిని 'కులట' అన్నాడు జీవన్. ఆమెతో స్నేహం చేస్తున్నంత మాత్రానే స్వప్నకూడా చెడిపో తుందని అన్నారు అతని మిత్రులు. పెళ్ళయి, సంసారం చేసుకుంటున్న తన భర్తను వల్లోవే నుకున్నందుకు గౌతమిని 'వగలాడి' అంటుంది సరస్వతి. ఆ విషయం మాత్రం జీవన్ ఒప్పుకోలేదు. ప్రతి మనిషీ తనున్న స్థానాన్ని బట్టి నీతినియమాలను అంచనావే స్తుంటాడు. తన పరిధి, మరొకరికి వాళ్ళపరిధి నుండి చూస్తే ఎలా కనిపిస్తుందోనన్న ఆలోచన మాత్రం ఉండదు. అయితే యిక్కడ ముఖ్య మైన విషయం ఏమిటంటే భావాలు, ఆలోచన లు, సిద్ధాంతాలూ వదిలేసి ఆడదాని శీలం నీతిని నిర్వచించటం. ఆ శీలం కలిగిన లేక కోల్పోయిన ఆడదాన్ని వేర్వేరు కోణాల్లోంచి చూసి, ఒక్కొక్కరూ ఆమె విలువను ఒక్కోర కంగా అంచనావేస్తారు. మామిడిపిందె జీడితో నోరు చెడగొడుతుందనీ, కొంచెం పెరిగితే ఊర గాయకు పనికొస్తుందనీ, రాలిపడితే పచ్చడి పాడవుతుందనీ, పండితే రసం పిండుకోవచ్చు ననీ, మిగుల పండితే చెత్తకుప్పలోకి పోతుందనీ, దేవుడి ముందుపెడితే ప్రసాదం అవుతుందనీ ఆలోచించినట్టుగా స్త్రీనికూడా ఆమె శీలాన్ని ఆధారం చేసుకుని, భౌతిక దృష్టితో (శారీరక దృష్టి అనాలేమో) విలువ కట్టడానికి ఆమెకూడా ఒక వస్తువేనా? భార్యను ఆస్తిగా భావించి అమ్ముకునీ, తాకట్టుపెట్టీ, అతిధులకు అర్పించీ అనేక రకాలుగా వినియో గించుకున్న సంస్కృతి వారసత్వంగావస్తూ, నాగరికత పెరుగుతున్నదంటున్న సమాజంలో కూడా ఆమె వస్తువుగానే మిగలటం ఎంత చిత్రం!

"ఎక్కడ స్త్రీలు పూజింపబడుదురో అక్కడ సుఖశాంతులు విలసిల్లును" అని చెప్పి, ఆడ వాళ్ళకు సాంత్వన కలిగించే ప్రయత్నం చే సిన మనువు "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అని తను చెప్పిన సిద్ధాంతం బలాన్ని తగ్గించలేక పోయాడు. స్త్రీ శరీరంలో పురుషసంపర్కంతో ఏదో పోతుందని భావించినంతకాలమూ, స్త్రీని తనతోటిమనిషిగా గుర్తించి, గౌరవించే సమాజం ఎక్కడా ఏర్పడదు. స్త్రీలో సెక్స్ తప్ప మరొకటి లేదని భావించినంతకాలం ఇలాంటి వాదనలు తప్పవు. నీతినియమాల విలువను నిర్దేశించటంలో స్త్రీశీలానికి ప్రాధా న్యత తొలగనంతకాలం ఆ నీతి నీతికాదు. ఆ సమాజం సమాజంకాదు. ఆ మనుషులు జంతువులకన్నా హీనం."

విసురుగా బైటికి నడిచాడు బాలు. కాస్సేపు అటూ ఇటూ తిరిగి పిన్ని దగ్గరికి చేరుకున్నా డు. జరిగిందంతా చెప్పకూడదనుకునే వూర్కు న్నాడు. అదంతా గుర్తొచ్చి, ఏదో ఒకరకంగా గౌతమికి బాధకలిగించక తప్పనందుకు నొచ్చు కున్నాడు. సిల్వియా అన్నమాటలు బాలూ చెప్పగానే ఎవరికివారు ఆలోచనల్లోపడిపోయా రు. ముందుగా బాలూయే తేరుకుని అడిగా డు—

"పిన్నీ- ఒక మాటడుగుతాను సిన్సి యర్‌గా చెబుతావా సమాధానం?"

అనలే అయోమయంలో ఉన్న స్వప్న బాలూ ఏం అడుగుతాడోనని కంగారుగా చూ సింది. గౌతమి మాత్రం అలవాటుగా నన్నగా నవ్వి "అడుగు- నన్నుకూడా అలా ముందుగా గ్యారంటీ అడిగి ఆ తరువాత అసలు విషయం అడగాలా?" అంది.

"మామూలు విషయం కాదు కనుకనే అలా అడిగాను" సాలోచనగా అన్నాడు.

"సరే... అడుగు. నేను అబద్ధాలు మాత్రం చెప్పనని నీకు తెలుసుగదా"

"ఏంలేదు పిన్నీ... ఒకవేళ ఎప్పుడైనా జరి గితే, మాట వరుసకే అంటున్నాను ఒకవేళ నేనుగానీ నాన్నతో పోట్లాడి ఇంట్లోంచి వెళ్ళి

పోతే నన్ను రానిస్తావా?''

ఆ ప్రశ్న వినగానే స్వప్న మరింత తికమకపడింది. గౌతమి క్షణంపాటు ఆలోచించి బదులిచ్చింది—

''అంతకుముందుగా, అంటే నీ ప్రశ్నకు సమాధానం ఇచ్చే ముందుగా నేనూ ఒక ప్రశ్నడుగుతాను- నువ్వు జవాబు చెప్పు. నువ్వు నన్ను ''పిన్నీ'' అని పిలవడం మినహాయిస్తే నిన్నూ, స్వప్ననూ ఎప్పుడైనా నేను వేరుగా చూశానా?''

తగలవలసినచోట తగలటంతో క్షణంపాటు బిత్తరపోయాడు బాలూ.

''లేదు పిన్నీ- అలా అన్నానా నేను?'' అమాయకంగా ప్రశ్నించాడు.

''మరి ఎందుకు నీకా సందేహం? కన్నతల్లి దగ్గర కన్నతల్లి కనుక ఉంటున్నావు. నాకుమాత్రం నువ్వూ నా బిడ్డవేకదా. కాకపోతే మీ అమ్మనుండి నిన్ను వేరుచేసి, ఆమెను క్షోభపెట్టినట్టవుతుందని తప్పితే త్వరగా ఇంటికి పొమ్మని నీకు ప్రతిసారీ గుర్తుచేయటం నాకూ బాధగానే ఉంటుందని తెలియదా? సరే... ఇప్పుడంటే పెద్దాడివయ్యావు, మీసాలు కూడా వచ్చేశాయి. నీకు ప్రత్యేకంగా నేను చెప్పాల్సిందేముంటుందని చెప్పటంలేదు. మీ అమ్మ విషయంలో నీకు బాధ్యత ఉంటే, నా దగ్గర నీకు హక్కుందనుకో. నువు దగ్గర లేనప్పుడల్లా నేను నీ కన్నతల్లినికాదని గుర్తొచ్చి సరిపెట్టుకుంటుంటానుగానీ ఇలాంటి ప్రశ్న అడుగుతావనుకోలేదు బాలూ నేను''

''నువ్విట్లా సినిమా డైలాగులు చెప్పొద్దు పిన్నీ! నేనేం అడిగాను- డాడీ నన్నుగానీ ఇంట్లోంచి పొమ్మంటే, నువ్వు డాడీతో నా గురించి తగవు పెట్టుకుంటావా అనే అనుమానంతో అడిగాను'' గోముగా అన్నాడు బాలూ.

''ఆడవాళ్ళంతా పిల్లలు పుట్టేవరకే భర్తను గురించి ఆలోచిస్తారుగానీ, భర్త కన్నా పిల్లలే ఎక్కువ- తెలుసా? నీకు పెళ్ళై, పిల్లలు పుట్టిన తర్వాత నీ పెళ్ళాన్ని చూసినప్పుడుగానీ నీకీ విషయం సరిగ్గా అర్థంకాదు'' నవ్వుతూ అంది గౌతమి.

''సరేలే- ఇప్పుడు నా పెళ్ళికేవచ్చింది తొందర''

''మరి సిల్వియాను ఎందుకు లవ్‌చేశావో? పోనీలే, మరో పిల్లను చూసుకుని మళ్ళీ లవ్వాడు'' అనునయించినట్టుగా ఎగతాళిచేసింది స్వప్న.

''లవ్వా... మళ్ళీనా- చస్తే చెయ్యను. ఛీఛీ- పార్కుల్లో కూచుని మాట్లాడుకోవటం, సినిమాలు- షికార్లూ తిరగటం, చిన్నవిషయం దగ్గర కీచులాడుకోవటం... ఇదా లవ్వంటే. ఉద్యోగం వచ్చినతరవాత పిన్ని ఒక కోతిని చూపించి చెప్పినా సరే, దాని మెళ్ళో మూడు ముళ్ళు వేసేస్తాను. అంతే!''

''మమ్మీకి మస్కాకొడుతున్నావ్ ఎందుకోగానీ. అయితే నువ్వు మూడు ముళ్ళూవేసి పెళ్ళిచేసుకుంటావన్నమాట- షేమ్ షేమ్''

''మాటవరుసకన్నాను. అయినా పిన్ని చూపించినపిల్లను చేసుకుంటే పిన్ని చెప్పిన పద్ధతితోనే చేసుకోవాలిగదా?''

''మీ అమ్మగానీ ఈ మాటవిందంటే చస్తే నిన్నిక్కడికి రానివ్వదు. ఆ సంగతి వదిలెయ్యి గానీ, సిల్వియా తప్ప ఇక నీకు అమ్మాయిలే కనిపించటంలేదా లోకంలో'' అంది గౌతమి.

''అంటే ఇప్పుడిక సెకండ్ వెంచర్ మొదలుపెట్టాలా? ఓపికలేదు పిన్నీ! ఎగ్జామ్స్ వరిగెత్తుకొస్తున్నాయొకపక్కన'' నీరసంగా అన్నాడు బాలూ.

వాతావరణం తేలికపడింది. సాయంత్రం కాలేజ్‌నుండి ముందుగా బయలుదేరిన జీవన్ రాగానే బాలూనిచూసి, ముఖం తిప్పుకుని గౌతమితో అన్నాడు-

''ఈ రాస్కెల్‌ని రానివ్వకు- వాడికి తెలివి ఎక్కువైపోతుందీమధ్యన''

బాలూ అడిగిన ప్రశ్నకూ, జీవన్‌చెప్పిన మాటకూ పొత్తుకలుపుకుని ఏదో జరిగిందని ఊహించింది గౌతమి. నిదానంగా అడగవచ్చునుకుని తేలిగ్గా సమాధానం చెప్పింది—

''పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేస్తున్నాడు. పిల్లాడు నీ ఎత్తు పెరిగాడు. ఇంకా చిన్నకుర్రాడనుకుని మాట్లాడితే ఎట్లా జీవన్? పిల్లలు పెరుగుతూంటే వాళ్ళ ఇండువిజ్యువాలిటీ గుర్తించి మనం తగ్గుతుండాలి''

ఆ సరికే స్వప్నకు చెప్పి, బైటికి జారుకున్నాడు బాలూ. అతను గేటుదాటుతుండటం

చూసి మరింత ఉక్రోషంగా అన్నాడు జీవన్—

"ఇండువిజ్యువాలిటీ కాదు, పొగరు. వాడు నన్ను పట్టుకుని ఫూల్ అన్నాడు- తెలుసా?"

ఆశ్చర్యపడుతూ అంది గౌతమి—

"బాలూ అంతమాటన్నాడంటే నేన్నమ్మను"

"అయితే నేనబద్ధం చెబుతున్నానంటావా? ఫూలిష్‌గా మాట్లాడకు- అన్నాడు. ఏమిటి దానర్థం?"

"దానికీ దేనికీ చాలా తేడావుంది. నువ్వు కోపంతో ఆలోచిస్తున్నావు గనుక అర్థంకావటంలేదు. అనలింతకూ ఏమయింది?" అడిగింది.

"వాడి గోలకు ఇప్పుడు టైంలేదులే తరవాత చెబుతాను. మూడురోజులైంది సప్నీని చూడక. ఎలావుంది దానికి" లోపలికి నడిచాడు.

తండ్రి మాటలన్నీ వినిపిస్తున్న స్వప్న అనుకుంది – ఈ విషయమేమిటో అన్నయ్యరాగానే అడగాలి – అని. అంతలోనే సిల్వియా అన్నదని బాలూ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. ఆనందం గుర్తుకొచ్చింది. తనకు ఇంత జ్వరం వున్న సంగతి ప్రత్యక్షంగా చూసికూడా, మళ్ళీ మూడురోజులదాకా తండ్రి కనిపించలేదనే ఆలోచన భూతంలాగా మనసును పట్టుకుంది. ఆ పెళ్ళానికి ఆ మాత్రం నర్దిచెప్పుకోలేనివాడు మమ్మీని ఎందుకు పెళ్ళిచేసుకున్నాడు. ఇదే పద్మకైతే లీవుకూడాపెట్టి పక్కన కూర్చునేవాడేమో. పద్మ కన్నకూతురు, తను మాత్రం కాదా? అవును, తనకు డాడీ ఎవరు? డాడీయేనా లేక ..... తలపగిలిపోతున్నట్లనిపించి మంచంలో వాలి కళ్ళు మూసుకుంది స్వప్న. తండ్రికి దూరంగా తన అనుమానకోశంలోకెళ్ళిపోయింది.

"ఇప్పటివరకూ కూర్చుని మాట్లాడింది. నిద్రపోలేదనుకుంటాను" అంది గౌతమి, కళ్ళుమూసుకుని పడుకున్న స్వప్నని చూస్తూ.

"జ్వరంతగ్గకుండా ఎందుకు కబుర్లు చెప్పుకోవడం? మళ్ళీ ఎక్కువైతే?" చిరాగ్గా అంటూ స్వప్న పక్కన కూర్చుని నుదుటి మీద చెయ్యివేసి చూస్తూ, గౌతమిని వివరాలు అడగసాగాడు జీవన్ వాచీకేసి చూసుకుంటూ.

★ ★ ★

"రోనీ, ట్రంకాల్ ఫ్రం వరంగల్" గట్టిగా పిలిచాడు ... ఫోను దగ్గరకు నడిచాడు రోనీ.

రేవతి అబార్షన్ తరవాత నాలుగురోజులకే మళ్ళీ వరంగల్ వెళ్ళాడు రోనీ. అయితే కృష్ణకుమార్, రేవతీ వెళ్ళిపోయారు. అంతకు ముందుకూడా చాలాసార్లు అలాగే జరిగింది కానీ ఈసారి రేవతి కలవకపోవటంతో బాధనిపించిందతనికి. ఆమెకు తను మంచి స్నేహితుడిగా మారినట్టు ఆమె భావిస్తున్నందున, ఆమెకు మాట్లాడుకునేందుకు ఆమాత్రం కూడా అవకాశం లేకపోవటం మరీ బాధనిపించింది. ఆమె ఏం ఆలోచిస్తుందో, కృష్ణకుమార్ ప్రవర్తన ఎలావుందో తనకు తెలియదు. ఉత్తరాలు మంచిదికాదు, అనవసరమైన అపార్థాలొచ్చే అవకాశం వుందని ఆ ప్రస్తావనే రేవతి దగ్గర ఎత్తలేదు. కానీ, రోనీ మనసులో ఆమె కోసం ఏర్పడిన ఒక సాఫ్ట్ కార్నర్ అతన్ని స్థిమిత పడనీయలేదు. దాంతో బాగా ఆలోచించి, మరోసారి వాళ్ళుగానీ వరంగల్‌కు వస్తే తాను కలుసుకునే మార్గం ఒకటి వుంటే బాగుండుననుకున్నాడు. కోటేశ్వరయ్యతో ఉపాయంగా మాట్లాడాడు.

"మా అంకుల్‌తో నాకు పర్సనల్ పని ఒకటి పడిందండీ. మొన్న చెబుదామనుకుని మరిచిపోయాను"

"వాళ్ళ ఊరు చాలాచిన్నది. మీరు వెళ్ళారంటే అడ్రస్ తెలియకపోవడమంటూ వుండదు. అయినా, ఆఫీస్‌కు కూడా వెళ్ళొచ్చు కదా?" మార్గం చెప్పాడు కోటేశ్వరయ్య.

"అలాకాదు. ఇన్నేళ్ళలో ఎప్పుడూ నేను అంకుల్ దగ్గరికి వెళ్ళలేదు. నావనికోసం యిప్పుడు వెళితే బాగుండదనిపిస్తూంది" మొహమాట పడుతున్నట్లుగా అన్నాడు.

"మొహమాటం ఎందుకండీ. ఎంతైనా మీ అంకులే కదా" తేలిగ్గా అన్నాడు కోటేశ్వరయ్య.

"అదికాదండీ. మీరు హెల్ప్ చేస్తానంటే ఒక ఉపాయం వుంది"

"చెప్పండి. ఏం చెయ్యను?"

"ఏంలేదు, ఈసారి అంకుల్ రాగానే మీరు కాస్త నాకు ట్రంకాల్ చేసి చెప్పండి అంకుల్‌కు తెలియకుండా. నేను మామూలుగా వచ్చినట్టు

వచ్చేస్తాను''

"మరీ యింత మొహమాటమైతే ఎలా గండీ. సరే... ట్రంకాల్‌దేముంది చేస్తాను'' నవ్వుతూ అన్నాడు కోటేశ్వరయ్య.

తన గదీ పక్కనున్న బేకరీ ఫోన్ నెంబరూ, టైప్ ఇన్‌స్టిట్యూట్ ఫోన్ నంబరూ రెండూ యిచ్చి ఏ టైంలో ఎక్కడికి చేయాలో వివరించి, పీ.పీ. కాల్ చేయమని సూచించి, ముందుగా వద్దని ఆయన వారించినా వినకుండా ట్రంకాల్ ఛార్జీగా పాతిక రూపాయలుకూడా యిచ్చి వచ్చేశాడు.

"హలో, రోనీ స్పీకింగ్''– ఫోన్ తీసుకుని అన్నాడు.

"నేను, కోటేశ్వరయ్యను. మంత్రిగారొచ్చేశారు''

ఎవరికీ తెలియకుండా అలా అన్నాడని గ్రహించాడు. రోనీ –

"అదేమిటి? మా అంకుల్‌ను మంత్రిని చేశారు?'' నవ్వుతూ అన్నాడు.

"మరి పనులు చేసి పెట్టగలవాణ్ణి మంత్రి అనకపోతే ఎలాగండీ బాబూ'' నవ్వుతూ అన్నాడాయన.

అంతలో అనుమానం వచ్చింది, ఒక్కడే గానీ వచ్చాడా అని. వెంటనే అడిగేశాడు – "ఒక్కడే వచ్చాడా?''

"ఫామిలీతో వచ్చాడు. నాలుగురోజులుంటానన్నాడు. ఆవిడ మీకేం అడ్డం? బైట ఏ హొటల్లోనో కూర్చొని మాట్లాడుకోవచ్చు''

కోటేశ్వరయ్య అరకంగా అర్థం చేసుకున్నందుకు సంతోషించాడు రోనీ.

"థాంక్సండీ. మీకు ఇబ్బంది కలిగించాను''

"ఇబ్బందేమిటండీ బాబూ... ఇది నా బిజినెస్. మీరు సాయంత్రం వస్తారు కదా. నాకో రూమ్ ఎంగేజవుతుంది'' నవ్వుతూ అన్నాడాయన.

'ఫిఫ్టీన్ రూం వుందికదా?''

"వుంది. అట్టే పెట్టేస్తాను. ఫోన్ పెట్టేయనా మరి?''

"పెట్టేయండి సార్. టైం ఈజ్ ఓవర్'' ఆపరేటర్ గొంతు వినిపించింది. ఫోన్ పెట్టేసి వోనర్‌వైపు తిరిగాడు రోనీ –

"ఈ సెట్ పూర్తి చేసి పోతాను. అర్జెంటుగా వరంగల్‌కు వెళ్ళాలి భయ్యా''

"వరంగల్‌కూ నీకూ ఏంది బై రిష్తా'', కుతూహలంగా అడిగాడు ఇన్‌స్టిట్యూట్ వోనర్.

"వరంగల్ మేరీ మా హై, హైద్రాబాద్ నజ్‌నీ హై, నమ్‌భీ హైద్రాబాదీ'' చివరక్షరం కావాలనే వత్తి పలుకుతూ అన్నాడు రోనీ.

"నజ్‌నీకీ షాదీ జేస్కొని ఖుషీకరో. ఇన్‌స్ట్రక్టర్‌గ జెయ్యి మెన్ అంటే జెర ఫికర్ జెయ్యి. రోజు జాబ్‌వర్కుల సాత్ పైసే యిన్త దోసా తన్‌ఖా వొస్తది'' అనునయంగా అన్నాడాయన.

"నాకు వద్దుమెన్. రెండుగంటల్లో ముప్ఫయి రూపాయలు, అంటేనాకు పదిహేను వచ్చాయి గదా. ఈ లెక్కన నెలకో నాలుగైదు వందలుచాలు. ఇన్‌స్ట్రక్టర్‌గా చేరితే నువ్వు జాబ్‌వర్కెక్కడ చేసుకోనిస్తావ్. నువ్విచ్చే దోసా కోసం పొద్దుట్నుంచి సాయంత్రందాకా యిక్కడే కూచోమంటావ్. ఎలక్ట్రానిక్ టైప్‌రైటర్ కొంటున్నా త్వరలో. నీ అరుగుమీదే పెట్టి తమాషా చూపిస్తాను'' చిలిపిగా అన్నాడు బాలూ.

"అరే... నా అరుగుమీదెందుకు. నీకు టేబులిస్తా, పెట్టుకో. నాకు పదిపైసలియ్యి కిరాయి. కరెంటు తీస్కో''

"పదిపైసలు, అంటే టెన్‌పర్సెంట్. సరే- ఆలోచిద్దాంగానీ, ఆ అఫిడవిట్ ఇంకోపేజీ వుంది. అదిచేసి, రూంకెళ్ళి గోల్కొండ పట్టుకోవాలి. తర్వాత ఆలోచిద్దాం మెన్'' అంటూ పనిలోపడ్డాడు రోనీ.



ఆ రోజు ఏదో పండుగ రోజు. ఆనందం, శివలక్ష్మి యిద్దరూ పనిమనిషికి సెలవిచ్చేసి,

స్వయంగా పండుగ స్పెషల్స్ పండటానికి సమకట్టారు. సినిమారంగం వాళ్ళకు సహజంగా ముహూర్తాలు పండుగరోజుల్లో పెట్టుకోవటమంటే చాలాయిష్టం. అంచేత మయూరి పొద్దున్నే షూటింగ్‌కోసం వెళ్ళింది.

కీర్తిఅనే ఒక డైరెక్టర్ కొత్తవాళ్ళతో సినిమాలు తీసి, వాటిని విజయవంతం చేస్తుంటాడు. ఆయన సినిమాల్లో పాత వాసనలుండవు. అయినా ఆయన తీసిన సినిమాల్లో ఏ ఒకటో రెండో తప్ప అన్నీ విజయవంతమయ్యాయి. ఆ విధంగా నిర్మాతలకు కనకవర్షం కురిపిస్తుందనేమాట అటుంచి, ఆ కొత్త నటీనటులకు కూడా మంచి అవకాశాలొస్తుంటాయి. సుమారు ఒక డజనుమంది నటులు ఆయన సినిమాలద్వారా పరిచయమై, వివిధ పాత్రలు పోషించటంతో ప్రముఖులుగా స్థిరపడిపోయారు. కీర్తి మొదలుపెట్టిన కొత్త సినిమాలో యిద్దరు హీరోయిన్లు అవసరమని ఆయన కొత్తవాళ్ళ కోసం ఆరు నెలలుగా వేటమొదలుపెట్టగా ఒకమ్మాయి, సినిమారంగంతో అసలు సంబంధంలేనమ్మాయి దొరికింది. మరో అమ్మాయికోసం ఎంతోమందిని చూసి పెదవి విరచిన కీర్తికి, ఒకరోజు అనుకోకుండా స్టూడియోలో మయూరి ఎదురయింది. తన అసిస్టెంట్ ద్వారా ఆమెని పిలిపించి మాట్లాడాడు.

కీర్తి గురించి వినివుండటాన ఆయనతో చాలా జాగ్రత్తగా మాట్లాడింది మయూరి. అయితే అనుకోకుండా తను ఓ సినిమాలో హీరో గోపాల్‌కు చెల్లెలిగా నటిస్తున్న విషయం చెప్పటంతో ఆయన ఆలోచనలోపడ్డాడు. సాధారణంగా ప్రేక్షకులకు పరిచయమున్న ముఖాల్ని ముఖ్యపాత్రల్లోకి తీసుకోవటం కీర్తికి ఇష్టముండదు. ఐతే ఈ ఒక్క సినిమాలోతప్ప ఇతర సినిమాలన్నిటిలోనూ ఎక్స్‌ట్రాగా మాత్రమే నటించాననీ, మరోసినిమాలో హీరోయిన్ సరళ స్నేహితురాలిగా నటించినప్పటికీ అందులో తన పాత్ర చాలా చిన్నదనీ వివరించింది మయూరి. ఒకపాత్ర ఎలావుండాలో తను ఊహించుకున్న రూపురేఖల్ని అనుసరించి పూర్తిగా మేకప్‌చేయించి, దుస్తులు కూడా తొడిగించి, ఫొటోలుతీసిగానీ సంతృప్తి చెందడు కీర్తి. పైగా హీరో గోపాల్‌సినిమా అంటే షూటింగ్ పూర్తవటానికి మూడునెలలైనా పడుతుంది. ఇది కొత్త నిర్మాతది. అవన్నీ దృష్టిలోపెట్టుకుని, మేకప్‌టెస్టు చేసిన తర్వాత ఆలోచించి చెబుతానని చెప్పాడు కీర్తి. ఆయన ఎంత చిన్న వేషం యిచ్చినా అది తన అదృష్టమే అని భావించింది మయూరి. పైగా ఏ పాత్రకోసం తనను దృష్టిలోపెట్టుకున్నాడో ఆమెకు తెలియదు.

ఇదంతా జరిగిన మూడురోజులకు ప్రొడక్షన్ మేనేజర్ వచ్చి, సాయంత్రం ప్రొడక్షనాఫీసుకు రమ్మనీ, వీలుంటే ఆ రోజే మేకప్‌టెస్ట్ చేయిస్తారనీ చెప్పటంతో, ఎప్పట్లా వెళ్ళింది మయూరి. సాయంత్రం ఏడున్నరవుతుండగా ఆఫీసులోకి అడుగుపెట్టింది. కీర్తి తన అసోసియేట్‌తో ఏదో చర్చిస్తున్నాడని విని ముందుగదిలో కూర్చుంది మయూరి. కాస్సేపటికి కీర్తి ఒక్కడే ఎందుకో హడావిడిగా ముందుగదిలోకొచ్చాడు. అతన్ని చూడగానే మర్యాదగా లేచినిలబడింది మయూరి. ఆ అలికిడికి తలతిప్పి మయూరిని చూశాడు కీర్తి. నమస్కార ప్రతినమస్కారాలైన తర్వాత ఆయనడిగాడు—

"ఎవరికోసమైనా ఎదురుచూస్తున్నారా?"

"మేకప్ టెస్ట్ వుందని రంగనాథంగారు రమ్మన్నారు" పైకి మర్యాదగానే బదులిచ్చింది- మళ్ళీ ఈ నటనలన్నీ చేయటం మాత్రం మానరు వెధవలు-అని లోలోపల అనుకుంటూ..

"మేకప్‌మన్ పొద్దున వస్తానంటే నేనే రేపు రమ్మన్నాను. కాన్సిలైన విషయం నీకు చెప్పలేదా ?" ఆశ్చర్యంగా అన్నాడాయన.

"మీరు పర్సనల్‌గా ఏమైనా మాట్లాడతారనేమో, రంగనాథంగారు నన్ను యీ టైంలోనే రమ్మన్నారు. ఫర్వాలేదు... నాకు తొందర పనులేమీ లేవు" అంది మయూరి. అంతకన్నా ఎలా చెప్పాలో అర్థంకాలేదు.

మయూరిది తిరుగుబోతు మనస్తత్వం కాదు. హైదరాబాద్ కొచ్చిన తరవాత, సినిమాల్లో ఎక్స్‌ట్రా వేషాలిప్పిస్తాననీ, చిన్న పాత్రలు అవకాశాలొచ్చినప్పుడు సజెస్ట్ చేస్తాననీ చెప్పి, హరి అనే అసిస్టెంట్ డైరెక్టర్ మొదటిసారిగా ఆమె కన్నెతనం దోచుకున్నాడు. ఆ తరవాత అయిదారుసార్లు హరికి లొంగిపోక తప్పలేదు. రెండోసారి హీరోయిన్ సరళ స్నేహితురాలి పాత్రలో

ఆమెను సజెస్ట్ చేయటానికి ఆ సినిమా అసోసియేట్ డైరెక్టరూ, హీరో గోపాల్ చెల్లెలిగా పాత్రకోసం ఆ సినిమా ఫైనాన్షియరూ, ఆ పాత్రలో అగ్రిమెంట్ మీద సంతకం చేసినరో జున డైరెక్టరూ, తొలిరోజు షూటింగ్ మరునాడు హీరో గోపాల్ ఆమెను రప్పించుకున్నారు. మరో సినిమాలో ఒక ముఖ్యపాత్ర యిప్పిస్తానని ఒక ప్రొడక్షన్ మేనేజర్ నమ్మించి, రెండు మూడురో జులు వబ్బంగడుపుకున్న తరవాత మొండి చెయ్యి చూపించాడు.

సినిమాలోకొచ్చే అమ్మాయిలమీద వుండే అభిప్రాయంకొద్దీ, వాళ్ళకు తను కొత్తగా చేసే అన్యాయం ఏమీ వుండదనే సమర్థనతోనూ చిన్న చిన్న వేషాలేసే అమ్మాయిలతో స్నేహాంచేసినప్పటికీ, అసిస్టెంట్ డైరెక్టర్ హరికి మంచి తెలివితేటలున్నాయి. అంతేగాక కొద్దోగొప్పో నిజాయితీ కూడా వుంది. అతను అసోసియే



ట్గా మారితే, అతిత్వరలో మంచి డైరక్టరు కాగలడని అతనితో పరిచయమున్నవాళ్ళంతా అనుకుంటుంటారు కూడా. అతను మయూరిలో వున్న ప్రతిభను గుర్తించాడు. తనచేతనైన సహాయంచేయాలని కూడా అనుకున్నాడు. అందుకే ఆమెతో అనుభవం పంచుకున్న తర వాత తనకు వీలైనంత సహాయమూ చేశాడు. అంతకన్నా ముఖ్యంగా మయూరికి అతను ఒక మంచి సలహా కూడా ఇచ్చాడు. అదే శారీరక సంబంధాల గురించి. ఎవరితో ఎలా



వుండాలి, ఎలా ప్రవర్తించాలి - అనే విషయాల తోపాటు డబ్బు సంపాదనకు కొందరు నటీమ ణుల లాగా వ్యభిచారం చేయవద్దని హెచ్చ రించాడు. ఎటూ మయూరి అందుకు సిద్ధపడి లేదు. తన లక్ష్యం సాధించటం కోసం తప్పితే విచ్చలవిడిగా ప్రవర్తించే స్వభావం కూడా మయూరిలో లేదు. దాంతోపాటు ఒక మంచి పాత్ర యిప్పిస్తానని ఒక ప్రొడక్షన్ మేనేజర్ చవిచూసిన చేదు అనుభవం కూడా ఎదురుకా వటంతో ఎవర్ని ఎలా నమ్మాలి అనే విషయాల ను, హరి చెప్పిన విషయాలనూ మేళవించు

భిన్నంగా వ్యవహరించటం నేర్చుకుంది. అందుకే మామూలుగా చూస్తే మయూరి అందరికీ అందమైన, తెలివైన అమ్మాయిగా, సంస్కారవంతురాలిగానే కనిపిస్తుంది.

మేకప్ టెస్ట్ పేరిట యిలాంటి అనుభవాలు ఎదుర్కోవలసి వచ్చినప్పుడు మనసును ఎంత మభ్యపెట్టుకున్నా అంతరాత్మను అదుపుచేసుకున్నా పిచ్చల విడిగా అసభ్యంగా మాత్రం ప్రవర్తించదు. తప్పనిసరి తద్దినంలాగా సరిపెట్టుకుంటుంది. అందుకే కీర్తి అలా మాట్లాడేసరికి వెకిలిగా సమాధానం చెప్పలేకపోయింది. ఏమనటానికీ పాలుపోలేదు. సూటిగా చెప్పటానికి సంస్కారం అడ్డువచ్చి, వీలైనంత గుట్టుగా ప్రొడక్షన్ మేనేజర్‌ను కీర్తి కబురు పంపించినదెందుకో తనకు అర్థంకానట్టుగా అలా జవాబిచ్చింది.

"తొందరపనులేమీ లేకపోయినా, ఇప్పుడు టైంఎంతయిందో చూసుకున్నారా ?" గడియారం వంక చూస్తూ అన్నాడు కీర్తి.

ఇక తప్పని సరిగా మళ్ళీ జవాబిచ్చింది -

"మీరు రమ్మన్నదే ఈ సమయంలో అయితే, వెళ్ళే టైం ఎంతవుతుందోనని ఆలోచిస్తూ కూర్చుంటే ఎలా సార్ ?"

అప్పుడర్థమయింది కీర్తికి. వెంటనే మొహం ఎర్రబారింది.

"ముందొక నిర్ణయం తీసుకుని, తరవాత మేకప్ టెస్ట్ చేయించేస్తే మీకు డిసప్పాయింట్‌మెంట్ వుండదని, యివాళ మీ విషయమే నా అసోసియేట్‌తో డిస్కస్ చేశాను. మిమ్మల్ని తీసుకోవచ్చునని అనుకుంటున్నాను. కానీ యిలా డైరెక్టర్‌ను బుట్టలో వేసుకోవాలనుకునేవాళ్ళు నా టీమ్‌లో పనికిరారు. నేను మరొకర్ని వెతుక్కుంటాను... ప్లీజ్ గెటవుట్" ఎంత నింపాదిగా చెప్పినా, అతని గొంతులో కరుకుదనం, అసహ్యం ప్రస్ఫుటంగా ధ్వనించాయి.

తనంత తానుగా వచ్చానని అతను అర్థంచేసుకున్నాడని మనసులోకి యింకగానే, తన గురించి అతనెంత నీచంగా ఆలోచించి వుంటాడోనని స్ఫురించగానే, అతని మాటల్లోని అసహ్యం స్పష్టంగా వ్యక్తమవగానే సిగ్గుతో చచ్చిపోవాలనిపించింది మయూరికి. ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా కళ్ళల్లోంచి నీళ్ళు జలజలారాలాయి. ఒక పరాయిమగవాడి ముందు తన స్వభావం యిలా దిగజారిపోయిందన్న ఆలోచనరాగానే, ఆమె అంతరాంతరాల్లో వున్న సిగ్గు, లజ్జ, సంస్కారం మనసును అల్లకల్లోలం చేయటంతో తలగిర్రున తిరుగుతున్నట్లనిపించింది. కాళ్ళు శక్తిని కోల్పోయి పట్టుసడలుతుండగా నిస్సత్తువగా సోఫాలో కూలబడి, ముఖం అరచేతుల్లో దాచుకుని భోరున విలపించింది.

ఆమె ఎందుకేడుస్తోందో అర్థంకాని కీర్తి అయోమయంలోపడ్డాడు. క్షణంలో వస్తానని బైటికొచ్చి, అతను అంతసేపు ఏం చేస్తున్నాడోననుకుని, అతని అసోసియేట్ డైరెక్టర్ తంగన్ బైటికొచ్చాడు. డోర్‌తీసి సిగరెట్ వెలిగించుకుని, బాత్‌రూం వైపు తిరిగి-

"కీర్తీ" అని పిలుస్తూ యిటువైపు తిరిగాడు.

సోఫాలో ఎవరో అమ్మాయి ఏడుస్తూ కూర్చుంది. ఆమె పక్కగా నిలబడి, కీర్తి కంగారుగా అడుగుతున్నాడు -

"వాట్ హాపెండ్ ? ఏమయింది ?"

తంగన్‌కు ఏమీ అర్థంకాలేదు. కీర్తి అసిస్టెంట్‌గా చేరినప్పట్నించీ తంగన్ అసోసియేట్‌గానే వున్నాడు. డైరెక్టర్‌గా మారి, సినిమాలు ఫెయిలైతే తెరమరుగు కావడంకన్నా యిలా స్థిరంగా వుండటమే మంచిదనుకుని అతను ముందుకు పోయే ప్రయత్నంచేయలేదు. తంగన్‌కు కీర్తి స్వభావం బాగా తెలుసు. అందుకే ఈ దృశ్యం చూసి, ఆ అమ్మాయి ఎందుకు ఏడుస్తోందో తెలియక మరింత తికమక పడ్డాడు. రెండు అంగల్లో కీర్తి దగ్గరకొచ్చాడు.

"యారింద పొన్ను? ఎన్నాచ్చి?" అనుకోకుండా మాట్లాడాల్సి రావటంతో అప్రయత్నంగా మాతృభాష వచ్చేసింది.

కొంచెం ఓపిక పట్టమన్నట్టుగా సైగచేసి చూపించాడు కీర్తి. మూడోమనిషి ఉనికి కనిపించటంతో కళ్ళు తుడుచుకొని, రోషంగా అరచేతి వెనుక వైపుతో ముక్కు తుడుచుకుంటూ చప్పున లేచి నిలబడింది మయూరి.

"సర్ ... నా గురించి మీరేమనుకున్నారో గానీ, కనిపించినవాళ్ళతోనల్లా తిరిగే కారెక్టర్

లెస్ మాత్రం కాదునేను. మీరు నమ్మినా, నమ్మకపోయినా ప్రొడక్షన్ మేనేజర్‌గారు ఈ సమయంలో మీరు రమ్మన్నారని చెబితే, హీరోయిన్ అవుదామన్న ఆశకొద్దీ ఫీల్డులో కొచ్చాను గనుక తప్పనిసరిగా వచ్చాను. అంతే- ఈ సినిమారంగానికున్న అలవాటేకదా, కొందరు శారీరకంగా హింసిస్తారు అమ్మాయిల్ని. మీరు ఇలా చూపించుకున్నారది- వస్తానండీ'' అంటూ సోఫాలో వున్న హ్యాండ్ బ్యాగ్ అందుకుంది.

ఇలా మలుపు తిరిగి, నింద తనమీదికే రావటంతో బిత్తరపోయాడు కీర్తి. అంటే, లోపల తంగన్ వుండటాన, తను యిలా ప్రవర్తించాడనీ, తను కబురు పంపిన మాట మాత్రం నిజమేననీ ఆ అమ్మాయి అనుకుంటూందన్న మాట. ఈ ఆలోచన రాగానే కీర్తి మనసు కంగారుగా మారింది.

జరిగిందేమిటో అర్థం కాకున్నా విషయం ఏమిటో సరిగ్గా తెలుసుకోవాలని, అరక్షణంలో తేరుకుని నిర్ణయించుకున్నాడు తంగన్. మయూరి వైపు ఒక్క అంగలో కదిలి, గబగబా చెప్పాడు—

"ప్లీజ్ ... ఐదునిమిషాలు మీరు కూర్చోండి. వాదించొద్దు. దయచేసి కూర్చోండి. అసలు జరిగిందేమిటో ముందుగా నేను తెలుసుకోవాలి'' అనేసి, కీర్తి జబ్బ పట్టుకుని లోపలికి తీసుకుపోయాడు.

జరిగింది వినగానే తంగన్‌కు విషయం అర్థమైపోయింది—

"నీకు రంగనాథంతో పరిచయంలేదు కనుక తెలియదు. వాడే చెప్పి వుంటాడు''

"మధ్యలో వాడికెందుకీ దురద?'' ఆశ్చర్యపోయాడు కీర్తి.

"ఏముంది ... ఈరకంగా ఆ అమ్మాయి నీదగ్గరికొస్తే, తనే వేషం యిప్పించానని చెప్పుకుని, డబ్బు గుంజడంలాంటి పనులు చేస్తాడు. ఇలాంటి పెద్ద ప్రొడక్షన్స్‌లోని వాళ్ళల్లో రంగనాథంలాంటి వాళ్ళు కోకొల్లలు''

"ఐతే యిప్పుడేం చేద్దాం ... పాపం ఆ అమ్మాయిని ఇన్‌సల్ట్ చేశానే'' బాధగా అన్నాడు కీర్తి.

"ఒక్కక్షణం ఆగు ... నేను తేల్చేస్తాను'' అన్నాడు తంగన్ ఫోన్ డయల్ చేయటానికి ఉపక్రమిస్తూ.

"ఫోనెవరికి?'' ఆశ్చర్యంగా అడిగాడు కీర్తి.

టేబుల్ మీదున్న డైరీలో నెంబర్ చూసుకుంటూ, నంబర్ కలవగానే "మీ పక్కింట్లో హరిగారని వుంటారు, సినిమా ఫీల్డాయన. ప్లీజ్- కొంచెం పిలుస్తారా?'' అనేసి, రిసీవర్ పట్టుకుని వివరించాడు—

"ఈ అమ్మాయికీ, హరికీ మంచి టరమ్స్ వున్నాయి. అంతే, ఈమెని చాలా మందికి సజెస్ట్ చేసింది అతనే. అతన్నడిగితే తేలిపోతుంది''

తను అనుకున్న పాత్రకు సరిగ్గా సరిపోతుందనుకుని మయూరి గురించి చాలా ఇంట్రెస్టు తీసుకున్నాడు కీర్తి. ఆమె సరళతో నటించిన సినిమా నిర్మాతని రిక్వెస్ట్ చేసి రషెస్ చూశాడు. క్లోజప్‌లు ఎక్కడా లేవు. హీరో గోపాల్ చెల్లెలిగా మయూరి నటిస్తున్న సినిమాలో కూడా ఆమెది చిన్న పాత్రే అయినా హీరో చెల్లెలు గనుక తప్పనిసరిగా క్లోజప్స్ వుంటాయి. అయితే, ఆ సినిమాకు హీరో గోపాల్ తరవాతి కాల్‌షీట్స్ నాలుగు నెలలకున్నాయని తెలుసుకున్నాడు. అంటే యింకో ఆరునెలల వరకూ ఆ సినిమా రిలీజవదు. కీర్తి సినిమాలెప్పుడూ షూటింగ్ మొదలైన తరవాత రెండునెలల్లో విడుదలవుతాయి. అంటే మయూరిని కొత్తమ్మాయిగానే ప్రేక్షకులు రిసీవ్ చేసుకుంటారు. ఇవన్నీ అప్పుడే చర్చించుకున్నారు యిద్దరూ. ఇంతలోనే యిలా జరిగింది.

హరి లైన్‌లో కొచ్చాడు.

"హల్లో హరీ ... అయామ్ తంగన్- గుర్తువట్టావా?''

"...................''

"ఏంలేదు ... కీర్తి నెక్స్ట్ పిక్చర్‌లో కొత్తమ్మాయిలకోసం చూస్తున్నాము. మయూరి అనే అమ్మాయి గురించి కీర్తికి ఇంట్రెస్ట్ వుంది. నీకు బాగా తెలుసటగా?''

"..............''

"ఒకే ఒకే ... సంగతేమీలేదు, అమ్మాయి చాలా అందంగా వుంటుందటకదా?'' వెకిలిగా నవ్వుతూ అన్నాడు తంగన్.

అమాట వినగానే వారి వేగంగా ఆలోచించా డు. కీర్తి గురించి అతనికి తెలుసు. ఇలాంటివ న్నీ సహించడు. తంగన్ ప్రత్యేకంగా యిలా అడుగుతున్నాడంటే నెగెటివ్‌గా జవాబు చెప్పి, మయూరికి వచ్చే అవకాశం పోగొట్టడమూ బాగుండదు. ఇలా చర్చించుకుని, జాగ్రత్తగా జవాబు చెప్పాడు హరి—

"మయూరి అదో టైప్ సార్. పెద్ద హీరోయి న్నన్నట్టు బిహేవ్ చేస్తుంది. నాకు తెలుసు, ముగ్గులోకి లాగడం కష్టమే. మీరిచ్చే పాత్ర ముఖ్యమైనదైతే, ట్రై చేస్తే, మరి చెప్పలేం"

"నీ ఫ్రెండటగదా?"

"అంతవరకే ... అంతకుమించి మీరనుకు న్నట్టు ఏమీలేదు. చెప్పానుగదా సార్ కొంచెం బింకంగా వుంటుంది"

"సరే ... ఆ విషయం నేను చూసుకుంటా ను- థాంక్స్" ఫోన్ పెట్టేశాడు తంగన్.

విషయమంతా విన్నాక కీర్తి బాధ పడ్డా డు—

"ఆ అమ్మాయికి నేను క్షమాపణ చెప్పుకో వాలి పద పిలిచి మాట్లాడుదాం"

"మరీ ఓవర్‌గా చేయకు. క్షమాపణ చెప్పా ల్సిన అవసరం లేదు. నువ్వు డైరెక్టర్‌వి. నీ డిగ్నిటీ కూడా కాపాడుకో" అన్నాడు తంగన్.

"నేను డైరెక్టర్‌ని, ఆమెకి నా సినిమాలో ఛాన్సిస్తాను. కానీ నేనొక మనిషిని. ఆమెకూడా అంతే. లెట్ మీ బిహేవ్ లైకే జంటిల్మన్, బికాస్ అయామే జంటిల్మన్" సీరియస్‌గా అన్నాడు కీర్తి కుర్చీలోనుండి లేచి.

ఇద్దరూ హాల్లోకొచ్చారు. అక్కడ మయూరి లేదు.

మరునాడు పొద్దున్నే ఎనిమిదింటికల్లా మయూరి ఇంటిముందు కార్లోంచిదిగాడు తంగన్. బెట్టుచేయకుండా అతనితో వెళ్లింది మయూరి. టెస్ట్ అయిపోగానే, మధ్యాహ్నం మూడుకల్లా అగ్రిమెంట్ మీద సంతకంచేసి, అడ్వాన్స్‌గా వెయ్యి రూపాయిలు తీసుకుంది మయూరి. ఆ సినిమాకి తన ప్రొడక్షన్ మేనే జర్ రంగనాథంను తొలగించక తప్పలేదు నిర్మాతకు.

"సర్... సినిమాఫీల్డులోనూ, బైటి ప్ర పంచంలోనూ అందరూ మీలాంటి మగవాళ్లే వుంటే ఆడవాళ్లు ఒంటరిగా బతకటానికి భయపడే అవసరమే వుండేదికాదు. మీ సిని మాలో హీరోయిన్ ఛాన్స్ రావటంకంటే గొప్ప సంతోషం వుండదని అనుకున్నాను ఇన్నిరోజు లు. కానీ మీలాంటి స్వభావంగల డైరెక్టర్ వున్నారని తెలిసి అంతకన్నా ఎక్కువ సంతో షంగా వుంది సార్" కృతజ్ఞతగా చెప్పింది మయూరి తిరిగివస్తూ.

ఆరోజు కీర్తి సినిమా ముహూర్తం. మయూరి కి ఆరోజు సీన్ లేకపోయినా ముహూర్తంగనుక వెళ్లింది. పన్నెండుకల్లా తిరిగొచ్చేసి, స్నేహితు రాళ్లతో అక్కడి కబుర్లు చెబుతూ కూర్చుంది.

"ఈ పండుగలు ఎవడు పెట్టిచచ్చాడో కానీ, మధ్యాహ్నం వరకూ పండుకుని చావటంతోనే సరిపోతోంది" మూడోసారి టీ తాగుతూ విసు క్కుంది శివలక్ష్మి.

"టీ, కాఫీలు తాగితే తప్పులేదు కానీ ఏమైనా తింటేనే తప్పని ఏ వేదంలో రాశారో. అసలు అప్పుడు ఈ టీ, కాఫీలు వున్నాయా అని" అంది మయూరి.

"ఇంకో గంటలో పూజ అయిపోతుంది. అంతవరకూ ఎవరైనా నోరు మెదిపితే చంపే స్తాను" కసిరింది ఆనందం.

"అంటే మూతి బిగించుకుని కూర్చో వాలా?" మయూరి దెబ్బలాడింది.

"మాట్లాడండి. కానీ యిలాంటివి మాత్రం మాట్లాడొద్దు" మినహాయింపు యిచ్చేసింది ఆనందం.

"మీ డాక్టర్‌గారు యిప్పటికి టిఫినూ, భోజనం కూడా లాగించేసి వుంటాడు. అదృష్ట వంతుడు" కొంటెగా అంది మయూరి.

గుర్తురాగానే ఆనందం మనసు బాధగా మూలిగింది. ఇద్దరూ కలిసుంటే పండుగరో జున ఎంత బాగుండేదో. ప్చ్... తనకూ ఆ అదృష్టం లేదు. పాపం, ఆయనక్కూడా పండుగ హడావిడీ ఏమీ వుండివుండదు, ఆ మహాతల్లి యివన్నీ చేస్తుందో చేయదో-అను కుంది నిట్టూరుస్తూ.

"కలిసుండి చస్తే యింతసేపూ వన్ను లుంచి చంపేది" నవ్వుతూ అంది శివలక్ష్మి.

"అవునే ఆనందం... పండుగరోజున

వస్తుంచుతావా మీ డాక్టర్‌గారిని?" అంది మయూరి.

"మూడుసార్లు టీ తాగారు. కాస్సేపైతే తింటారుకదా- వస్తులూ వస్తులూ అని ఏడుస్తా రేంటి?"

"అబ్బా... నేననేది యీ వస్తు గురించి కాదే. ఆ వస్తుంచుతావా అని" కన్నుగీటుతూ నవ్వింది మయూరి.

"సిగ్గులేదే నీకు. పండుగరోజున దరిద్రపు మాటలు మాట్లాడకు. గారెలపిండిలో ఉప్పు కలుపుతున్నాను. డిస్టర్బ్‌చేస్తే తినలేరు మరి. కాస్సేపు నోరుముయ్యండి"

మయూరి, శివలక్ష్మి నవ్వుకున్నారు. ఆనందం దేవుళ్ల పటాలకు మాలలు కడు తుండగా మిగిలిన వంట పనిని పూర్తిచేశారిద్ద రూ. ఆనందం కనుమరుగవగానే చిన్న గారె ముక్క తుంపి నోట్లోవేసుకుంది మయూరి.

"పాపం తగులుతుందే. ఇలా తిని చావొ ద్దు" కోప్పడింది శివలక్ష్మి.

"మా అమ్మ దేవుడికి పెట్టినవన్నీ ముందుగా యిలా నేను తిన్న తరవాతే నైవే ద్యం పెట్టింది పాపం. నాకు మాత్రం పాపం తగల్లేదు"

ఇంతలో ఆనందం వస్తున్న అలికిడవడంతో శివలక్ష్మి హెచ్చరించింది-

"ఈ తుంపిన గారెని చూసిందంటే చంపే స్తుంది. ఆ గారె తీసుకుని ముందుగదిలోకి చావు తొందరగా"

చట్టుక్కున గారె తీసుకుని, ఆనందం చూ డకుండా వంటింట్లోంచి ముందుగదిలోకి నడి చింది మయూరి. గుమ్మం వైపు తలతిప్పి, వెనుకనుండి అలికిడవుతుందేమోనని అటో చెవ్వు పడేసి, నిశ్శబ్దంగా గారెముక్కని తింటూ లోలోపల నవ్వుకుంది.

గేటుముందు ఏదో స్కూటర్ ఆగగానే నోట్లో వున్న పదార్థాన్ని గుట్టుక్కున మింగి ఎవరా అని చూసింది. జీవన్ కనిపించగానే ఆశ్చర్యప డుతూనే లోపలికి రెండడుగులు వేసి-

"రండి... రండి" అంది ఆహ్వానిస్తూ.

గడపదాటి అక్కడే నిలుచుని గదిని పరీక్షి స్తున్నట్టుగా చూశాడు జీవన్.

"కూర్చోండి" అంది మర్యాదగా.

"లోపలెవరైనా వున్నారా?" నెమ్మదిగా అడి గాడు జీవన్.

"స్వప్నకోసం వచ్చారా మీరు? ఇవ్వాళిక్కడి కి రాలేదండీ"

"నేను స్వప్న కోసం రాలేదు. స్వప్నకోసం నువ్వెప్పుడూ మా యింటికి రావొద్దని చెప్పడాని కొచ్చాను"

"ఏమిటి మీరంటున్నది?" బిత్తరపోయి అడిగింది.

"స్వప్న మర్యాదస్తుల యింటిపిల్ల. మీ లాంటివాళ్లతో అది తిరగటం నాకిష్టంలేదు"

"మర్యాదగురించి లెక్చర్ యివ్వటానికి వచ్చివుంటే వెంటనే వెళ్లిపోండి. స్వప్న నాతో మాట్లాడకపోతే అది తన యిష్టం. మీరిలా మాట్లాడటం మాత్రం మర్యాదకాదు" తీవ్రంగా అంది.

"నేను మర్యాదగా చెబుతున్నాను. స్వప్న యిక్కడికి వచ్చినా రానివ్వద్దు. దాంతో స్నేహం మానుకోవాలి. నువు సినిమా యాక్టర్‌వైతే అవ్వొచ్చుగాక, నీకు పదిమంది మగాళ్ల అండ వుంటే వుండొచ్చుగాక... ఐ డోంట్ కేర్"

ఏవో మాటలు గట్టిగా వినిపించటంతో చేస్తు న్న పనులు వదిలేసి ఆనందం, శివలక్ష్మి పరుగున వచ్చారు.

"అనవసరంగా నోరుపారేసుకోవద్దు. స్వప్న తండ్రిగా మీకింకా గౌరవం యిస్తున్నాను... ప్లీజ్ గెటౌట్"

స్నేహితురాళ్ళిద్దరూ ఏం జరుగుతుందో తెలియక విస్తుపోయారు.

"నీ ఫ్రెండ్స్ కూడా వున్నారు కదా. వాళ్ళ ముందర చెబుతున్నాను. స్వప్నను యిక్కడికి రానివ్వద్దు. దాని స్నేహం వదులుకోకపోతే కా న్సిక్వెన్సెస్ నన్ను అడగొద్దు"

"ఏమిటండీ... ఏమైంది?" ఆదుర్దాగా అడి గింది ఆనందం.

"ఏమీ అవొద్దనే చెబుతున్నాను. మీలాంటి వాళ్ళతో మా స్వప్న స్నేహం చేస్తే దాని భవిష్య త్తు పాడైపోతుంది. స్వప్నను యిక్కడికి రానివ్వ మని చెబితే వెళ్లిపోతాను. అనవసరంగా గొడవ పడొద్దు" బెదిరించినట్టు అన్నాడు జీవన్.

"చూడండి... స్వప్న మీకూతురు. మీరు స్వప్నకు చెప్పుకుంటే బావుంటుంది. అంతే కానీ యిలా మాయింటికొచ్చి గొడవచేయటం మర్యాద కాదు" ప్రశాంతంగా చెప్పింది ఆనందం.

"అది వయసులో చిన్నది, దానికి అనుభవం లేదు. చెబితే అర్థంచేసుకోదు. మీలాంటి చెడిపోయినవాళ్ళతో తిరిగితే రేపు దానికి పెళ్ళవుతుందా?"

"మిస్టర్... నువు వెంటనే బైటికి నడుస్తావా, పదిమందినీ పిలిచి గెంటించాలా?" కోపంతో అరిచింది మయూరి.

"స్వప్న స్నేహం వదులుకుంటామని మీరు చెప్పకపోతే ఆ పదిమందినీ నేనే పిలిచి మీ బతుకులేంటో చెబుతాను. అప్పుడు తెలుస్తుంది, ఈ యింట్లోంచి మిమ్మల్ని ఎలా తరుముతారో"

"సరే... స్వప్నను రావద్దని చెబుతాం- మీరు వెళ్ళండిక" కంగారుగా అంది ఆనందం.

"నువ్వుండవే... ఈయనొచ్చి బెదిరిస్తే భయపడటానికి మనమేం తప్పు చేస్తున్నామని? మీ ఇద్దరికీ యిష్టంలేకపోయినా నరే... స్వప్న నాదగ్గరికొస్తే నేను రానిస్తాను. ఒక్క నిమిషంతండి. పోలీస్ స్టేషన్‌కు ఫోన్‌చేసివస్తాను" అంది మయూరి బైటికి నడవబోతూ.

"ఆగు మయూరీ, అనవసరంగా గొడవలొద్దు" అని, జీవన్ వైపు తిరిగి- "మీరు మర్యాదగా కూర్చుని మీకున్న ప్రాబ్లమేమిటో ప్రశాంతంగా చెప్పండి. పెద్దవారు, చదువుకున్నవారు- ఇలా ప్రవర్తించటం మంచిది కాదు" అంది ఆనందం.

"కూర్చుని డిస్కస్ చేయటానికేముందని, సరే... ఏంచెబుతారో చెప్పండి" అయిష్టంగా కూర్చున్నట్టుగా ఓ కుర్చీలో కూర్చున్నాడు జీవన్. మయూరి పోలీస్‌లనగానే- "కొంపదీసి దీనికి ఏ యిన్‌స్పెక్టరైనా ప్రియుడున్నాడేమో, లిటిల్ బిచ్ అనుకుని కొంచెం తగ్గాడు. తను ఒక్క మాటచెప్పగానే భయపడి, వాళ్ళు స్వప్నతో స్నేహంతెంచుకుంటారనీ, యిక స్వప్నకు తను నచ్చజెప్పే అవసరం వుండదనీ అనుకుని వచ్చాడు. ఇంతటి గొడవకు తనూ సిద్ధపడి రాలేదు. అందుకే ఓడిపోయినట్టుగా వెళ్ళిపోక, ఏదో ఒకరకంగా బెదిరించాలని నిర్ణయించుకున్నాడు.

"ఆయనతో మాట్లాడేదేమిటే, పోలీసుల్ని పిలిస్తే వాళ్ళే చూసుకుంటారు" గడపలో నిలబడి వినురుగా అంది మయూరి.

"నువ్వు కూడా సిల్లీగా బిహేవ్ చేయకు. ప్లీజ్- నామాట విను" బతిమాలి మయూరిని కూర్చోబెట్టింది ఆనందం.

"ఇక చెప్పండి" అంది ఆనందం, తనూ ఓ కుర్చీలో కూర్చుంటూ.

శివలక్ష్మి లోపలికెళ్ళింది.

"చెప్పడానికేముంది. స్వప్నను మీ దగ్గరికి రానివ్వద్దు- అంతే" వినుగ్గా అన్నాడు.

"స్వప్న మాతో హాస్టల్‌లో వున్నప్పట్నించీ కలిసుంది. అప్పుడులేని అభ్యంతరం యిప్పుడెందుకు? అయినా మీ కూతుర్ని మీరు ఒప్పిస్తే సరిపోవడానికి బదులు మాకిలా చెప్పటం బాగుందా చెప్పండి?" అడిగింది ఆనందం.

"నేను చెప్పాను... అది విన్లేదు. దాని వయసు అలాంటిది. నా కొలీగ్స్ ఈ సినిమా యాక్టర్ గురించి ఎంత వల్గర్‌గా మాట్లాడారో నాకు తెలుసు. అప్పుడు కూడా స్వప్నను ఈమెతో తిరగనిస్తే నలుగురిలో ఎలావుంటుంది నాకు. అందుకే మర్యాదగా చెబుతున్నాను. అది పెళ్ళికావలసిన పిల్ల. దాని మానాన దాన్నిబతకనివ్వండి"

"సరే... నాగురించి మీకెవరో చెబితే మీరు నమ్మేశారు. మరి మీవిషయం ఏమిటి?" ప్రశ్నించింది మయూరి.

"నా గురించా? నా గురించి ఏముంది? నేనేమైనా బరితెగించి తిరుగుతున్నానా?"

"భాష జాగ్రత్త. మీరు స్వప్న తల్లిని వుంచుకున్నారనీ, ఆమె మీ సంసారం నాశనంచేసిందనీ అందరూ చెప్పుకుంటున్నారు. ఆమె గురించేం చెబుతారు? ఆగండి, నేను చెప్పేది వినండి. మీరూ మీ భార్యకు ద్రోహంచేసి, గౌతమిగారిని పెళ్ళిచేసుకున్నారు- అది తప్పు కాదా?"

"గౌతమి నా రెండో భార్య. నీలాగా సినిమాల్లో అడ్డమైన వాడితోనూ తిరగటంలేదు" కోపంగా అన్నాడు జీవన్.

"నేను తిరగటం మీరు చూశారా?"

"వేరే చూడాలా... సినిమాల్లో నటించే దానివి, నీగురించి వేరేచెప్పాలా ఏమిటి? అయినా ఒక్కమాటడుగుతాను చెప్పు. నువ్వు కన్నెపిల్లవేనా? ఆర్ యూ ఏ వర్జిన్- టెల్‌మీ"

"మీ అమ్మాయి స్నేహితురాళ్ళందరికీ వర్జినిటీ టెస్ట్‌చేయించి, ఆ తరవాతే స్నేహం చేయాలా వద్దా అని నిర్ణయిస్తారా? ఒక్క మాట చెబుతాను వినండి, స్వప్న పెళ్ళి అనేదిగానీ సమస్యంటూ అయితే అది నాతో స్నేహంవల్లకాదు, ఆమె మీ కూతురు గనుక, మీరు పెళ్ళిచేసుకునో, చేసుకోకుండానో వాళ్ళమ్మతో వుంటున్నందువల్ల అవుతుంది. అది కూడా ఈలోకం నిండా మీలాంటి సంకుచిత స్వభావం వాళ్ళున్నందువల్లనే"

"నువు నాకు నీతులు చెప్పనక్కరలేదు. అసలు ఇలా మాట్లాడటానికీ, ఇలాంటి బతుకు బతకటానికీ నీకు సిగ్గులేదూ?"

"ఎందుకు లేదు. నిజంగా సిగ్గుపడుతున్నాను. నా ప్రతిభ చూసి వేషాలు యియ్యాల్సిన దర్శకులు, నా అందంచూసి యిస్తున్నందుకు సిగ్గుపడుతున్నాను. ఆడదానిలో మనసూ, వ్యక్తిత్వమూ వదిలేసి, ఆడతనం ఒక్కటే గుర్తించే మగవాళ్ళున్న ఈలోకంలో ఒక ఆడదానిగా పుట్టినందుకు నేను సిగ్గుపడాలా? ఇది మగప్రపంచంగా చేసి, ఒంటరిగా బతకాలనుకునే ఆడదానికి శీలం వుండదనీ, శీలంలేని ఆడది మనిషికాదనీ ముద్రవేసి, ఆడవాళ్ళను అబలలుగా, నిస్సహాయులుగా చేస్తున్న మీలాంటి మూర్ఖులున్న ఈలోకంలో నా బతుకు నేను బతుకుతున్నాను. నాకేమీ సిగ్గుగాలేదు. కట్టుకున్న పెళ్ళాన్ని మరిచిపోయి, మరో ఆవిడతో కులుకుతున్నందుకు మీరు సిగ్గుపడాలి- అదుండా మీకు?"

"తప్పో ఒప్పో, నేను మరో పెళ్ళిచేసుకున్నాను. కానీ నాకు యిద్దరు మాత్రమే భార్యలు- మరి నీసంగతి?"

"ఓకే... ఒక్కమాటకు సరిగ్గా సమాధానం చెప్పండి. ఇక స్వప్నను నా దగ్గరికిరావద్దని చెబుతాను"

"ఏమిటది?" ఆలోచిస్తూ, సగం సంతోషంగా అడిగాడు జీవన్.

"తప్పో, ఒప్పో, మరో భార్యను చేసుకున్నాను. ఇద్దరితో సక్రమంగా సంసారం చేస్తున్నా[illegible] ఒప్పో, మీ భార్య కూడా మరొకరితో వుంటానంటే, అతన్ని ఆవిడ్నీ భరించి ఆమెతో సంసారం చేస్తారా?"

"షటప్... నేను మగాణ్ని"

"ఆ మగ అహంకారంపోయేదాకా ఈకథలన్నీ యింతే- మీరిక వెళ్ళొచ్చు" అంది మయూరి, చెయ్యి బైటికిచూపిస్తూ.

"అయితే మర్యాదగా చెబితే వినవన్నమాట?" లేచి నిలబడి అన్నాడు జీవన్.

"మర్యాదగా చెబితే మీరూ వెళ్లరన్నమాట"

"సరే... మీ సంగతేం చేయాలో నాకు తెలుసు" గర్జించాడు నిస్సహాయంగా.

"నీ ఇష్టంవచ్చింది చేసుకో. మళ్ళి నీ ముఖం ఇక్కడ కనిపిస్తే నేను కూడా ఏంచేస్తానో నాకే తెలియదు" కోపంగా అరిచింది మయూరి.

విసవిసా బైటికి నడిచాడు జీవన్.

జరిగిన దాన్నుండి ముగ్గురూ కొద్దిసేపటివరకూ తేరుకోలేకపోయారు.

"నాకు భయంగా వుందే... ఏంచేస్తాడో ఏమో" అంది శివలక్ష్మి.

"డర్టీ డాగ్, వాడేం చేస్తాడే- నువ్వేం భయపడకు" అంది మయూరి ధైర్యంగా.

"ఏ రౌడీలనో పంపి ఏమైనా అల్లరిచేస్తే?" సందేహం వెలిబుచ్చింది.

"ఇదేమైనా సినిమా అనుకుంటున్నావా ఏమిటి? ఏమీ చేయడు" భరోసాగా అంది మయూరి –"అవునూ... ఈ గొడవలో నీ భాష మారి చచ్చిందేమిటే శివా?" వాతావరణాన్ని తేలిగ్గా చేయాలని అంది నవ్వుతూ.

"ఏం చావో ఏమో. నాకు భయంతో చచ్చినట్టుంది"

"ఒక పనిచేద్దాం... మా డాక్టర్‌గారికి చెబితే?"

"అవునే... ఫోన్‌చేసి చావు త్వరగా"

"నేనెప్పుడూ ఫోన్‌చేయలేదే ఆయనకు. పోనీ, నువ్వుచేసి చెప్పవే" మయూరితో అంది ఆనందం.

"అబ్బా, మొగుడికి ఫోన్‌చేయడానికి కూడా ఇంత ఇదా? సరే- నంబర్‌చెప్పు"

చెప్పింది ఆనందం అర్ధరూపాయి కాయిన్లు నాలుగు తీసుకుంది మయూరి.

"ఎంత ధైర్యమే నీకు? ఇంత జరిగినా ఒక్కదానివే చావటానికి" ఆశ్చర్యపోయింది శివలక్ష్మి.

"చావాల్సివస్తే ఒక్కదాన్నే చావాలి. తోడుగా నువ్వు చస్తావా చెప్పు" విసుగ్గా అంది మయూరి.

"పోనీ ముగ్గురమూ వెళదాం" అంది ఆనందం.

జీవన్ చేసిన గొడవకి భయపడుతున్నారని గ్రహించింది మయూరి. ఇక తర్కించలేదు. ముగ్గురూ వీధి మలుపులోని గుళ్లోవున్న పబ్లిక్ ఫోన్ దగ్గరికి నడిచారు.

"ఇంతకూ డాక్టరుగారు, డాక్టర్‌గారు అనటమే కాని ఆయన పేరేమిటే ఆనందం?"

"డాక్టర్ సీతారామారావు"

"అదేదో ఇంటి పేరయినట్టు డాక్టరని ఆ తోకెందుకు. పేరు మాత్రం బాగా లేదే, రామకృష్ణారావు అయితే బాగుండేది" నంబర్ డయిల్‌చేస్తూ అంది మయూరి.

"మీఆయన ఒక్క సీతకే రాముడు కాదు కదా. అందుకన్నమాట" సెట్‌లో రెండు కాయిన్లువేసి, "హలో, డాక్టరు గారున్నారా... కాస్త పిలుస్తారా... నాపేరు చెబితే ఆయన గుర్తుపట్టరు... నేనాయన పేషెంట్‌నండీ.... అబ్బే అభ్యంతరం ఏమిటీ నామొహంమండా, నాపేరు వెంకాయమ్మండీ.... థాంక్సండీ, లైన్లో వుంటాను" అని ఆనందంవైపు తిరిగిచెప్పింది – "ఇంట్లోనే వున్నాడే నీపతిదేవుడు. ఆవిడగారు తీసారు ఫోను. పాపం, నేనెవరో ముసలిదాన్ననుకున్నట్టుంది. నన్నడిగితే మీఆయనపేరు ఆనందరామారావు, సారీ..." "సీతారామారావుగారా, సర్, నాపేరు మయూరి.... మయూరి.... అవును, మీ పనిమనిషి , అదే ఫోన్ తీసినావిడ మరీ ఆరాలు తీస్తే అలాచెప్పాను. నేను ఆనందం స్నేహితురాలిని... తనిక్కడేవుంది" ఫోన్ రిసీవర్ ఆనందంకిచ్చి, "మాట్లాడవే" అంది మయూరి పక్కకు జరుగుతూ.

"ఏమీలేదు, మీరు కంగారు పడకండి. ఒకసారి ఇక్కడికి రాగలరా.... అవును, మీకు పనేమీలేకపోతే వెంటనే రండి.... మంచిది... కంగారేంలేదు... ఇంట్లోనే వుంటాను. ఫర్వాలేదు.... వుంటాను... సరే" ఫోన్ పెట్టేసింది.

ముగ్గురూ ఇంట్లోకి చేరిన అయిదునిమిషాల్లోపల కారొచ్చి ఇంటిముందాగింది. పచ్చగా దబ్బపండురంగులో, మరీ లావు, మరీ సన్నంకాకుండా ఆరోగ్యంగా వున్నట్టు కనిపించే డాక్టర్ సీతారామారావు కార్లోంచి దిగాడు. మీసంతో సహా నున్నగా షేవ్‌చేసుకున్న ముఖం, చురుకైన కళ్ళు, కణతలదగ్గర కొద్దిగా మొదలైన బట్టతల, పాపిడి తీయని జుట్టులో అక్కడొకటీ, ఇక్కడొకటీ తెల్ల వెంట్రుకలు, మామూలుగా చూస్తే ముప్ఫయ్‌దాటిన వాడనిపిస్తాడు. ట్రాన్స్‌పరెంట్ ఫ్రేమ్ కళ్లజోడు ఒక హుందాతనాన్నిస్తున్నట్టుంటుంది. ప్యాంటూ, తెల్లచొక్కా, పుషిన్‌మాస్ – హడావిడిగా వచ్చినట్టు చెబుతున్నాయి.

"హిందీ సినిమా హీరోలా వున్నాడే మీ డాక్టర్" సన్నగా గొణిగింది మయూరి.

అయిదు నిమిషాల్లో విషయమంతా క్షుణ్ణంగా విన్నాడు. జీవితాన్ని కాచివడబోసినవాడిలా విషయమంతా చిన్నపిల్లలు రాజా, ఏడుగురు కొడుకుల కథను మళ్ళీమళ్ళీ వింటున్నట్టుగా తాపీగా విన్నాడు. వండిన వంటలన్నీ రుచిచూపించమని సూచించింది మయూరి ఆనందంను లోపలికి పిలిచి. అయిదు నిమిషాల్లో పూజపూర్తిచేసి, హారతితెచ్చింది ఆనందం. కళ్ళకద్దుకుని చేసిపెట్టినవన్నీ సగం సగం తినేసి వివరాలడిగాడు. జీవన్ ఇంటి అడ్రెస్ ముగ్గురిలో ఎవరికీ తెలియదు. గౌతమి ఇంటికి వెళతానని చెప్పాడు. లేచినిలుచున్న తరవాత "గొడవపెట్టుకోకండి" అని చెప్పింది ఆనందం కంగారుగా. "నా గురించి తెలుసుకదా నందూ ఎందుకు కంగారుపడతావ్" – తాపీగా చెప్పి వెళ్ళిపోయాడు సీతారామారావు.

అతను గౌతమి ఇంటికి వెళ్ళేసరికి సహజంగానే జీవన్ అక్కడలేడు. అంతకన్నా సహజంగా బాలూ అక్కడే వున్నాడు. ముందుగా జీవన్‌కోసం అడిగేసరికి బాలూ [illegible]

## విచిత్ర ప్రపంచం

బ్లడ్ బ్యాంక్



### బ్యాంక్ కాని బ్యాంక్

బ్యాంక్ అనగానే సాధారణంగా అందరికీ నోట్లకట్టలు, లాకర్లలో ఉండే నగలు నాణ్యాలే కళ్లముందు కనబడతాయి. కానీ ఈ రోజుల్లో డబ్బుల బ్యాంకులేగాక, బ్లడ్ బ్యాంకులు, 'ఐ బ్యాంక్'లు వగైరా చాలా రకాలు ఉంటాయనే సంగతి తెలియని ఓ దొంగలముఠా ఉత్తరప్రదేశ్‌లోని ధంపూర్‌లో గల 'ఐ బ్యాంక్'లో జొరబడ్డారట. అక్కడున్న డ్యూటీ డాక్టరుగారి గుండెలకు తుపాకీ గురిపెట్టి నోట్లకట్టల్ని తీసి తమ గోనెసంచిలో నింపమన్నారట. పాపం, వారు తప్పు అడ్రస్‌కు వచ్చారన్న విషయం గ్రహించిన డాక్టరుగారు వాళ్ళని కూచోబెట్టి, ఐ బ్యాంక్ అంటే డబ్బులుండే బ్యాంక్ కాదనీ, చనిపోతూ నేత్రదానం చేసినవారి వద్ద నుండి నేత్రాలను సేకరించి భద్రపరిచే స్థలమనీ, ఆ నేత్రాలతో అంధులకు దృష్టిని ప్రసాదిస్తారనీ ఓపిగ్గా వివరించారుట. దాంతో దొంగలు అసలు విషయం మరచిపోయి, తామంతా నేత్రదానం చేయాలని నిర్ణయించుకున్నట్లు డాక్టర్‌గారికి తెలిపి అందుకు కావలసిన ఫారాలను నింపి డాక్టర్‌గారికే ఇచ్చి మరీ వెళ్లారుట. ఇంతకూ వాళ్లు ఇచ్చిన అడ్రస్‌లు నిజమైనవో కాదో పోలీసులు చెప్పాల్సిందే.

తండ్రి స్నేహితులు తండ్రికోసం అక్కడికి రావటం విచిత్రమనిపించింది. ఆనందం భర్తగా పరిచయం చేసుకుని, స్వప్నను చూడటానికి వచ్చానని సీతారామారావ్ చెప్పటంతో, బహుశా డాక్టర్ కనుక చెకప్‌కోసం తండ్రి పిలిపించాడేమో ననుకున్నారు. తన స్నేహితురాలి భర్తను స్వప్న కూడా అంతకు ముందు ఎప్పుడూ చూడలేదు. అందరూ అతన్ని సాదరంగా ఆహ్వానించారు.

మామూలు కబుర్లన్నీ కాస్సేపు అయినతర్వాత జీవన్ చేసిన పని గురించి తాపీగా వివరించాడు. ముగ్గురికి ముగ్గురూ విస్తుపోయారు. గౌతమి చాలా బాధపడి, భర్త తరఫున క్షమాపణలు అడిగింది. జీవన్‌కూడా ఆవేశంలో ఏదో చేసివుంటాడని సమర్థిస్తూనే, అలాంటి పని మరోసారి చేస్తే మాత్రం తను ఊరుకోనని మెత్తటి మాటలతో గట్టిగా హెచ్చరించాడు సీతారామారావు. తను కూడా స్నేహితురాళ్లతో మాట్లాడుతానని చెప్పి, స్వప్నకూడా తన తన తండ్రి చేసిన పనికి బాధపడుతున్నాని చెప్పింది. స్వప్న ఆరోగ్యం గురించి వివరాలన్నీ తెలుసుకుని ఒకసారి ఆనందంను వెంటబెట్టుకుని తన క్లినిక్‌కు రమ్మనిచెప్పి, స్నేహపూర్వకంగా వీడ్కోలు తీసుకున్నాడు సీతారామారావ్.

తిన్నగా వెళ్ళి, జరిగిందంతా వాళ్ళకు వివరించి, ఏమీ జరగదని ధైర్యం చెప్పి, మళ్ళీ టీ తాగి, కాసేపుకూర్చుని సీతారామారావు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన అరగంటకల్లా బాలూ, స్వప్న వచ్చారు. జరిగిందానికి మయూరికి క్షమాపణ చెప్పాడు బాలూ, నవ్వుతూ వారించింది మయూరి. తను తండ్రి దగ్గరికే వెళుతున్నానని, అతన్ని హెచ్చరిస్తాననీ, ఏమీ జరగదనీ, జరిగిందానికి ఏమీ అనుకోవద్దనీ చెప్పి, స్వప్నను తీసుకెళ్ళడానికి వస్తానని చెప్పేసి బాలూ వెళ్ళిపోయాడు.

"మయూరీ... నా గురించి చెడుగా ఏమీ అనుకోవటంలేదుకదూ- నిజం చెప్పవే" అప్పటికి ఎనిమిదోసారి అడిగింది స్వప్న బాధగా.

"ఏమీ అనుకోవటంలేదు. అనుకోను. సినిమాయాక్టర్‌తో స్నేహం చేస్తే, నువ్వు చెడిపోతావని మీ డాడీ అంటే మనకు కోపంవచ్చింది. మీ డాడీ నన్నేదో అన్నాడని నేను నిన్ను తప్పుపడితే, ఇక ఆయనకూ, నాకూ తేడా ఏముంది? ఒకరుచేసినపనికి మరొకర్ని బాధ్యులను చేయటం బుద్ధితక్కువ. ఇకనైనా నేను నీగురించి ఏదో అనుకుంటున్నానని అనుకోకు. అనుకోవటం లేదుకదూ, నిజం చెప్పవే" చివరి మాటలు స్వప్నను అనుకరిస్తూ పలికి నవ్వింది మయూరి.

అందరూ కలిసి పిండివంటలమీద దాడి చేశారు. కబుర్లు చెప్పుకుంటుండగా అడిగింది స్వప్న-

"మయూరీ...అసలు నువ్వు సినిమాల్లోకెందుకొచ్చావే, ఎలావచ్చావే చెప్పవే"

"సినిమాలంటే గుర్తొచ్చింది, అసలారోజు నువ్వు వీడియో తీయించుకున్నావా, లేదా?" ఆత్రంగా అడిగింది ఆనందం.

"నాగురించి తెలుసుకదా నందూ, ఎందుకు కంగారుపడతావ్"' సీతారామారావు మాటని అనుకరించి అంది మయూరి.

"ఛీ...పోకిరిదానా" టెంకిజెల్ల వేసింది ఆనందం.

"మీఆయనంటేనేమో సిగ్గుపడి, నేనంటే మొట్టికాయవేస్తావా" తలమీద తడుముకుంటూ అంది మయూరి- "నువ్వు ఐస్క్రీం తినిపిస్తానన్నావ్, గుర్తుంచుకోమరి"

"సరేలేవే... ముందు చెప్పు"

"ఐతే సరదాగా ట్యాంక్‌బండ్‌వైపువెళ్ళి, ఇందిరాపార్క్‌కో, సంజీవయ్యాపార్క్‌కో వెళదాం" ప్రతిపాదించింది మయూరి

"ఇది ఇంకా నీరసంగా వుంది. తిరిగితే మళ్ళీ జ్వరం తిరగబెడుతుందేమో, వద్దులేవే" అంది ఆనందం.

"నర్సుని పక్కనుండగా జ్వరానికేం భయంగానీ, మా అన్నయ్యొస్తానన్నాడుకదా, కంగారు పడతాడు.ఇక్కడే కూచుందామే. అసలు మనం ఇలా తాపీగా ఇంట్లోకూచోక చాలారోజులయింది"

"ఇంట్లోనే చద్దాంగానీ, వీడియో సంగతేమిటో చెప్పిచావవే ముందు"

"రెక్కొచ్చిమొదలాడమని మళ్ళీ అదంతా నేను చెప్పను' గిరపోయింది మయూరి.

"నేను చెబుతానులేవే" అంది ఆనందం

జ్ఞాపకాల పుటల్ని వెనక్కి తిప్పి, మయూరి చెప్పినదంతా క్లుప్తంగా వివరించింది-"వీళ్ళవ దినేమో దీని తరఫున వకాల్తా తీసుకుని, వీళ్ళన్నయ్యని తోటలో వున్న వాళ్ళ నాన్నదగ్గ రకు పంపింది. అప్పుడేమయిందే, మీనాన్న ఒప్పేసుకునుంటాడు- అంతేకదూ?" అడి గింది మయూరిని.

" మా అన్నయ్య మొహం వెళ్ళాడేసుకుని వచ్చాడు. మా నాన్న ఒప్పుకుంటానన్నాడట. మంకుపట్టుపట్టి కూచుంటే ఒప్పుకోమనండి, కానీ మరుక్షణం నేను ఎండ్రిన్‌తాగి చస్తాను, లేదంటే దాన్ని టిఫిన్‌తీసుకుని తోటకు రమ్మన మని చెప్పాడట. పెద్దాళ్ళ పట్టుదల సంగతి నాకుతెలును. పరువుగురించి ఆలోచిస్తే ఏమైనా చేస్తారు. నేను తలుపుతీసి, ఏడు స్తూనే నాలుగు మెతుకులు తిన్నట్టుగా చేసి, మంచంమీద ఏడుస్తూ పడుకున్నాను. తర వాత మానాన్న ఇంటికొచ్చి, నన్ను బుజ్జగించి, ఏదేదో నచ్చజెప్పాడు"

"ఐతే వీడియో తీయించుకోలేదన్నమాట"

"నా మొహం... మనం చెబితే ముసలాళ్ళు విని చస్తారుగనుకనా? నాకనలే సినిమాలమీద ఇంట్రెస్టుందన్నానా? వీళ్ళేమో నా డాన్సు వీడియో తీయించుకుంటానంటే సినిమావాళ్ళ లాగా ఏమిటని అన్నారా? అప్పుడనిపించింది నాకు, సినిమాయాక్టర్‌నైతే? అని. ఏదైనా వద్ద న్నదానిమీదే మోజు పెరుగుతుందనుకుంటా ను. నాకు మాత్రం అలాగే అయింది. వారంరో జులు ఎవరితోనూ సరిగ్గా మాట్లాడలేదు నేను. నన్ను మరిపించటానికి వీడియో తీయిస్తే ఎంతవుతుందని అడిగి, ఏదైనా నగ చే యించుకోమని మూడువేలిచ్చాడు మా నాన్న. వీడియో తీయించుకోనందుకు కాంపెన్సేషన్‌గా మరో రెండువేలు వసూలుచేసాను. వెయ్యిరూ పాయలుపెట్టి జూకాలు చేయించుకుని, మిగ తావన్నీ దాచుకున్నాను" అప్పటిసంగతి గుర్తొ చ్చినవ్వుతూ చెప్పింది మయూరి.

"వేలకువేలు డబ్బు ఎందుకేనీకు- ఏంచే సుకోవటానికి?" ఆశ్చర్యంగా అడిగింది స్వప్న.

"డబ్బు ఎందుకేమిటే పిచ్చిమొహమా? మనకేదైనా కావాలనుకో, ఎవర్ని అడగకుండా వెంటనే కొనేసుకోవచ్చు. ఆ తరవాత ఇంట్లో డబ్బులు వసూలుచేసుకోవచ్చు. ఇయ్యలే దంటే అన్నం మానటమే. అటు మనం కోరుకు న్నదీ వస్తుంది, డబ్బులూ వస్తాయి. మనం అడిగినప్పుడు చేతిలో డబ్బులేదని సాకూ చె ప్పలేరు. మనమెటూ వంట కోతలప్పుడే వసూ లుచేస్తాంకదా"

"మొత్తానికి ఇంట్లోవాళ్ళని ఓ ఆట ఆడించావన్నమాట, గారాలకూతురిలాగా"

"మరి ఏమొచ్చి చచ్చిందని ఇలా చచ్చిత గలడ్డావ్?"

"అదే చెప్పొచ్చన్నున్నానుకదా. ప్రశ్నలడిగి చావకుండా వినిచావండి. టెంత్ పాసయ్యాను. పొరుగూళ్ళోవున్న కాలేజీలో చేరి ఇంటర్ మొ దలెట్టాను. దాదాపు రెండుసంవత్సరాలూ సర దాగానే గడిచింది. క్లాసులెగ్గొట్టి సినిమాలు చూడటం, హాయిగా టౌన్‌కెళ్ళి రావటం, కాలేజీ వాతావరణం చాలా బాగుండేది. నేను బియ్యే చదువుతాననే విషయంగురించి ఇంట్లో వాదో పవాదాలు జరుగుతున్నాయి. ఇంటర్ రిజల్ట్స్ ఇంకా రాలేదు. అప్పుడు మావూళ్ళో 'అలలకౌ గిలి' సినిమా షూటింగ్ జరిగింది"

"హీరోయిన్ మల్లిక ఫస్ట్‌పిక్చర్‌కదూ?" అడి గింది స్వప్న.

"ఇంకేం హీరోయిన్, ఇప్పుడు వేషాలులేవు కదూ" ఆనందం అడిగింది.

"అదే అసలు విషయం. నేను షూటింగ్ చూడటానికి రోజూ వెళ్ళేదాన్ని. ముందుగా మూడురోజులు రెండు పాటలు కొంత భాగం తీశారు. "ప్రేమ జలపాతమూ, మనసు హిమ తాపమూ" పాటలేదూ, అదీ, "ఇంపుల సొంపుల వంపుల విరుపుల గడసరి బుల్లె మ్మా" అదీ. రెండూ సూపర్‌హిట్ సాంగ్సే. ఆ రెండూ పూర్తయ్యాయి. నాలుగో రోజునుండీ సీన్స్ మొదలుపెట్టారు. డైరెక్టర్ వాసుదేవ్, మీకు గుర్తుందనుకుంటాను. ఇక యీ మల్లి కతో ఆయన అవస్థలు చూడాలి, ఒక్కొక్క షాటూ టేకుల మీద టేకులు తింటుంది. ఆ తెల్లవారో మరునాడో సరిగ్గా గుర్తులేదు, క్లై మాక్స్ సీన్‌తీస్తున్నారు. హెవీ డైలాగ్స్. సినిమా టెంపో అంతా ఆ సీన్‌లోనే వుంది. అంతకు ముందు షాట్ ఏడెనిమిది టేకులు తిని ఓకే చేసింది. ఈ డైలాగ్ చెప్పటమే కంగారుగా చెప్పేసరికి నేను నవ్వాపుకోలేక గట్టిగా నవ్వా

ను. అసలే చిర్రాగ్గా వున్న వాసుదేవ్‌కి చాలా కోపం వచ్చింది. నా దగ్గరికొచ్చి కోప్పడ్డాడు. నటనంటే తమాషా కాదు, నువ్వు చేస్తే తెలుస్తుంది - అన్నాడు. నాకూ కోపమొచ్చింది. నేనైతే ఇన్నిసార్లు కాదు, మొదటిసారికే చేసేస్తాను - అన్నాను. మాటలు కాదు, చేసి చూపించాలి - అన్నాడు. ఛాలెంజ్ అంటే ఛాలెంజ్ అన్నాను. నా స్నేహితురాళ్ళు వారిస్తున్నా వినిపించుకోలేదు. నాకు డైలాగ్ పేపర్ యిమ్మన్నాడు, అసిస్టెంట్ డైరెక్టర్‌ని. అతనంతకుముందే మల్లికకు నాలుగుసార్లు వినిపించాడు. నాకు కంఠతా వచ్చేసింది. అందుకే అవసరం లేదు, రెడీయా అన్నాను. రడీ అన్నాడాయన. యాక్షన్‌తోసహా చూపించేశాను. అంతే... స్టన్నయ్యాడాయన. నా గురించి వివరాలడిగాడు. ఇంట్రెస్టుంటే పెద్దాళ్ళతో మాట్లాడి తన నెక్స్ట్ పిక్చర్‌లో చిన్నవేషం యిస్తానన్నాడు. నాకు చాలా సంతోషం వేసింది.

"ఇంటికెళ్ళేసరికి ఈ విషయం మావాళ్ళకు తెలిసిపోయింది. అంతే... మరునాటినుండీ షూటింగ్ చూడటానికి కూడా పంపలేదు. బియ్యేలో చేరాను. ఫస్టియర్ మధ్యలో వుండగా కొత్త ముఖాలు కావాలని పెద్ద ప్రకటన వచ్చింది పేపర్లో. ఇంట్లోవాళ్ళకు చెప్పకుండా ఫొటోలు పంపించాను. హీరోయిన్‌గా సెలెక్టయ్యాననీ, వెంటనే మద్రాసు రమ్మనీ లెటరొచ్చింది. వారంరోజుల్లో అన్నీ సర్దుకున్నాను. మా నాన్న నాపేరున బ్యాంకులో లక్ష రూపాయలు ఫిక్సడ్ డిపాజిట్ వేశాడు. ఆ రిసీట్ కూడా తీసుకున్నాను. కాలేజ్‌లో ఫంక్షన్ వుందని చెప్పి, కొన్ని నగలు తగిలించుకుని, మిగతావీ, ఒక జత బట్టలూ బ్యాగ్‌లో పెట్టుకున్నాను. నాతోపాటు చదువుకుంటున్న మా వూరమ్మాయికి ఏవో మాయమాటలు చెప్పి, మా నాన్నకు రాసిన ఉత్తరం పెట్టిన కవర్ యిచ్చి, సాయంత్రం యిమ్మన్నాను. ఉత్తరంలో హైదరాబాద్ వెళుతున్నానని రాసి, మద్రాస్ బండెక్కాను"

"నీ ధైర్యం పాడుగానూ. ఆ నగలు చూసి ఎవడైనా పొడిచేసి లాక్కుంటే..." అంది ఆనందం.

"అంత తెలివితక్కువ దద్దమ్మను కానుగనుకనే యిప్పుడిలా వున్నాను. నగలన్నీ జాగ్రత్తగా బ్యాగ్‌లో పెట్టుకుని, టౌన్‌లో సూట్‌కేసూ, రెండు జతల బట్టలూ కొనుక్కుని మద్రాసుకు వెళ్ళాను. ఖర్చు ఎక్కువైనా మంచి లాడ్జింగ్‌లో దిగాను. యాభై వేల రూపాయలిస్తే హీరోయిన్ ఛాన్సిస్తామన్నారు వాళ్ళు. నాలుగైదురోజుల్లో అది బోగస్ కంపెనీ అని తెలుసుకుని ఆ ప్రయత్నం మానుకున్నాను. మద్రాసులాంటి సిటీలో ఒంటరిగా, అందునా సినిమాలలో చేరదామనుకుంటూ బతకటం కష్టమని అర్థమయింది. అప్పుడే మా వూరమ్మాయి ఒకరు హైదరాబాద్‌లో వున్న సంగతి గుర్తొచ్చింది. వెంటనే యిక్కడికొచ్చాను. విషయమేమీ చెప్పకుండా ఆమె సహాయంతో చిన్నగది తీసుకున్నాను. అప్పుడే నా గురించి ఎలా తెలుసుకున్నారో, మా అన్నయ్యొచ్చాడు. జరిగిందేదో జరిగింది, యింటికొచ్చేస్తే గుట్టుచప్పుడుకాకుండా పెళ్ళిచేసేస్తామనీ, తను నాన్నకు నచ్చజెబుతాననీ బతిమాలాడు. తిట్టాడు. భయపెట్టాడు. బెదరించాడు. ఎందుకో ఒకందుకు వచ్చేశాను. మళ్ళీ మా నాన్నను క్షమించమని అడగటం, ఇదంతా దాచిపెట్టి ఎవడికో యిచ్చి పెళ్ళిచేస్తే, దొంగలాగా బతకటం ఎందుకనిపించింది. నా బతుకేదో నేను బతకలేనా - అనుకున్నాను. అంతే చెప్పేశాను. మా నాన్న దగ్గర్నించి తెచ్చుకున్న ఫిక్సడ్ డిపాజిట్ రసీదూ అన్నయ్యకిచ్చేశాను. తను వెళ్ళిపోయాడు.

"నగల్లోంచి జూకాలూ, కమ్మలూ, ఒక సన్న చెయినూ వుంచుకుని మిగతావన్నీ అమ్మేశాను. పదిహేడు వేలదాకా వచ్చింది. నా దగ్గరున్న క్యాష్‌లో ఖర్చయిందిపోను పదివేలదాకా మిగిలింది. అన్నీ బ్యాంక్‌లో వేసుకున్నాను. ఎక్కడైనా ఒక ఉద్యోగం సంపాదించుకుని, సినిమాల్లో వేషాల గురించి ప్రయత్నిస్తే ముందుగా ఫుడ్ ప్రాబ్లం తీరుతుందని ప్రయత్నించాను. ఎక్కడికెళ్ళినా టైప్ వచ్చా, షార్ట్ హాండ్ వచ్చా, అకౌంటింగ్ వచ్చా - అనడుగుతారు. నా మొహానికి డిగ్రీ సర్టిఫికెట్ కూడాలేదు. ఏం వుద్యోగం దొరుకుతుంది. ఓ రిబేట్ సేల్స్ ఎగ్జిబిషన్‌లో సేల్స్‌గర్ల్‌గా చేరాను. ఇరవై రోజులకు ఆ సేల్స్ అయిపోయింది. సరే... యిలాంటి ఉద్యోగమైనా చేసుకోవచ్చునన్న ధైర్యం వచ్చింది.

"దాదాపు ఆరేడువారాలు గడిచాయి. మా నాన్న దగ్గర్నించి రిజిస్టర్ పోస్ట్‌లో లెటర్ వచ్చింది. నేను తిరిగిచ్చేసిన ఫిక్స్‌డ్ డిపాజిట్ రసీదుతోపాటు కొత్తగా లక్ష రూపాయలకు తీసుకున్న మరో రసీదు కూడా వుంది. తను నాకు కట్నంగానూ, పెళ్ళి ఖర్చులకుగానూ రెండు లక్షలు ఖర్చుచేద్దామనుకున్నాననీ, పెళ్ళికే ఖర్చు చేసుకుంటావో, ఎందుకు ఖర్చు చేసుకుంటావో నీ యిష్టం, ఆడపిల్ల సొమ్ము తనకక్కర్లేదనీ, ఎక్కడా తండ్రిగా తన పేరుచెప్పుకోవద్దనీ, యింటి పేరు వాడుకోవద్దనీ, మళ్ళీ యింటికి రావద్దనీ రాసాడు ఉత్తరం. అది చూసి సంతోషించాలో, బాధపడాలో అర్థంకాలేదు.

"కూతురు సినిమాల్లో చేరితే పరువు తక్కువనే భావన ఒకవైపూ, ఒంటరిగా బతుకుతూ, డబ్బుకిబ్బందిపడి ఏమవుతానోననే ప్రేమతో కూడిన ఆరాటం ఒకవైపూ కలిసి యిలా చేశాడని అర్థమయింది. ఇంత ఆలోచించిన మా నాన్న నన్ను ప్రోత్సహిస్తే ఎంత బాగుండేదో అనిపిస్తుంది. ఈ లోకంలో ఒకడుగా ఈ మనుమల కట్టుబాట్లను దాటి రాలేకపోయాడు కదా అనీ అనిపిస్తుంది. సరే... మా నాన్నను తప్పుపట్టి లాభంలేదు. సినిమాల్లో నాన్నలలాగా నన్ను రౌడీలతో చంపించటమో, నాకు చిల్లిగవ్వ యివ్వననటమో చేయలేదు. ఇక అంతటితో మా యింటితో సంబంధం తెగిపోయింది. మా నాన్న పేరు చెప్పుకోను. అంతెందుకు- నా పేరు కూడా మార్చుకున్నాను. డబ్బు అలాగే వుంచేసి, నెలకో వెయ్యిరూపాయల వడ్డీ మాత్రం తీసుకుంటున్నాను. ఎప్పుడైనా అర్జెంటుగా అవసరమైతే తీసుకోవటానికి నా సేవింగ్స్ బ్యాంక్‌లోని డబ్బు ఎటూ వుందిగదా. అందుకే డబ్బుకోసం కాని పనులు చేయాల్సిన అవసరం రాలేదు... వచ్చినా చేయను- అది వేరే విషయం. అలా చేసేవాళ్ళు ఎవరైనా వుంటే కూడా తప్పనిమాత్రం అనను. జీవనం కోసం మానం అమ్ముకోక తప్పనిసరి పరిస్థితి వస్తే ఆ తప్పు ఆ స్త్రీది కాదు, మన వ్యవస్థది. సరే- నాకు ఆ దురవస్థ రాలేదు. ఆ తరవాత సినిమాల్లో ప్రవేశించే అవకాశాలువెదికాను. హాస్టల్‌లోకి మారాను" ఆగి, ఊపిరి తీసుకుని-

"బీస్ సాల్ పహలే... యిదీ జరిగింది" అంది హిందీ, తెలుగు సినిమాల ఫ్లాష్ బ్యాక్‌ల ఫక్కీలో.

"మరి ఏదో ఓచిన్న సినిమాలో పెట్టుబడి పెట్టి హీరోయిన్ కాలేకపోయావా?" అడిగింది ఆనందం.

"అలాంటి పిచ్చిపని మాత్రం చేయదలుచుకోలేదు. నాదగ్గర డబ్బుందని తెలిస్తే వేషాలిస్తామని చెప్పి, అప్పుగా యిమ్మని కూడా అడిగే వాళ్ళు. కానీ ఈ సంగతి మాత్రం ఎవ్వరికీ చెప్పలేదు. మీరు నావాళ్ళు కనుక, మీకు చెప్పినా ఏమీ కాదు కనుక చెప్పానిప్పుడు"

"అవునే మయూరీ: అయితే పేరు మార్చుకుని చచ్చావన్నమాట. నీ అసలు పేరేమిటో చెప్పిచావవే"

"అబ్బ... ఎందుకులేవే" మోహమాటపడింది మయూరి.

"మీ నాన్నకు మాటిస్తే యిచ్చావులే. మాకు చెప్పడానికేం" అంది ఆనందం.

నవ్వుకుంటూ ఊర్కుంది గానీ మాట్లాడలేదు మయూరి.

"అయితే పేరు చెబితే యింకో ఐస్‌క్రీం కొనిస్తానే, చెప్పవే- ప్లీజ్" మళ్ళీ బతిమాలింది ఆనందం.

"నేను చెబుతానే, దాని పేరు ఏ పుల్లమ్మో, పెంటమ్మో అయివుంటుంది. అందుకే చెప్పటం లేదు" కవ్వించింది. స్వప్న.

"ఏదైతేనేమీ చెప్పటానికి. నాపేరు నాపేరే కదా"

"ఐతే చెప్పుమరి"

"కనకవల్లి" చెప్పేసింది మయూరి.

"అబ్బ... నీ బ్యూటీకి తగిన పేరు పెట్టారే కనకం" సర్టిఫికేటిచ్చింది స్వప్న.

"ఇంకోసారి ఆపేరెత్తితే చంపేస్తాను" కోపంగా అంది మయూరి.

"దీన్ని ఏడిపించడానికి మనకో పాయింటు దొరికింది కదా" ఉడికించింది ఆనందం.

భుజానికో ఎయిర్ బ్యాగ్ తగిలించుకుని,

ఏడున్నరకల్లా వచ్చాడు బాలు. కాస్సేపు కూర్చుని, స్వప్నను తీసుకుని వెళ్ళిపోయాడు.



మరునాడు పొద్దున్నే గౌతమి దగ్గరి కొచ్చాడు జీవన్. రావటంతోనే బాలూ మీద ఎగిరిపడ్డాడు. అసలు బాలూ ఎయిర్ బ్యాగ్ తీసుకుని రావటంతోనే గౌతమి ఏదో అనుమానించినా నిదానంగా అడగొచ్చుననుకుని ఊర్కుంది. జీవన్ గొడవతో విషయం అర్థమయింది. మయూరి విషయంలో మాటా మాటా వచ్చి బాలూని చాచి లెంపకాయ కొట్టాడు జీవన్. తనమాట వినకపోతే తనింట్లో వుండవద్దని ఆవేశంతో అన్న వెంటనే బాలూ తన బట్టలూ, పుస్తకాలూ తీసుకుని వచ్చేశాడు యింట్లోంచి. ఇక్కడికే వస్తాడని తెలుసుకనుక జీవన్ ఆదుర్దా పడలేదు. వచ్చీరాగానే మళ్ళీ కొడుకు మీద ఒంటికాలితో లేచాడు. గౌతమి ఎంత సర్ది చెప్పినా వినిపించుకోలేదు.

"డామిట్... ఒక్కరూ నన్ను అర్థంచేసుకోరేం? నేనేదో దుర్మార్గుణ్నీ రాక్షసుణ్నీ అయినట్లు మాట్లాడుతారు. నేను ఎందుకోసం చెబుతున్నాను. దాని మంచి కోసం చెబుతున్నాను. చెప్పుకోకూడని మాటలంటున్నారు ఒక్కొక్కరూ. చివరికి, చివరికి సరస్వతి కూడా ఏమందో వాణ్నడుగు. ఉంచుకున్న దాని కూతురు సాని దానితో స్నేహం చేయక మరెవరితో చేస్తుంది- అంది. బాగున్నాయా యిలాంటి మాటలు? నాలుగేళ్ళయితే పెళ్ళి కావలసిన పిల్ల. అలాంటివాళ్ళతో తిరిగితే ఏక్షణాన ఏమవుతుందో ఎవరికి తెలుసు? ఇన్నేళ్ళుగా ఒక్క రోజు, ఒక్కవిషయంలో కూడా డిఫరెన్సెస్ లేకుండా వున్నాం. అలాంటిది, అరే, ఒక్కరూ అర్థం చేసుకోరేం, ఒక బైటి వ్యక్తి విషయంలో యింత రాద్ధాంతమా?" ఆవేశంగా అరిచాడు జీవన్.

"మీరన్నట్టుగానే జరుగుతుందనుకుంటే, అలాంటిది దానికి పెళ్ళి కాకపోయినా ఫర్వాలేదు" నిర్లక్షంగా అన్నాడు.

"అవున్రా... కని పెంచితే తెలుస్తుంది- నీకేం తెలుసు గనుక"

"అన్నయ్యన్న దాంట్లో తప్పేముంది. ఆఫ్టాల్, నేనెవరితో స్నేహం చేయాలనే విషయం కూడా నా యిష్టప్రకారం చేయలేక పోతే బతకడమెందుకు?"

"షటప్ స్వప్నా... బాలూ నువ్వుకూడా. కీప్ క్వైట్. మీరిద్దరూ లోపలికెళ్ళండి. కమాన్ ఐసే" సీరియస్‌గా అంది గౌతమి.

అన్నా చెల్లెళ్ళిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ నిలుచున్నారు.

"లేపోతే యిద్దరూ కాలేజీకెళ్ళిపోండి. కాస్సేపు ఎక్కడైనా తిరిగిరండి-" మళ్ళీ చెప్పింది గౌతమి.

ఇద్దరూ లోపలిగదిలోకెళ్ళి కర్టెన్ చాటున నిలుచున్నారు గుసగుసలాడుకుంటూ.

కాస్సేపు ప్రయత్నించి జీవన్‌ను చల్లబరిచింది గౌతమి. తరవాత నిదానంగా, మృదువుగా చెప్పింది-

"లోకం లక్షఅనుకుంటుంది జీవన్. మనమెందుకు కేర్ చెయ్యాలి?"

"ఎందుకంటే మనం ఈలోకంలోనే బతుకుతున్నాం గనుక"

"అరే... కోపమెందుకు? తాపీగా విను. బ్లాక్ మార్కెట్ చేసేవాళ్ళని తిడతాం. సినిమాకి వెళ్ళి బ్లాకులో టిక్కెట్ కొనుక్కుంటాం. అప్పుడు ఆ బ్లాక్ మార్కెటీర్ దేవుడిలా కనిపిస్తాడు. డబ్బు లెక్కువ లేక కొనుక్కోలేనివాళ్ళు కూడా లోకులే. వాళ్ళ దృష్టిలో మనస్థానం ఏమిటి? రేపు బాలూకు ఉద్యోగం కావాలంటేనో, పద్మకు పెళ్ళి కావాలంటేనో డబ్బుకావాలి. మనం యివ్వగలిగినంత అడిగితే యిచ్చేస్తాం. ఇవ్వలేనంత అడిగితే? లంచాలతో దేశం పాడైపోతూంది, వరకట్నాల దురాచారం నశించాలి- అంటాం. ఇంతే లోకాభి

ప్రాయం. మనకు అనుకూలంగా మలచుకోవటం, మనని మనం మోసం చేసుకోవటం. షిట్, ఐడోంట్ కేర్''

"ఐతే యివన్నీ వదిలెయ్యమంటావా? దానికేమైతే అయిందని ఊర్కోమంటావా?''

"కోపంవద్దన్నాను కదా. మామూలుగా మాట్లాడరాదూ. స్వప్న నాకూతురు కాదా? దాని మంచి గురించి నాకు తెలియదా? ఎదిగిన పిల్ల, బైపీసీ తీసుకుని చదువుకోవే, డాక్టరవుదువూ అంటే, ఎంపీసీ తీసుకుని, ఇంజనీర్ అవుతానూ అంది. దానికి లోకజ్ఞానం లేదంటావా? లోకం అంటే ఎవరు జీవన్. నువ్వూ, నేనూ, మనలాంటి మనుషులే. నువ్వా అమ్మాయి సినిమాల్లో నటిస్తూందని ఆ పిల్లను ప్రాస్ అన్నావు. నువ్వూ లోకంలో ఒకడివయ్యావు. నువ్వనకుండావుండు. మనల్ని యితరులు అనకుండా వుండాలని కోరుకో- సమస్యే లేదు''

"అయితే నువ్వు కూడా నామాట విననంటావ్?''

"ఎందుకు జీవన్, ఎందుకిలా మాట్లాడుతున్నావ్? ఇంతచిన్నవిషయానికి ఇంత పట్టింపా?''

"ఇంతచిన్నవిషయంలో కూడా నామాటకు విలువలేదన్నమాట!''

"అరే... ఏమిటిది?'' నవ్వింది గౌతమి- "జీవన్, బి ఏ గుడ్ బాయ్. ఒక్క వారం రోజులు ఈవిషయం మర్చిపోయి తరువాత ఆలోచించు. నీకే సిల్లీగా అనిపిస్తుంది''

"అది వుంచుకున్నముండ- మొగుణ్ణీ, పెళ్ళాన్నీ విడదీసింది. తల్లికి కొడుకుని దూరం చేసింది. కన్నవాళ్ళ ఉసురుపోసుకుంది. పాతికేళ్ళు టింగు రంగామని ఊరేగి మిమ్మల్ని తగులుకుంది. దానికి కూతురు బతుకెందుకు, రేపు దానిమీదా డబ్బు సంపాదిస్తుంది. ఉంపుడుగత్తె బుద్ధులెక్కడపోతాయి?'' సరస్వతి చెంప ఛెళ్ళుమంది.

మళ్ళీ గుర్తొచ్చి మనసు చురుక్కుమంది జీవన్‌కు.

"కొడితే పడటానికున్నది కట్టుకున్నపెళ్ళాం. కాళ్ళు పట్టించుకునేది ఉంచుకున్న పెళ్ళాం. మీరింత గొడవచేసి వస్తే తగుదునమ్మా అని మరునిమిషంలో కూతుర్ని మళ్ళీ దానింటికే పంపిందట. వీడేమో దాన్ని వెనకేసుకుని మీమీదకొచ్చాడు. ఉసిగొలిపింది. రోషం వుంటే ఈ మగతనం దానిమీద చూపించండి''-సరస్వతి. మనస్సు భగ్గున మండిపోతోంది.

"ఒక్కవారంరోజులు ఈ విషయం మర్చిపోయి ఆలోచించు. నీకే సిల్లీగా అనిపిస్తుంది''-గౌతమి.

"అసలా మాటకొస్తే దానికి పెళ్ళి కాకపోయినా ఫరవాలేదు'' -బాలు

"అన్నయ్యన్న దాంట్లో తప్పేంవుంది?''-స్వప్న

చప్పున లేచి నిలుచున్నాడు జీవన్-

"గౌతమీ, ఒక్కటేమాట చెప్పు. స్వప్న మీద నాకే హక్కూ లేదా?''

"పిల్లలమీద హక్కులు కోరద్దు జీవన్. బాధ్యతల వరకేమనం'' లేచి నిలుచుంది గౌతమి.

"ఆ బాధ్యతనే నేను హక్కు అనుకుంటున్నాను. అవునంటావా, కాదంటావా?''

"అంత ఖచ్చితంగా అడిగితే కాదనే అంటాను. ఆలోచిస్తే నువ్వూ అదేఅంటావు''.

"బాలూని పంపిస్తావా, పంపించవా?''

"జీవన్, ఎందుకిలా మాట్లాడుతున్నావ్? బాలూ అయితేనేం, స్వప్న అయితేనేం, వాళ్ళేమైనా చిన్న పిల్లలా, కొట్టి తిట్టి చెప్పటానికి?''

"అవును- నేనుకూడా తాళికట్టిన భర్తను కాదుకదా, విడాకులిస్తానో, విడివడిపోతావో అని నువ్వు భయపడటానికి?'' అప్రయత్నంగా అన్నాడు జీవన్.

నివ్వెరపోయింది గౌతమి.

"బాధగా వుందికదూ? నాకెంత బాధగా వుందో ఆలోచించావా? ఇదే నేను నీ తాళికట్టిన భర్తనయితే స్వప్న ఇలా మాట్లాడేదా? నువ్విలా అనేదానివా? సరస్వతి ఇంట్లోంచి బాలూని వెళ్ళగొట్టగలిగాను, అది నా ఇల్లుకనుక. ఈ ఇంట్లోంచి? ఇది నీ ఇల్లుకదా! మరోమాట మాట్లాడితే నన్నే వెళ్ళిపొమ్మంటావు....''

"జీవన్- ప్లీజ్...నువ్వేంమాట్లాడుతున్నావో నీకు తెలియటంలేదు. ఇంటికెళ్ళి తాపీగా కూర్చుని, నువ్వన్నమాటలూ, అనదలచుకున్న మాటలూ కాగితంమీద రాసి చదువుకో... ఎంత అసహ్యంగా అనిపిస్తాయో. అలా అనిపించకపోతే నామొహం చూడొద్దు" సోఫాలో నిస్సత్తువగా కూచుండిపోయింది.

"ఆల్‌రైట్... మళ్ళీ నువ్వు పిలిచేవరకూ నీఇంటికి రాను" విసవిసా నడిచివెళ్ళిపోయాడు జీవన్.

అతను గుమ్మందాటకముందే స్వప్నా బాలూ పరుగున వచ్చి గౌతమికి చెరోపక్క కూర్చున్నారు. ఇద్దరి తలలమీదా చెరొకచెయ్యి వేసింది గౌతమి.

"పూర్‌ఫెలోస్... ఎందుకలా అయ్యారు? సాయంత్రంకల్లా తిరిగొస్తాడు మీ డాడీ"

"సారీ మమ్మీ... పోనీ డాడీ చెప్పినట్టే వింటాను" బెంగగా చూస్తూ అంది స్వప్న.





"స్టుపిడ్... ఏమీ కాదన్నానుకదా. నువ్వెళ్ళి కొంచెం కాఫీ కలుపు. బాలూ... బ్యాంక్‌కు ఫోన్‌చేసి, నేనివ్వాళ రానని చెప్పు. చాలా లేటయింది" మామూలుగా చెప్పింది గౌతమి.

అపనమ్మకంగా చూస్తూ... బిక్కమొహాలేసుకుని ఇద్దరూ కదిలారు.

భారంగా కళ్ళు మూసుకుంది గౌతమి. కనురెప్పల అల్చిప్పలు అశ్రుముత్యాలను లోపలే దాచుకున్నాయి భద్రంగా.

కలతబారిన గుండెలో కదలి అలల జ్ఞాపకాలు మనసు సరిహద్దుల్ని విసురుగా తాకుతున్నాయి.

"తాళికట్టిన భర్తను కాదుకదా, విడాకులిస్తానో, విడిచిపోతానో అని భయపడటానికి?"-తాళికట్టని భర్త.

వేటువేసిన వేటగాడే, పశ్చాత్తాపం పసరు పూసినా, గాయం మానుతుందేమోకానీ మచ్చ మాసిపోతుందా?

"ఒక్కదాన్నీ హాస్టల్‌లో ఎలావుండాలి మమ్మీ?"

"నాకు ఇంత జ్వరం వచ్చినా డాడీ రాలేదేమిటి మమ్మీ?"-కన్నకూతురు.

అనురాగం కరువైన లేతమనసుకు ఉపశమనం ఎలా దొరుకుతుంది? పిడుగుపాటుకు దడిసినప్పుడు దొరకని వెచ్చని ఒడి, వానజల్లు పడుతున్నప్పుడెందుకు?

"అమ్మా గౌతమీ... ఇంకా జీతం రాలేదంటే ఎలా?"కన్నతల్లి.

పిల్లల్ని కనేయంత్రానికి డబ్బునంపాదించే యంత్రంతో వయసు కోరికల సంగీతనాదం వినిపిస్తుందా?

"పాతికేళ్ళొచ్చినా పెళ్ళికాలేదంటే మరోపాతికవేలు కట్నం కావాలి అంటున్నారు"-పెళ్ళిళ్ళ పేరయ్య.

అనుబంధంగా పెనవేసుకోవలసిన దాంపత్యబంధాన్ని డబ్బుతో ముడిపెట్టే సమాజానికి, ముడిపడిన రక్తసంబంధపు బాధ్యతల బరువు అర్థమవుతుందా?

మాటలు, తూటాలు, ఈటెలు, రక్కసికాటులు...

మరచిపోనీయని మనసెందుకుంది?

మరచిపోగలిగితే అసలు మనసెందుకుండాలి?

"మమ్మీ... కాఫీ తీసుకో"

కళ్ళుతెరిచి కాఫీగ్లాస్ అందుకుంది.

"నేను నా ఫ్రెండ్ రూంలో వుంటాను పిన్నీ"

"బాలకృష్ణా, కృష్ణుడు బాల్యంలో దేవకిని విడిచి యశోద దగ్గరికొచ్చాడు. యశోదను విడిచి మళ్ళీ దేవకిని చేరుకున్నాడు. నువ్వా యశోదకు మనస్తాపం కలిగించి దేవకి దగ్గరికి వెళ్ళలేవు. మరెందుకయ్యా వెళ్ళిపోవటం" గొంతు గుండెకు దగ్గరున్నా పెదవి దాటని గుండె పలుకులు.

* * *

"బాలూ, ఒక కథ చెబుతాను- వింటావా?"

చిరునవ్వుతో తలాడించాడు.

"అనగనగా ఒకమ్మాయి...."

"లవ్ ఎఫెయిరన్నమాట...ఊఁ...ఆ తరువాత?"

"ఆ అమ్మాయి తల్లితండ్రులకు యిద్దరే కూతుళ్ళు. తను చిన్నదన్న మాట. వాళ్ళ నాన్నకు తల్లిదండ్రులు సంపాదించి పెట్టిన ఆస్తిపాస్తులు కొద్దిపాటి వున్నాయి. లోకజ్ఞానం బొత్తిగా లేదో లేక పరమ మూర్ఖులో అర్థంకాదు కానీ ఆ తల్లిదండ్రులిద్దరికీ పిల్లలమీద పట్టింపూ, అదుపులు లాంటివి లేవు. పిల్లల్ని ఎందుకు కన్నారో, ఎలా పెంచాలో వాళ్ళకేమీ తెలియదు. అతని ధ్యానంతా వంటనమ్ముకుని ఆడవాళ్ళతో తిరగడం. మరి అందువల్ల ఆవిడ స్వభావం మారిందో, ఆవిడ స్వభావం వల్ల అతనలా తిరిగేవాడో తెలియదు కానీ ఆ అమ్మాయి తల్లి గ్రామ రాజకీయాల్లో దిగింది. సరే... యిక ఎదిగిన ఆడపిల్లలకు యింట్లో ఆలనా పాలనా చూసేవాళ్ళులేరు; ఆపేక్షా లేదు. ఈ పరిస్థితుల్లో పెద్దమ్మాయి, అంటే యిప్పుడు నేను చెబుతున్నమ్మాయి అక్క ఎవరో ఒక కుర్రాడితో కలిసి పారిపోయింది. కొన్నాళ్ళు వాళ్ళు పొరుగూళ్ళో బాగానే వున్నారు. అతను ఏదో వ్యాపారం చేసే వాడట. కలిసి రాలేదు, ఊరంతా అప్పులు మిగిలాయి. తండ్రి దగ్గిరికెళ్ళి కొంత డబ్బు పట్రమ్మని అతను భార్యను పంపించాడు. లేచిపోయిన దానికి చిల్లికానీ యివ్వనన్నాడు తండ్రి. ఈలోగా అతని తల్లితండ్రులు ఈ అమ్మాయిని వదులుకొమ్మనీ, చేసుకున్న పెళ్ళికి పెద్దలు అనుమతి లేదు గనుక అడిగే వాళ్ళూ లేరని అతనికి మరో పెళ్ళి చేస్తామనీ కబురు చేశారు. ప్రేమగా భావించుకున్న తాత్కాలిక ఆకర్షణ మాయమయ్యిందో, ఆర్థిక యిబ్బందుల వల్ల పలాయనభావం జనించిందో, మరో పెళ్ళి చేసుకుని తనవాళ్ళతో కలిసి వుండొచ్చనుకున్నాడో, లేక అతని స్వభావమే అంతో తెలియదు. భార్యని మరోసారి పుట్టింటికి వెళ్ళి డబ్బు తీసుకురమ్మన్నారు. పరిస్థితులన్నీ అర్థం చేసుకున్న ఆ అమ్మాయి, అంటే నేను చెబుతున్నావిడ అక్క ఊళ్ళో పెద్దల ముందు తనగోడు వెళ్ళబోసుకుంది. పెద్దలంతా ఆ తల్లిదండ్రుల్ని పిలిపించారు. లేచి పోయిందన్నమాటే గానీ, చక్కగా పెళ్ళి చేసుకుని సంసారం చేసుకుంటున్నదనీ, ఆర్థికపరిస్థితి బాగాలే

నందున అర్థిస్తున్నదనీ, ఎంత కాదనుకున్నా కన్నకూతురే కదానీ, వాళ్ళకు మాత్రం ఎవరున్నారు కనుక అర్థంచేసుకుని ఆదుకొమ్మనీ చెప్పారు పెద్దలు. తల్లిదండ్రులు ససేమిరా అన్నారు. ఆ అమ్మాయి తిరిగి భర్త దగ్గరికి వెళ్ళలేదు. తమ ఊరి చెరువులో శవంగా తేలింది. ఇంతటితో నేను చెబుతున్న అమ్మాయి అక్క కథ ఐపోయింది.

ఇక నేను చెబుతున్న అసలమ్మాయి విషయం. వాళ్ళ అక్క పెళ్ళి తరవాత నుండీ ఆ అమ్మాయి ఒక రకంగా ఒంటరిదైపోయింది. ఇంట్లో వున్న పాడిగేదెల్నీ, కోళ్ళనీ చూసుకోవటం, వాటి ద్వారా వచ్చే కొద్దో గొప్పో డబ్బు లెక్కలు సరిగ్గా చెప్పకుండా దాచుకుని చదువుకోవటం అంతే ఆ అమ్మాయి దినచర్య. ఇంట్లో తండ్రి వుండడు. ఏవూళ్ళో ఎవరితో తిరుగుతున్నాడో తెలియదు. తల్లి అసలే వుండదు. ఏ మీటింగుల్లో ఎక్కడ పెత్తనాలు చేస్తుంటుందో తెలియదు. దానికి తోడు పంచాయితీ మెంబర్‌గా ఎన్నికవడంతో ప్రధాన మంత్రి అయిపోవాలన్నంత ఆశతో రాజకీయాల్లో పూర్తిగా మునిగిపోయిందామె. ఆకలేసినప్పుడు వండుకోవటం, తినటం, కాలేజీకి వెళ్ళి చదువుకోవటం, ఏ టైంలోనో యింటికొచ్చిన తల్లో, తండ్రో తినటానికి లేదనో, కోళ్ళను కమ్మలేదనో, గేదెలకు కుడితి పెట్టలేదనో, తాము వచ్చేసరికి యింట్లో లేకుండా ముందమోపి కాలేజీకి వెళ్ళిందనో సాకుతో తంతే మౌనంగా భరించటం - అంతే ఆమె బతుకు.

ఈ పరిస్థితుల్లో వాళ్ళ ఊళ్ళోని ఒక ప్రభుత్వ ఆఫీసుకు కొత్తగా ట్రాన్స్‌ఫరై వచ్చిన ఒకాయన వీళ్ళ యింటి పక్కన అద్దెకు దిగాడు. ఆయన భార్య పరమ గయ్యాళి. కానీ ఆ గయ్యాళితనమంతా ఒక్క భర్త దగ్గరే. మిగతా వాళ్ళతో చాలా కలుపుగోలుగా వుంటుంది. ఎటూ పక్కపక్క యిళ్ళ వాళ్ళే అవటంతో ఆవిడతో యీ అమ్మాయికి అప్పుడప్పుడూ కాలక్షేపంగా వుంటూండేది. ఆ భార్యాభర్తలిద్దరికీ ఈ యింటి సంగతులు చాలా త్వరలోనే అర్థమై పోయాయి. అయితే అందుకు కారణమేమిటనే విషయంలో మాత్రం యిద్దరివీ వేర్వేరు అభిప్రాయాలు. ఇలా వుండగా ఆయన భార్య ఏదో పండుగకు పుట్టింటికి వెళ్ళింది. సెలవు లేదనే మిషతో ఈయన వూళ్ళోనే వుండి పోయాడు. పక్కింటి అంకుల్ వంటకు యిబ్బంది పడకుండా తను చేసిన పదార్థాలు అందిస్తుండేదీ అమ్మాయి. అలాంటి సందర్భాలలో తన భార్యతో తను పడుతున్న పాట్లన్నీ ఏకరువు పెట్టుకుని, ఆ అమ్మాయి పడుతున్న బాధలకు సానుభూతి చూపించి, ఆమె సానుభూతిని సంపాదించుకున్నాడీ అంకుల్. నెలరోజుల కల్లా అంకుల్ గారి ఆంటీ తిరిగి వచ్చేసింది.

తిరిగొచ్చిన ఆంటీ తనకు మూడోనెల గర్భమనీ, మెన్సస్ ట్రబుల్ అనుకున్నది తప్పనీ చెప్పింది. అంకుల్‌తో పాటు ఈ అమ్మాయీ సంతోషించింది. ఎందుకంటే వాళ్లకు పదేళ్ళకొడుకు ఒక్కడే వున్నాడు. ఆ తరువాత పిల్లలు కలగలేదు. పల్లెటూళ్ళో వైద్య సౌకర్యాలు తక్కువని ఆంటీని ప్రేమగా తల్లిదండ్రుల దగ్గరికి పంపించాడు అంకుల్. ఈ అమ్మాయితో అంకుల్ సాన్నిహిత్యం ఎక్కువయింది. ఇంతమంచి అంకుల్‌ను ఆంటీ ఎందుకు రాచి రంపాన పెడుతుందో అర్థంకాక ఈ అమ్మాయి జాలిపడుతుండేది.

ఒకటి, రెండువారాలు గడిచాయి. అంకుల్ ఒకసారి అత్తవారింటికి వెళ్ళి ఆంటీని చూసివచ్చాడు. ఆ తరవాత ఒకరోజున ప్రేమగా ఏదో కూల్‌డ్రింక్ అందించాడు. అది తాగేసిన ఆ అమ్మాయిని, సగం స్పృహ వుండీ, సగం నిద్రావస్థలోనూ వుండగా శారీరకంగా అనుభవించాడు. తను కొద్దిగా తాగివున్నాననీ, పొరపాటున తను తాగాల్సిన విస్కీ కలిపిన డ్రింక్ ఆమెకిచ్చాననీ, తనను క్షమించమని వేడుకున్నాడు, పశ్చాత్తాప పడ్డాడు. కంటనీరు పెట్టుకున్నాడు. వేటగాడి కన్నీరు చూసి లేడిపిల్ల కరిగిపోయింది, తను వలలోకి నడుస్తున్నానని తెలియక.

"ఆంటీకి పల్లెటూళ్ళంటే అసహ్యం. ఆమె అంకుల్‌ను వేధించటంలో అది కూడా ఒక కారణమని అంతకుముందే గ్రహించిందా అమ్మాయి. అదేవిషయం నొక్కిచెప్పాడు అంకుల్. కొడుకు చదువుకూడా పాడవుతుంది కనుక ఆంటీని టౌన్లో ఉంచేస్తాననీ, ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుని తనతో తనదగ్గర ఉంచు

కుంటాననీ చెప్పాడు. నమ్మేసింది. ఒకసారి పొరపాటుగా జరిగింది మళ్ళీ జరిగింది. ఇద్ద రూ భార్యాభర్తలలాగా కాపురంచేశారు. ఆంటీ ప్రసవించింది. ఈ అమ్మాయికి నెలతప్పింది. ఏవేవో మాటలుచెప్పి అబార్షన్‌కు ఒప్పించా డు. టౌన్లోవున్న ఒక లేడీడాక్టర్ దగ్గరికి వెళ్ళా రు. తొలిచూలు గర్భం తీసేస్తే మళ్ళీ గర్భం నిలవటం కష్టమనీ, మంచిదికాదనీ ఆమె నచ్చజెప్పింది. కానీ వినేవరిస్థితి లేదు. ఆ అమ్మాయి ఏడ్చి మొత్తుకుంటే, తననర్థంచేసు కొమ్మని అంకుల్‌కూడా ఏడ్చాడు. చివరికి ఆ డాక్టర్ దగ్గర పనిచేస్తున్న నర్స్ తన ఇంట్లో గర్భస్రావంచేయటానికి ఒప్పుకుంది. ప్రా ణంమీదికొచ్చింది పరిస్థితి. సాయంత్రంకల్లా ఊళ్ళోవుండాలి. బాధనంతా బలవంతాన సహిస్తూ ఇల్లు చేరుకున్నాదా అమ్మాయి.

"జీవంలేనట్టు పడివున్న కూతుర్ని తల్లి దండ్రులు అంతగా పట్టించుకోలేదు. కోలుకోవ టానికి నెలరోజులుపట్టింది. ఈ నెలలో అంకు ల్‌మొహం చాటేశాడు, ప్రసవించిన భార్యను చూసుకోవాలన్న మిషతో. ఇంతలో అతనికి మరో ఊరికి ట్రాన్స్‌ఫరయింది. వెళ్ళిపోతానన్న అంకుల్‌ని ఈ అమ్మాయి నిలదీసింది- తనకు అన్యాయంచేయొద్దని ప్రాధేయపడింది. తల్లి దండ్రుల ధోరణివల్ల కొంతా, శారీరక అను భవం పంచుకున్నవాడినే పెళ్ళిచేసుకోవాలన్న సిద్ధాంతం రక్తంలో యింకిన దేశంలో పుట్టి నందువల్లా, అతనిమీద ఆశలుపెట్టుకు న్నందువల్లా అతనితోనే తన బతుకని అనుకు న్నట్టుంది ఆమె. మరొక్క సంవత్సరమైతే బియ్యే పూర్తయిపోతుందని అంకుల్ నచ్చజె ప్పాడు. వినలేదు. విధిలేక ఇక తమ రహస్యం అందరికీ చెప్పేస్తానని బెదిరించింది.

"అంకుల్ విస్కీ బాటిల్ ముందరపెట్టు కుని తాపీగా ఆలోచించాడు. పోనీ పెళ్ళిచేసు కుంటానని ఒప్పుకున్నందువల్ల నష్టమే ముంది. టీనేజ్‌లోవున్న అందమైన అమ్మాయి. తన భార్య ఎటూ టౌన్‌లోనే వుంటానంటూంది. కొడుకు చదువూ కుదురుగావుంటుంది. పల్లె టూళ్ళో తనకు ఒంటరితనం ఉండదు. వండి వార్చటానికీ, సంసారంచేయటానికీ, తను ఎక్క డతిరిగితే అక్కడికి తనవెంట పక్కన అందంగా, హుషారు కలిగిస్తూ తోడుగా వుంటుంది. చదువుకున్నది. ఆ చదువు ఒక్క సంవత్సరమూ పూర్తయితే ఎక్కడైనా ఉద్యోగం దొరకొచ్చు. తన ఖర్చులకూ ఇబ్బందివుండదు. అంతే- ఒప్పుకున్నాడు.

ట్రాన్స్‌ఫరై కొత్తగా ప్రవేశించిన ఊళ్ళో ఇద్ద రూ భార్యాభర్తలుగా ప్రవేశించారు. ఎంతో ప్రాధేయపడినమీదట, ఇంట్లో దేవుడి ముందర, ఆ అమ్మాయి ముడేసియిచ్చిన తాళిని మాలవేసినట్టుగా మెడలోవేశాడు. తన జీవితం గట్టెక్కిందనుకుని హాయిగా ఉందాఅ మ్మాయి. కొన్నాళ్ళకు ఆంటీకి ఈ విషయం తెలిసింది. ఊళ్ళోకొచ్చి నానాగొడవాచేసింది. ఆ అమ్మాయిని జుట్టుపట్టి వీధికీడ్చి కొట్టింది. అంకుల్ కిక్కురుమనలేదు. అన్నిరోజులుగా ఆ అమ్మాయి కుదురునూ, మంచితనాన్నీ కలుపుగోలుతనాన్నీ చూసిన ఊళ్ళోవాళ్ళే ఆంటీని శాంతింపచేసి, జరిగిందేదో జరిగిపో యిందని నచ్చజెప్పి, బలవంతాన ఆమెనూ, వెంటవచ్చిన ఆమె బంధువుల్నీ పంపించేశా రు.

అంకుల్‌కు ఆంటీ పోరుఎక్కువైంది. ఇల్లు గడపటానికి మరిన్ని డబ్బులు కావాలని పీ డించటం ఎక్కువైంది. ప్రైవేట్‌గా థర్డియర్ రాసి, బియ్యే పాసయిందా అమ్మాయి. ఉద్యో గంచేస్తూ విడిగావుండటం యిష్టంలేని ఆ అమ్మాయి అంకుల్ పోరు భరించలేక రిటెన్ టెస్టులు రాసినా, కావాలని ఫెయిలయింది. ఇంతలో మరో ఊరుకు ట్రాన్స్‌ఫరయింది. ఆ ఊళ్ళోని కాన్వెంట్‌లో టీచర్‌గా చేరిందా అమ్మాయి. ఏడాదిపాటు బాగానే గడిచింది. అంకుల్‌కు మళ్ళీ ట్రాన్స్‌ఫరయింది. ఒంట రిగా పాత ఊళ్ళో టీచర్‌గా ఉండటానికి ఆ అమ్మాయి యిష్టపడలేదు. గొడవయింది. చివ రకు మూడొందల రూపాయల ఉద్యోగంకన్నా ఆమె తనతోఉండటమే మంచిదనుకుని కొత్త ఊరికి చేరుకున్నాడు అంకుల్.

ఏడాదికోసారి ట్రాన్స్‌ఫర్‌ల సంగతి క్ర మంగా అర్థమయిందా అమ్మాయికి, ఆఫీస్‌లో ఫ్రాడ్‌చేయటం, లెక్కలు తారుమారుచేసి ఆఫీ సర్‌తో పంచుకోవటం, మరో ఊరికి ట్రాన్స్‌ఫర్‌చే యించుకోవటం- అక్కడా తతంగం. జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లోవున్న సెక్షన్‌లోని ఆఫీసర్‌ను

మంచిచేసుకుని సాగిస్తున్నాడు. ఈ మధ్యలో ఆ అమ్మాయికి మరి మూడుసార్లు అబార్షన యింది. చివరిసారి ఆమె గోలచేసింది. అసలు పిల్లలుపుట్టకుండా ఆపరేషన్‌చేయించుకొ మ్మని అతనన్నాడు. ఆపరేషన్‌కాకుండా అబా ర్షన్‌వరకు మాత్రం రాజీపడిపోయిందామె.

"ఇంతవరకూ ఈ ఒక్కవిషయం తప్ప ఇద్దరిమధ్యా పెద్ద గొడవలేమీలేవు. అసలు గొడవ అంకుల్‌కు మరో ఊరికి ట్రాన్స్‌ఫరవ టంతో మొదలయింది. అక్కడ ఆఫీసర్‌మూ లంగా అంకుల్ ఆటలుసాగలేదు. ఖర్చుకల వాటుపడిన ప్రాణం గిలగిల్లాడింది. ఈలోగా పాత చిట్టాలన్నీ బైటపడ్డాయి. అంకుల్ సస్పెండయ్యాడు. భారీయెత్తున లంచంపెడి తేగానీ అందులోంచి బైటపడే మార్గంలేదు. ఉద్యోగంలేనప్పుడు నమ్మి డబ్బెవరిస్తారు? ఒక పరిచయస్తుడు మధ్యవర్తిద్వారా అడిగినంత సొమ్మియిస్తానని ఒప్పుకున్నాడు. తన మధ్యవ ర్తిని కృతజ్ఞతలతో ముంచెత్తాడు అంకుల్. ఇద్దరూ బార్‌కెళ్లారు, పార్టీచేసుకున్నారు. అక్కడ ఆ మధ్యవర్తి అసలువిషయం చెప్పా డు. డబ్బిస్తానన్న పెద్దమనిషి కావాలంటే ఊరి కినే యిస్తానన్నాడు. కాకపోతే ఎటూ కట్టుకున్న పెళ్లాంకాదు కనుక తనకా అమ్మాయి కొంత కాలం కావాలన్నాడు. ధర్మరాజు, హరి శ్చంద్రులే ఆదర్శంగా ఒప్పుకున్నాడా అంకుల్.

"ఈమధ్యలో ఆ అమ్మాయికి ఒకతను పరి చయమయ్యాడు. అతనితో జరిగినదంతా చె ప్పుకుని, అంకుల్‌గానీ తన నిర్ణయం మార్చుకో కపోతే అతన్ని కసిదీరా పొడిచి చంపేసి తను జైలుకెళతానందా అమ్మాయి. అది మంచిదికా దని అతను వారించాడు. ఆమె వినలేదు. అంతగా అయితే అతన్నుంచి విడిపోయి బత కమన్నాడు. ఒంటరి ఆడదానికి రక్షణలేని సమాజంలో బతకలేకనే కష్టమో, నిష్ఠూరమో అంకుల్‌నే నమ్ముకుని బతకాలనుకున్నాననీ, అతను అలాంటి ప్రయత్నమేచేస్తే తను అన్నింతపనీచేస్తాననీ తన నిస్సహాయతను వెళ్ళబోసుకున్నదామె.

"భర్తలాంటివాడే దగాచేస్తుంటే, అన్న లాంటివాణ్ణో, తమ్ముడిలాంటివాణ్ణో నమ్ముకుని, నిస్సహాయస్థితిలో ఎడారిలోకంలోకి ఒంటరిగా అడుగుపెట్టటంలోని ఔచిత్యం ఏమిటనుకు న్నాడు అతను. ఆమె జీవితాన్ని సంబద్ధం తన బాధ్యతకాదు. కానీ చూస్తూ చూస్తూ ఒక స్నేహితురాలిని ఆమె మానానికి ఆమెను వది లేసి ఎలాఊరుకోగలడు? అతనికీ అంతువట్ట లేదు"

★ ★ ★

"డామిట్... నాకు పిచ్చెక్కిపోతూంది. ఏంచే యాలో ఎలా చెప్పాలో అర్థంకావటంలేదు"

"నువ్వెందుకు రోనీ- నాగురించి సతమత మవటం? నీకు చేతనైన సహాయంచేశావు అదిచాలు" అంది రేవతి.

"మీ విషయంకాదు... నా విషయమే నేను ఆలోచిస్తున్నది"

"నీ విషయమా ఏమిటో చెప్పు?" ఆశ్చ ర్యంగా అడిగింది.

"అదే ఎలా చెప్పాలో తెలియటంలేదు"

"నాదగ్గరెందుకు సంకోచం. చెప్పు... ఏమిటో?"

"ఉహు... ఎలా చెప్పాలో ఎంత ఆలో చించినా తోచటంలేదు"

"ఇదెక్కడి గోలయ్యా బాబూ... అసలు ఏ విషయం గురించో సూచనగానైనా చెప్పు" నవ్వుతూ అంది రేవతి.

మాట్లాడకుండా సిగరెట్ అంటించుకుని, గదిలో అటూయిటూ తిరగసాగాడు. కాస్సేపటి కి రేవతి మళ్ళీ అంది-

"నేనంటే పిచ్చిదానిలాగా నీకు అన్నీ చెప్పు కున్నాను. నువ్వుచాలా గొప్పవాడివికదూ. నీకు నేనిచ్చే సలహా పనికొస్తుందో రాదో అటుంచు- కనీసం చెప్పొచ్చుకదా?"

"ఇలాకాదు- నేనోగంటసేపట్లో వస్తాను. ఏమీ అనుకోకండి" అంటూ చకచకా బైటికి నడిచాడు.

రేవతి టైంచూసుకుంది. ఆరుంబావ యింది. ఆరున్నర, ఏడు, ఏడున్నరయింది. ఏడూనలభై, ఏడూయాభై, ఎనిమిది, ఎనిమిదీ అయిదు...

గదిలోకొచ్చాడు రోనీ. ఒక కవర్ రేవతి చేతిలో పెట్టి-

ఇది చదవండి. నెలలిగా టితాగేసి వస్తా ను. మీక్కావాలా?" అన్నాడు.

"ఎందుకయ్యా యింత సిగ్గు" కవర్ చించుతూ అంది రేవతి నవ్వుకుంటూ.

"సరే... మీకు టీపంపించమని చెబుతా ను" అనేసి, చప్పున బైటికెళ్ళిపోయాడు.

రేవతికి టీపంపించమని చెప్పి, లాడ్జింగ్ బైటకు నడిచి, పక్కనున్న ఇరానీ రెస్టారెంట్‌లో కూర్చుని, సిగరెట్‌మీద సిగరెట్ వెలిగిస్తూ తను రాసిన ఉత్తరం మననం చేసుకుంటున్నా డు.

"రేవతిగారూ...

ఇన్నాళ్ళ స్నేహం కాలపరిమితి తక్కువే అయినా మీరు నన్ను కొద్దిగానైనా అర్థంచేసుకు న్నారనుకుంటాను. నేనుకూడా మిమ్మల్ని కొంత వరకు తెలునుకోగలిగాననుకుంటున్నాను. అందుకే మీసమన్య గురించి ఆలోచించి, నేనో సమన్య తెచ్చుకున్నాను. నన్ను సరిగ్గా అర్థంచే నుకుంటారనే ఆలోచనతోనే యిలా రాస్తున్నా ను.

మీ సమన్యకున్న ఏకైక పరిష్కారం మీరు మరో పెళ్ళిచేనుకోవటమే. కానీ మీరన్నట్టు ఈ మగవాళ్ళ లోకంలో స్త్రీమనసుని అర్థంచేను కుని మిమ్మల్ని పెళ్ళిచేనుకునేవారు మీకు తటస్థపడటం కొంచెం కష్టమేకావచ్చు. కానీ లోకంలో అన్నిరకాల మనుషులు వుంటారు.

ఇలా ఆలోచించిన తరవాత మీ గతాన్ని గురించి ఆలోచించకుండా, అందులో తప్పేమీ లేదని మిమ్మల్ని అర్థంచేనుకునే ఒక మగవా డు మీకు దొరకాలని మనస్ఫూర్తిగా కోరు కుంటున్నాను. కానీ నాకోరిక నాకే విచిత్రంగా అనిపించింది. ఎదుటివాడుచేస్తే బాగుండు ననే పనిని మనమే ఎందుకు చేయకూడదను కున్నాను. అందుకే, ఆ మగవాణ్ణి నేనే ఎందుకు కాకూడదనిపించింది.

ఐతే మీ అభిప్రాయం కూడా తెలునుకోవాలి కదా? అదే అడగలేకపోయాను. మీరుకూడా నన్ను పెళ్ళిచేనుకోదలిస్తే, నాకు మీగురించి కొంత చెప్పుకోవాలి. అదే చెబుతున్నాను.

నా చదువూ, ఉద్యోగమూ, ఆర్థిక పరిస్థితీ మీకు తెలును. మీరుకూడా చదువు కున్నారు. మీరు ఉద్యోగం చేస్తానంటే వద్దనను. చేయ నంటే బలవంతంపెట్టను. మిమ్మల్నిప్రే మించాననీ, మీరులేకపోతే బతకలేననీ చెప్ప ను. అలాగే మీపరిస్థితికి జాలిపడి, సానుభూ తితో ఈనిర్ణయం తీసుకున్నాననీ అనుకోవద్దు. ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఒకర్ని పెళ్ళిచేనుకోక తప్పదు. ఆ పెళ్ళిచేనుకునేదేదో ముక్కూ మొహం తెలియని అమ్మాయిని చేనుకునే కంటే యింతగా పరిచయంవుండి, ఎంతో కొంత తెలిసినమ్మాయిని చేనుకోవటంకొంచెం మెరుగుకదా అనే ఆలోచించాను. ముఖ్యంగా యింతవరకూ నేనే అమ్మాయినీ పెళ్ళిచేనుకో వాలనే దృష్టితో చూడలేదు. జీవితంలో పూర్తిగా స్థిరపడకుండా పెళ్ళిగురించి ఆలోచించటం అనవసరమనుకున్నాను. పొద్దున మీరు మీగు రించి చెప్పేటంతవరకూ మీగురించి కూడా అలా ఆలోచించలేదు. కానీ ఆతరవాత వగ లంతా యిందులోని సాధ్యాసాధ్యాలు, మంచి చెడులూ తర్కించుకుని ఈ నిర్ణయానికి వచ్చా ను. అదే మీకు చెబుదామని సాయంత్రం మీదగ్గరికొచ్చాను. ముఖతా చెప్పలేకపోయాను. అందుకు సంకోచం ఒక్కటే కారణంకాదు. ఉత్తరంద్వారానైతే నేను చెప్పదలుచుకున్న విషయాన్ని స్పష్టంగా, అనుకున్నది అనుకున్న ట్టుగా చెప్పవచ్చుననీ; హఠాత్తుగా మిమ్మల్ని ఈవిషయం అడిగి అయోమయంలో పడేసే కంటే ఉత్తరంగారాస్తే, ఒకటికి రెండుసార్లు చదువుకుని ఆలోచించుకోవటానికి మీకూ వీలుగా వుంటుందనే ఉద్దేశంతో ఇలా చేస్తున్నా ను.

ఇక మన పెళ్ళివిషయం. వరసగురించి ఆలోచించి మాత్రం వద్దని నిర్ణయం తీనుకో కండి. కన్నతల్లి చెల్లెలో, తండ్రి రెండో భార్యో అయితే 'పిన్ని' అనుకోవచ్చుకానీ ఈమాత్రానికి మనకు వావివరుసలు అడ్డొస్తాయని అనుకో కండి. ఎవరైనా ఏమైనా అనుకుంటారేమోనని సంకోచించవద్దు. ఇలాంటి అభ్యంతరాలేమైనా వుంటే తీరిగ్గా చర్చించుకోవచ్చును.

ఇక మీకు నామీద అలాంటి అభిప్రాయం లేకపోతే నన్నుతప్పుగా అర్థంచేనుకోవద్దు. ఇన్నాళ్ళ సాన్నిహిత్యాన్ని అపార్థంచేనుకున్నా ననీ అనుకోవద్దు. అలాగే నన్ను పెళ్ళిచేనుకోవా లనే ఆలోచన లేకపోయినా, అనలు పెళ్ళిచేను

కావాలన అలోచన లేకపోయినా మరి అతనితో గొడవవడుతూ కలిసుండటం యికముందు మంచిదికాదనే నాఅభిప్రాయం. ఆలోచించి నిర్ణయం తీసుకోండి. మీ నిర్ణయం ఏదైనా నేను మీస్నేహితుణ్ణనీ, నన్ను ఏసహాయమైనా కోరవచ్చనీ మాత్రం గుర్తుంచుకోండి.

ఇక మీనిర్ణయం తెలవటానికి మీకు సంకోచం అడ్డురావచ్చు. నేను సరిగ్గా తొమ్మి దింపావుకు మీగది దగ్గరికొస్తాను. మీరు నాఆ లోచనను సమర్థించి నాతో ఏకీభవిస్తే లైటువెలి గించే వుంచండి. లేదూ, ఒక్క అయిదు నిమి షాలపాటు దీపం ఆర్పేయండి. నేను మిమ్మల్ని మరునాడు ఎప్పటిలాగా, మామూలు రోనీగా కలుస్తాను. అప్పుడు నన్ను తిట్టుకోకండి.

ఇది మీ జీవితసమస్య. సరిగ్గా ఆలోచించు కుని మీమనసుకు నచ్చిన నిర్ణయం తీసు కోండి.

ఇట్లు,
రోనీ.

తీవ్రంగా ఆలోచనలో మునిగిపోయాడు రోనీ. తను ఏమని నిర్ణయించుకుందో. తనతో ఏకీభవిస్తే మంచిది. ఆమె జీవితానికి ఒక మార్గం దొరుకుతుంది. తనకూ ఒంటరితనపు జీవితం తప్పుతుంది. తను కూడా ఎవరో ఒకమ్మాయిని పెళ్ళిచేసుకోవలసిందే కదా. ఇన్నాళ్ళూ ఆ దృష్టితో చూడలేదుకానీ ఆమెతో తన జీవితం సాఫీగా గడిచిపోతుంది. కా దంటుందా, సరే... అప్పుడు తన విషయం వదిలేసి ఆమెను అంకుల్ బారినుంచి ఎలా తప్పించటమో అప్పుడు ఆలోచించొచ్చు. హొ టల్లోని వాల్‌క్లాక్ గంటలు వినగానే బిల్లు చెల్లించి బైటకొచ్చాడు. పాకెట్లో మిగిలిన ఒక్క సిగరెట్టూ అంటించుకుని, మరో పాకెట్ కొను క్కుని, తాపీగా హొటల్‌వైపు నడకసాగించా డు.

లోపలికి నడిచి రిసెప్షన్ వైపు చూశాడు. అక్కడ కోటేశ్వరయ్య లేడు. లైట్ వెలుగు తుంటుందా, మరి వేసి వుంటుందా? మెట్ల వైపు నడిచాడు. ఒక్కొక్క మెట్టునూ అతి నెమ్మదిగా దాటుతూ, మెట్ల మలుపులో ఆగిపో యాడు. మలుపు తిరగ్గానే గది వెంటిలేటర్ దూరం నించి కనిపిస్తుంది. మలుపు తిరిగేయ గానే విషయం తెలిసిపోతుంది. చేతిలో సిగ రెట్ పడేసి, దాన్ని నలిపేసి, మలుపు కిటువై

"మెట్లెక్కేవరకూ కూడా సిగరెట్ లేకుండా వుండలేరా?" మెట్లకు అటునించి వచ్చి మలు పులో ఆగిపోయి ప్రశ్నించాడు కోటేశ్వరయ్య నవ్వుతూ.

"అబ్బే... అదేం లేదు. మీరేమిటి కౌంటర్ వదిలేసి యిలా వచ్చారు?" అక్కడే నిలుచుని అడిగాడు.

"పని వున్నప్పుడు తప్పదుకదా. అయినా మీ అంకుల్ గదికే వెళ్ళాను"

"అంకులున్నాడా?"

"లేదు... కాసేపు వెయిట్ చేయండి వస్తా రేమో. మీ పిన్నిగారొక్కరే వున్నారు" మెట్లు దిగబోయాడు కోటేశ్వరయ్య.

ఇక తప్పనిసరిగా పైకెక్కడానికి కాలు సాచా డు రోనీ.

కరెంట్ పోయింది. ముందుకు అడుగే యాలా, వద్దా సంకోచంలో వడ్డాడు రోనీ.

"రండి... రండి మీ పిన్నిగారెందుకో అర్జెంటుగా నాలుగు డజన్ల క్యాండిల్స్ తెప్పించమన్నారు. సమయానికి బాయ్ లేడు. నేనే తెచ్చిచ్చాను. ఓ క్యాండిల్ అప్పుతీసు కుని, రిసెప్షన్‌లోకెళ్ళాలి" రోనీతో పాటు నడు స్తూ చెప్పుకుపోతున్నాడు కోటేశ్వరయ్య.

గది ముందు ఆగగానే ఏదో తమాషాగా అనిపించింది వరధ్యానంగా, అయిష్టంగా నడు స్తున్న రోనీకి. గదిలో వెలుగుంది. గమ్మత్తయిన వెలుగు.

"ఒక క్యాండిల్ అప్పిస్తారేమోనని వచ్చాను. కరెంట్ పోయింది కదా" కోటేశ్వరయ్య వెనకవు న్న రోనీని గమనించలేదు రేవతి. టేబుల్‌పైన నిలబెట్టి వున్న కొవ్వొత్తుల్ని ఒక వెలుగుతున్న కొవ్వొత్తితో ఒక్కొక్కటీ వెలిగిస్తూ, తల కొంచెం పక్కకు తిప్పి-

"సారీ... ఏమీ అనుకోవద్దు. ఇందులోంచి ఒక్కటి కూడా యివ్వలేను" బదులిచ్చి, మిగ తా కొవ్వొత్తుల్ని వెలిగించటంలో మునిగిపో యింది.

"సెంటిమెంట్ అనుకుంటాను. తెలియక అడిగినందుకు నేనే సారీ చెప్పుకోవాలి. అవు

[illegible], ఇన్ని కొవ్వొత్తులెందుకు? మీవా అయితే మీ వయస్సు ఇరవై నాలుగేళ్ళుంటుందేమో- అంతేకదా?'' కుతూహలంగా అడిగాడు కోటేశ్వరయ్య.

తలతిప్పకుండానే సమాధానం చెప్పింది రేవతి, కొవ్వొత్తులంటించటంలో మునిగిపోయి—

"అవునండీ... సరిగ్గా నా వయసు యిరవై నాలుగేళ్ళు. కానైతే, ఇరవై నాలుగేళ్ళ వయసుతో యివాళ కొత్త జన్మ ఎత్తాను. అందుకని నలభై ఎనిమిది మైనపు వత్తులు. ఇవ్వనందుకు మీరేమీ అనుకోరు కదూ''

"లేదండీ... నేనిక వెళ్తాను'' కోటేశ్వరయ్య వెళ్ళిపోయాడు.

గుమ్మం పక్కన కీనీడలో నిలుచుని ఓరకంట రేవతినే గమనిస్తూ, ఆమె ఈ లోకంలో లేదని గ్రహించి, గుమ్మం మధ్యలో నిలుచున్నాడు రోనీ. దీపసుందరిలాగా గదిలో క్రమక్రమంగా వెలుగును హెచ్చిస్తున్న రేవతి చివరి కొవ్వొత్తి కూడా అంటించేసి, తన చేతిలో వున్న కొవ్వొత్తిని కూడా నిలబెట్టేసి, అరచేతి వెనుక భాగంతో నుదుట పట్టిన చిరుచెమటను తుడుచుకుంటూ, ఇటు తిరిగి, తననే తదేక దీక్షగా చూస్తూ నిలుచున్న రోనీని చూసి చిరునవ్వు నవ్వింది.

"మన ఎలక్ట్రిసిటీ వాళ్ళ మీద నాకు నమ్మకంలేక ముందుగానే జాగ్రత్త పడ్డాను'' నవ్వుతూ అంది. ఆ నవ్వులో స్వచ్ఛత, సంతృప్తి నిండివున్నాయి.

"థాంక్స్'' లోపలికి నడుస్తూ అన్నాడు రోనీ.

"కంగ్రాచ్యులేషన్స్ చెబుతావనుకున్నాను''

"ఎందుకు?''

"నీలాంటి నేస్తం దొరికిన నా అదృష్టానికి, నేను మంచి నిర్ణయం తీసుకున్నందుకు, నా జీవితం ఒక మలుపు తిరిగినందుకు''

ఏమనాలో చప్పున తోచక మౌనంగా ఊర్కున్నాడు రోనీ.

"కూర్చో రోనీ''

"ఊహుఁ... మీకెలాగుందో కానీ నాకు మాత్రం చాలా సంతోషంగా వుంది. గుండెలపైనించి ఏదో భారం తొలగిపోయినట్టూ, మనసు తేలిపోతున్నట్టూ అనిపిస్తోంది''

"ఇంకా నన్ను 'మీరు' అని పిలవకు''

"అలవాటయిందికదా. సరే... రేపట్నించి 'నువ్వు' అనటం అలవాటు చేసుకుంటాను''



".....మనం రిజిస్టర్ మ్యారేజ్ చేసుకుంటే నీకేమైనా అభ్యంతరమా అనడిగిందా అమ్మాయి. అభ్యంతరమేమీ లేదు. అసలు నువ్వే బాజాబజంత్రీలు కావాలంటావేమోనని ఆలోచిస్తున్నాను'' అన్నాడతను

"ఇక అవు రోనీ... ఇంకా అతను, ఆమె - ఎందుకు? నాకు అర్థమైపోయింది. ఆ అమ్మాయి రేవతి, అతను రోనీ- అంతే కదా?'' నవ్వుతూ అన్నాడు బాలూ.

"సరే... ఈ విషయంలో నీ అభిప్రాయమేమిటి?''

"వరసల గురించా? అవన్నీ మనం కల్పించుకున్న వేకదా. అయినా చెల్లెలి వరస అమ్మాయిల్ని పెళ్ళిచేసుకునేవారున్నారు. మరి దానికేమంటాము? అదీకాక, కేవలం మీ దూరపువరస బాబాయ్‌తో కలిసున్నంత మాత్రాన ఆవిడ నీకు పిన్ని అయిపోయినట్టేనా? అవన్నీ ఏమీ ఆలోచించవద్దు. నువ్వు చేసినపనికి నిజంగా నిన్ను మెచ్చుకుంటున్నాను''

"నువ్వో మరొకరో నన్ను మెచ్చుకోవాలని నేనీ పెళ్ళిచేసుకోవటంలేదు బాలూ! నాకోసం నేను చేసుకుంటున్నాను. నా ఆలోచనమేరకు చేసుకుంటున్నాను అంతే. నీలాంటి స్నేహితులు సరిగ్గా అర్థంచేసుకుంటే మరీ సంతోషం''

"ఆనందంగారి గురించి తెలుసానీకు?''

town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk of the to



"నాక్కూడా స్వప్న చెప్పింది. ఆవిడేమో కట్టుకున్న భర్తను తప్పించుకుని రెండోపెళ్ళి అతన్ని చేసుకుని, నాలుగో ముడిగా స్థిరపడి జీవితం సరిదిద్దుకుంది. ఇక రేవతి, మీ అంకుల్కు నాలుగో ముడిగా స్థిరపడదామనుకుని, అతనితో వేగలేక నీతో నాలుగోముడి వేయించుకుని స్థిరపడబోతూంది. ఆడవాళ్ల జీవితాల్ని మగవాళ్ళు శాసిస్తారన్నమాట నిజమేననిపిస్తూంది కదూ?"

"నాకలా అనిపించటం లేదు. మగవాడి మాటను శాసనంగా తలదాల్చకుండా, తమ జీవితం గురించి తాము నిర్ణయం తీసుకుని వీళ్ళిద్దరూ మగాళ్లకు బుద్ధి చెప్పారనిపిస్తూంది" అన్నాడు రోనీ.

"ఈ విషయం ఏమోకానీ మా పిన్ని విషయమే నాకు బెంగగా వుంది"- విచారంగా అన్నాడు బాలూ.

"ఏమైంది... మీ డాడీకి ఇంతవరకూ కోపం పోలేదా?"

"ఎలాపోతుంది, తను మగవాడుకదా. పిన్ని ఏమైనా తాళికట్టిన భార్య కనుకనా ఆమె ఏమయిందో ఆలోచించడానికి? ఎవరో ఏదో అన్నారని పంతంపట్టి కూర్చున్నాడు. అసలు యింతవరకూ పిన్ని డాడీ ఎప్పుడూ తగువు పడినట్టు నేనూ చూడలేదు. ఏవో మామూలు విషయాలు, ఒకటి రెండు రోజులు డాడీ అలిగేవాడు- ఆ తరువాత సర్దుకునేవారు"

"మీ పిన్ని ఏమంటూంది?"

"పిన్ని ఎప్పుడూ తనమనసులో బాధ బైటికి చెప్పదు. డాడీని చేసుకున్నప్పుడే తను ఇలాంటి జీవితం గడపబోతున్నదని అర్థంచేసుకున్న దానిలాగా అన్నిటికీ సర్దుకునిపోతూంది. కానీ ఇది మాత్రం పిన్నికి నిజంగా షాక్ అనుకోవాలి. సగం కారణం నేనుకదా! నేనొచ్చి నీ రూంలో వుందామనుకున్నాను. కానీ అందువల్ల పిన్నిని మరింత బాధపెట్టినట్టవుతుందనిపించి ఊరుకున్నాను. రిజల్ట్స్ వచ్చి డిగ్రీ చేతికొస్తే వెంటనే ఏదో ఒక ఉద్యోగం చూసుకోవాలి"

"మరి ఈ విషయం ఒక దార్లోకొచ్చేదెలా?"

"నన్నడుగుతావేం... నీకు తెలియనట్టు"

"ఒకటి మీ డాడీకి, పిన్నికీ ఎక్కువగా భేదాభిప్రాయాలు తలెత్తలేదన్నావు కనుక నెమ్మదిగా మీడాడీయే సర్దుకుపోవచ్చు. అలా ఎందుకన్నానంటే ఈ మనుషులు కొన్ని విషయాలను గురించి ఎంతగా మనసు నొప్పించేట్టు మాట్లాడుతారో నాకు తెలును. అందుకే ఎవరో అన్న మాటలు దృష్టిలో పెట్టుకుని, వాటిని తేలిగ్గా తీసేయలేక, నిజంగా అలాగే జరుగుతుందేమోనన్న అభిప్రాయంతో మీ డాడీ ఇలా ప్రవర్తించి ఉండవచ్చు. అందువల్ల నిదానంగా ఆలోచించి, తను అనవసరంగా తొందరపడ్డాననీ, లక్షమంది లక్షరకాలుగా అనుకున్నప్పటికీ లక్షన్నొకటోరకంగా ఎందుకు జరగకూడదు, మనుషులందరూ సంకుచితులే ఉండరు- అని సరిపెట్టుకునే అవకాశం ఉంది. అందువల్ల ఆయన తన తప్పు తెలుసుకున్నా సహజమైన అభిమానం కొద్దీ దాన్ని వెంటనే ఒప్పుకోలేక తాత్సారం చేస్తున్నాడేమో. ఇక రెండవది- మీ డాడీ స్వభావం నాకు తెలియదు. తెలిసినా, ఏ మనిషి ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో, అతనితో సంబంధంలేని మూడో మనిషి చెప్పటం కష్టమైనపనే. అయినప్పటికీ ఇలా అనుకోవచ్చు. ఆయన మీ పిన్నిని ఎందుకు పెళ్ళిచేసుకున్నాడో తెలియదు. ఏదో తాత్కాలిక మోహావేశంతోనో, ఆకర్షణతోనో చేసుకున్నాడనుకుందాం. ఇంట్లో అన్నిబాధ్యతలూ భరిస్తూ, భార్య మాట్లాడే చిన్నచిన్న మాటల్లో పెడర్థాలు వెతుక్కుంటూ, మీ పిన్ని దగ్గర తనకు ఎలాంటి బాధ్యతలూ లేనందున ఆమెతో సంసారం చేయటంలో తాత్కాలిక మనశ్శాంతి వెతుక్కున్నాడనుకుందాం. అనుక్షణం కలిసి ఉండేవారితో ఏర్పడినంత సాన్నిహిత్యం, మానసికానుబంధం, ఎప్పుడో ఒకసారి కలిసే మనిషితో ఏర్పడటం కష్టమే. మీ పిన్నితో సంసారం చేయటంలో తనకు కష్టనష్టాలు ఏమీ లేవు. తన ఇష్టమైనప్పుడు ఆమె దగ్గరికి వస్తూ పోతూ ఉండవచ్చు. అంత మాత్రానికి ఆమెను వదులుకోవడం ఎందుకనే ఉద్దేశంతో ఉన్నాడనుకుందాం ఇన్నాళ్ళూ. అప్పుడేమవుతుంది- ఆ మోజు ఎలాగూ ఈ వయసులో తగ్గిపోతుంది. తన భార్యా, తన కొడుకూ, తన కూతురూ, ఇక తొందరలో ఉద్యోగం విరమించి, విశ్రాంతి తీసుకోవలసిన

తరుణంలో, ఇంకా లంపటం పెట్టుకుని లేనిపోని సమస్యలు తెచ్చిపెట్టుకోవటం ఎందుకని ఏదో ఒక సాకుతో ఇంతటితో తెంచుకుందామనీ అనుకుంటూండవచ్చు- అవునా?''

''కావచ్చు... కానీ ఇన్నిరోజులూ భరించినవాడికి ఇప్పుడెందుకు అలా అనిపిస్తుంది?''

''ఏముంది ఇప్పుడు కాకపోతే మరో అయిదారేళ్ల తరవాత మీపిన్ని దగ్గర ఆయనకు దొరికేదేముంటుంది? పిల్లల పెళ్ళిళ్లయిపోయిన నడివయసులో భార్యాభర్తలు ఎలాగూ ఒకలాగూ దగ్గరవుతారు. ఏదో మోజుకొద్దీ ఇన్నాళ్ళూ ఉన్న మరో బంధం ఇంకా కొనసాగించి భార్యకు మనశ్శాంతి కరువుచేయటం ఎందుకు? ఎలాగూ ముసలితనంలో తను ఈవిడదగ్గరకొచ్చి తన జీవితాన్ని గడపలేడు గదా? ఆ మాత్రానికి భార్యను కూడా కష్టపెట్టి, ఆమె దగ్గర తను చెడ్డవాడుగానే జీవితాంతం మిగలటమెందుకు? ఇప్పుడైనా ఈవిడతో బంధం తెంచుకుంటే, తన భార్య సంతోషించే అవకాశం ఉంటుందికదా? ఇదంతా మన ఊహమాత్రమే సుమా''

''అయినా ఇలా కూడా అయ్యే అవకాశం లేకపోలేదు'' సాలోచనగా అన్నాడు బాలు.

''సరే... ఇక మరొకటేమిటంటే- మీ డాడీని బాధపెట్టి ఆయన్ని దూరంచేసుకోవడమెందుకని మీ పిన్ని ఆయనకు ఎలాగో సర్దిచెప్పి, సర్దుకుపోదామని అనుకోవడం''

''కానీ అది మాత్రం జరగదు. మా పిన్ని దగ్గర నాకో గమ్మత్తైన స్వభావం కనిపించింది. తన విషయాలన్నింటిలోనూ సర్దుకుపోతుంది. అసలు ఇలాంటి గొడవలేవీరాకుండానే జాగ్రత్త పడుతుంది. అంతెందుకు, పిన్ని విజయవాడలో ఉన్నప్పుడు రెండేళ్లలో డాడీ ఒకే ఒక్కసారి క్రిస్మస్ సెలవులప్పుడు వెళ్ళి వారం రోజులున్నాడు- అదీ మమ్మీ అమ్మమ్మ వాళ్ళింటికి వెళితే. ఈ సంగతి తెలిసి తరవాత మమ్మీ డాడీని తన వెంట ఊరికి తీసుకెళ్తే కిక్కురుమనకుండా వెంటవెళ్ళిపోయాడు. అంతెందుకు, విజయవాడ నుంచి వచ్చినప్పుడు రిసీవ్ చేసుకోవటానికీ వెళ్లలేదు. పిన్ని వచ్చిన తరవాత రెండు మూడు రోజులవరకూ కనిపించలేదు. ఇది ఒక చిన్న ఉదాహరణ. ఇలాంటివి ఎన్నో జరిగాయి. పిన్ని మాత్రం వల్లెత్తు మాటనదు, వాదించదు, తర్కించదు. మామూలుగా ఉంటుంది.

కానీ స్వప్న విషయంలో డాడీని కల్పించుకోనీయదు. దానిష్టప్రకారమే జరగాలి. అది ఇంటర్‌లో చేరతానన్నప్పుడు గ్రూప్ విషయం పిన్ని విజయవాడలో ఉంది. ఇదేమో ఇక్కడ టెంత్ ఎగ్జామ్స్ రాస్తోంది. బైపీసీ తీసుకొమ్మని డాడీ. స్వప్నకేమో ఇంజినీర్ కావాలని కోరిక. అది చెబితే డాడీ ఒప్పుకోలేదు. ఆడపిల్లలు ఇంజినీరింగ్ చదవడంకన్నా మెడిసిన్ చదివితే బాగుంటుందంటాడు. స్వప్న ఆ మాట ఒప్పుకోలేదు. ఎగ్జామ్స్ పూర్తవగానే స్వప్న పిన్ని దగ్గరికెళ్ళిపోయింది. వెంటనే డాడీ ఉత్తరం రాసాడు స్వప్నను బైపీసీ గ్రూప్‌లో చేరమని నచ్చజెప్పమని. దానిష్టమున్న చదువు దాన్ని చదుకోనిద్దామని నచ్చజెబుతూ పిన్ని రాసింది. అప్పుడూ ఇలాగే కోపంగా ఉత్తరం రాశాడు. పిన్ని మాత్రం మరో ఉత్తరం రాసింది గానీ ఆ విషయమే ప్రస్తావించలేదు. తన మాటే ఒప్పుకున్నదని డాడీ అనుకున్నాడు. స్వప్న ఎంపీసీ గ్రూప్‌లో చేరింది. ఆ ఉత్తరం రాగానే మూడు నెలలదాకా పిన్నికిగానీ, స్వప్నకుగానీ ఉత్తరం రాయలేదు డాడీ.

''నా విషయమూ అంతే. నేను ఆర్కియాలజీ తీసుకుంటానంటే తనలాగా లిటరేచర్ తీసుకోమన్నాడు. నీ యిష్టమైన గ్రూపులో నువ్వు చేరు, డాడీకి నచ్చజెప్పటానికి ప్రయత్నించు. ఒప్పుకుంటే సంతోషం. లేదంటావా, హాస్టల్‌లో వుండు, మీకెలాగూ అది ఫ్రీయేగదా. తల్లిదండ్రులుగానీ, అన్నదమ్ములుగానీ మన వ్యక్తిగత విషయాల్లో తమ అభిప్రాయాలు చెప్పటం వరకే వాళ్ళ ప్రమేయం. ఏం చేయాలన్నది మన అభిరుచి మేరకు చేసుకోవాలి. మరో విషయం-అలా చేస్తున్నప్పుడు ఎదిరించి నిలిచే ధైర్యమూ, అవకాశమూ ఉన్నాయా అని కూడా చూసుకోవాలి. నీకెటూ హాస్టల్ ఫెసిలిటీ వుంది. పుస్తకాలకు లైబ్రరీ వుంది. కొనుక్కోవాల్సిన పుస్తకాలూ, పాకెట్‌మనీ కావాలంటే సరే, నేనున్నాను కదా. నేను కూడా లేననుకో, నేనూ మీ డాడీలాగే అన్నాననుకో, అప్పుడు నీ ఖర్చులకు నెలకో వంద రూపాయలు సంపాదించుకోలేనా అని ఆలోచించుకో... సంపాదించు.

త్రవదు. అవేవీ చేసే ధైర్యం లేదనుకో, అప్పుడు వ్యక్తిత్వం కబుర్లు లేకుండా పెద్దవాళ్ళు చెప్పినట్టు వినటం మంచిది. అలుగుతాననో, చస్తాననో బెదిరించటం మంచిది కాదు. తల్లిదండ్రులు పిల్లల్ని తమ యిష్టంప్రకారం నడిపించాలని చూసి వాళ్ళ బతుకులు ఎలా చేస్తారో నాకు తెలుసు. అందుకే ఒక వయసు వచ్చింది, ఆలోచనా జ్ఞానం, మంచీ చెడుల వివక్ష వున్నదనే నిన్నుగానీ, స్వప్నను గానీ నేను నామాట వినమని చెప్పను. అదే మీ పద్మ విషయమనుకో, నేనెటూ చెప్పలేను. తల దూర్చను - అని'' నేను ఆర్కియాలజీలో చేరేందుకు నాకు ధైర్యం ఇచ్చింది. స్వప్న యింటర్‌లో చేరిన ఏడాదికల్లా యిది జరిగింది. నేను పిన్ని దగ్గరికి వెళ్ళొస్తుండే విషయం డాడీకి తెలుసు. అయినా నేను నా యిష్టం గానే చెప్పినా యిందులో పిన్ని ప్రమేయం వుందని డాడీ అననే అన్నాడు. గౌతమి సపోర్టు చూసుకుని నువ్వు చేస్తున్నావని నాకు తెలుసురా - అంటూ. దాని గురించి పిన్నికి మళ్ళీ ఓ నవలంత ఉత్తరం రాశాడు డాడీ. నేను వెళ్ళినప్పుడు ఆ విషయం చెప్పి నవ్వేసింది పిన్ని. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే స్వతంత్రంగా ఆలోచించేవాళ్ళను గౌరవించటమంటే పిన్నికి యిష్టం. ఒకరకంగా తను కూడా అలాగే వుంటుంది. కానీ డాడీతో పోట్లాట వరకూ రావటం మాత్రం యిదే మొదలు. ఇప్పుడైనా స్వప్నకు నచ్చజెప్పమని డాడీ అంటాడు. చెప్పడం మంచిదికాదనే పిన్ని అంటుంది. ఈసారి డాడీ మంకుపట్టుపట్టడంతో యింతదూరం వచ్చింది. కానీ నువ్వన్నట్టు పిన్ని మాత్రం రాజీపడదు. అంతవరకు నాకు ఖచ్చితంగా తెలుసు. ఎందుకంటే తన విషయమైతే అసలింత దూరం రానిచ్చేదేకాదు. స్వప్న విషయం కనుక తను కల్పించుకోనని అంటున్నదే కానీ లేపోతే యిలా జరిగేదేకాదు. ఇక నువ్వన్నట్టు మా డాడీయే తను తొందరపడ్డానని తెలుసుకుంటే తప్ప మరో మార్గం లేదు. నువ్వన్నట్టు డాడీ, పిన్నిని వదిలించుకోవాలని అనుకుంటున్నాడంటే మాత్రం ఏమవుతుందో చెప్పలేను''



"ఏమవుతుంది? సగం ఒంటరితనం అలవాటైన మీ పిన్నికి పూర్తి ఒంటరితనం వస్తుంది- అంతేకదా! కానీ మీ పిన్ని విషయం ఒకందుకు నాకు సంతోషంగా వుంది. తన ప్రత్యేకత తను కాపాడుకోవటానికి ఎలాంటి పరిణామం వచ్చినా చలించక పోవడం నిజంగా చాలా నిబ్బరం వుండాలి. అలాంటివాళ్ళకు మానసిక ధైర్యం యిచ్చే స్నేహితుల్లో, ఆత్మీయుల్లో వుంటే వాళ్ళకు కొంతలో కొంతైనా ఉపశాంతిగా వుంటుంది. మగవాళ్ళ ఆధిక్యతను చెప్పుదెబ్బ కొట్టే మీ పిన్నిలాంటివాళ్ళకు మానసిక ధైర్యం యిచ్చేవాళ్ళు కూడా వున్నప్పుడు, మీ పిన్నిలాగే ఆలోచించే వాళ్ళుకూడా ఎక్కువ అవుతారు. అలాంటివాళ్ళు కొందరు వ్యక్తిగతంగా కొన్ని బాధలు అనుభవించినా వాళ్ళ స్ఫూర్తితో మరికొందరైనా ముందుకొస్తారు కదా. అప్పుడు మెల్లిమెల్లిగా కొన్ని విషయాలు పరిష్కారమైపోతాయి. అంతే కదా?''

"అవును రోనీ. కానీ నాకు ఒక విషయం ఎంతకూ అంతుపట్టదు. పిల్లల అభిప్రాయాలకు విలువనివ్వాలి, వాళ్ళ అభిరుచిమేరకు వాళ్ళను రూపొందనీయాలి - అనే పిన్ని మా డాడీని ఎందుకు పెళ్ళిచేసుకుంది, ఆయన దగ్గర ఎందుకు సర్దుకుపోతుంది. ఎంత ఆలోచించినా అర్థం కాలేదసలు''

"పద... బైటికెళ్ళి టీ తాగుదాం. చాలాసేపట్నించీ యిలాగే కూచున్నాం కదూ. నడుస్తూ మాట్లాడుకుందాం'' అంటూ రోనీ బైటికి నడిచాడు.

గదికి తాళం వేసి యిద్దరూ బైటపడ్డారు.

"మీ డాడీ తనకు అనుకూలంగా వుండాలని అడగలేదు కదా మీ పిన్ని. ఆయనకు భార్య, పిల్లలు వున్నారుకదా. తనకోసం యితరుల్ని మారమనిఅడగకపోవటం కూడా అదే లక్షణం. తన ప్రత్యేకతను నిలుపుకోవాలనుకునేవారు ఎదుటివారి ప్రత్యేకతనూ గుర్తించాలి కదా. అందుకే తన జీవితాన్ని అడ్జెస్ట్‌చేసుకుంది. పాకెట్‌మనీ సంపాదించలేకపోతే ఖర్చులు మానుకొమ్మని నీకు చెప్పిందన్నావు చూడూ, అలాగన్నమాట. కానీ పిల్లల విషయం వచ్చేసరికి మీ డాడీ ఎన్ని చెప్పినా వినలేదు కదా. ఆయన తనకు దూరమయ్యే ప్రమాదం వున్నప్పటికీ, స్వప్నకు ఒక ఆజ్ఞ యిచ్చి తన సుఖం చూసుకోలేదు. ఆమె సర్దుకుపోతున్న

దంటే తన వ్యక్తిత్వానికి భంగం కలగనంతవర కే అని గ్రహించటం లేదు నువ్వు. మొత్తానికి మీ పిన్ని ఒక టిపికల్ కారెక్టర్. ఐ అప్రిషియేట్ హార్''

''సరే... మీ పెళ్ళెప్పుడు?''

''ఇందులో చాలా ప్రాబ్లమ్స్ వున్నాయి. చాలా గొడవలు జరుగుతాయి. వీలైనంతవ రకూ పెళ్ళయ్యేదాకా ఎక్కువమందికి తెలియ నీయటం మంచిది కాదు. అలాగని కొందరైనా లేకపోతే కూడా కష్టమే'' టీ తాగుతూ చెప్పాడు రోనీ.

''గొడవలా... గొడవలేమిటి? రేవతి తల్లి దండ్రులు పట్టించుకోరన్నావు కదా?''

''నువ్వు మా అంకుల్ విషయం మరిచిపో తున్నావు'' సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు రోనీ.

''వాళ్ళెటూ పెళ్ళిచేసుకోలేదు. లీగల్ ప్రాబ్ల మ్స్ ఏమీ వుండవు. ఇప్పుడామె తన యిష్టంవ చ్చిన పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతానంటే ఏ హక్కుతో ఆమెను ఆపుతాడు?''

''ఆయనకు లీగల్‌గా హక్కులేదన్నమాట నిజమే. కానీ యిన్నాళ్ళూ తనతో వున్న మని షిని అంత సులువుగా వదులుకుంటాడను కుంటున్నావా? ఆడదంటే ఆస్తే కదా మనవా ళ్ళ దృష్టిలో. అందులోనూ తన రెండో భార్యగా అందరికీ పరిచయమైన అమ్మాయిని, ఆయన భాషలో మరెవడో లేవదీసుకు పోయాడంటే తన పరువుప్రతిష్ఠలూ, , తన మగతనమూ మంటగలిసిపోయాయని నలుగురూ అనుకో రూ? అందునా ఆమెమీద ఎన్నో ఆశలుపెట్టు కున్నాడు. ఆమె మూలంగా తన జీవితం సాఫీగా, భార్య టౌన్లో వున్నా దేనికీ యిబ్బందిలే కుండా గడిచిపోతూంది. ఇప్పుడు అక్కడ ఆటంకం కలగదూ''

''మరి అలాంటప్పుడు ఆమెను సరిగ్గా చూసుకుంటే సరిపోయేదికదా! ఈ పరిణా మమే ఎదురయ్యేదికాదు కదా?'' టీ కప్పు కిందపెట్టేసాడు బాలూ.

''అదేకదా పేరడాక్స్. మనిషి విలువ దగ్గరు న్నప్పుడు తెలియదు. అదీకాక భార్య గురించే 'దాని మొహం, ఏంచేస్తుంది. కుక్కిన పేనులా పడుంటుంది' అనుకునేవాళ్ళున్న ఈ లోకంలో, తాళికట్టని భార్య గురించి అంతకన్నా తక్కువ అభిప్రాయం వుండటంలో ఆశ్చర్యమేముంది. ఆ ఆలోచనలో వున్నవాడికి ఎదురుతిరిగితే గమ్మున ఊర్కుంటాడంటావా?''

''అవును- అది కూడా ఆలోచించాల్సిన విషయమే''

''అంతేకాదు ముందుగా విషయం తెలిస్తే ఎంతకైనా తెగించవచ్చు. పెళ్ళవకుండా రేవ తిని నాతో తీసుకొచ్చుకుంటే పోలీసులతో కిడ్నా పింగ్ కేసు కాకపోతే బ్రోతల్ కేసు పెట్టించవ చ్చు. ఇతరులు నమ్మటానికి కూడా ఆస్కార ముంటుంది. ఆమెకు ఏ ప్రమాదమైనా తలపె ట్టవచ్చు''

''అంతదూరం పోతాడంటావా?''

''ఆడదానికోసం యుద్ధాలు జరిగాయని నీకు తెలీదా బాలూ! మా అంకుల్ స్వభావం నీకు చెప్పానుకదా. ఆయన మిత్రబృందంలో సగంమంది రౌడీలూ, గూండాల కేటగిరికి చెందినవాళ్ళే. వాళ్ళందరికీ నేను కూడా పరిచ యస్తుణ్ణే. అందుకని ప్రత్యేకంగా నా ఫొటో యిచ్చి చెప్పాల్సిన పనిలేదు''

''అయితే నీకు కూడా ప్రమాదమేనన్న మాట''

''ఈ విషయాలన్నీ ఎలా చూసుకోవాలో నాకు తెలుసు. కాకపోతే నీలాంటి ఫ్రెండ్స్ కొందరి సహాయం కావాలి. కొన్ని పనులు చేసిపెట్టడానికి కొందరు కావాలి''

''ఆ మాత్రం నేను నా చేతనైనంత చేస్తాను. ఎలాగూ ఎగ్జామ్స్ కూడా అయిపోయాయి కదా. అన్నట్టు పిన్నికి చెప్పనా?''

''చెప్పు... ఫరవాలేదు. నేను కూడా ఒకసారి కనబడి, మాట వరుసకైనా ఇన్వైట్ చేయాలి కదా. కానీ రేవతి గురించి వివరాలు చెప్పకు ఎవరికీ''

''అదేమిటి... ఆ విషయం రహస్యంగా వుంచి, దొంగలాగా బతకటం ఎందుకు?''

బిల్లుచెల్లించి యిద్దరూ హోటల్లోంచి బైటి కినడిచారు.

''బాలూ... ఒక విషయంచెబుతాను– సరి గ్గాఅర్థంచేసుకో. మన సమాజం ఇంకా ఎదగ లేదు. నేను ఏఆదర్శంకోసమో చేసుకోవటంలే దు. నాకోసం నేను పెళ్ళిచేసుకుంటున్నాను.

ఈ విషయం దాచడం అంటావా, దాచాల్సిన అవసరంలేదు. అలాగని ప్రతివారికీ ప్రత్యేకంగా చెప్పటం ఎందుకు? అందరూ ఒకవిధంగాచూస్తే, రేవతికి యిబ్బందిగావుండవచ్చు. ఐనా యిలాంటి విషయాలుదాచిపెడితే దాగవు. ఎలాగోలా బైటపడతాయి. అప్పుడు ఎవరైనా ఈ విషయాన్నితప్పుగా భావిస్తారనే భయంలేదు. భావించినా వాళ్ళను లెక్కచేసే దీలేదు. నేనుచెప్పింది నీకు అర్థమయిందా?''

''ఏమిటో... నగం అర్థమయింది, నగం అర్థంకాలేదు'' సాలోచనగా అన్నాడు బాలూ. ఒక్కక్షణం ఆలోచించి చెప్పాడు రోనీ—

''పోలికనుబట్టి తప్పుగా అర్థంచేసుకోకు. అర్థంకావటానికి చెబుతున్నాను. ఇప్పుడు కుష్టురోగం వుందనుకో. అందులో ఎక్కువగా అంటురోగం కానిరకమే వస్తుంది. నాకేఅలాంటిది వచ్చిందనుకో. నావల్ల నీకుప్రమాదమేమీలేదు. నేను నీకు రోగంఅంటించను. అలాంటప్పుడు ఎదురైన ప్రతివాడికీ, బాబూ నాకు కుష్టురోగంవుంది, కానీ యిది అంటురోగంకాదు-అని చెప్పుకోవడమెందుకు? నరే... నేను చెప్పకపోయినా నీకు తెలిసిందనుకో. అప్పుడు నువ్వుఅర్థంచేసుకున్నవాడివైతే మాట్లాడతావు. లేకపోతే నన్ను ముట్టుకోవు. అలాంటప్పుడు నువ్వు నన్నుముట్టుకోకపోయినా, నాతో స్నేహంమానుకున్నా ఫర్వాలేదు అని అనుకోవటం మానసికధైర్యం. అదినాకుంది. అలాగే ఒకసారి నాకు కుష్టురోగంవచ్చిందని అందరికీ తెలిస్తే ఎవరూ నాతోమాట్లాడరు కదా-అని కుమిలిపోయి, యిక ఏమీచేయలేక ఆత్మహత్యచేసుకోవాలి. అంతేకదా. అది యిలాంటిపెళ్ళిచేసుకునే ప్రయత్నమేచేయకపోవడం''

''ఎంతైనాకొంచెం పత్రికలవాననవున్నవాడివి కదా. ఇప్పుడు అర్థమయింది. కానీ ఒక నందేహం. మరీబొత్తిగా యింటర్వ్యూచేస్తున్నట్టు సాగదీస్తున్నాననుకోకు'' నవ్వుతూ అన్నాడు బాలూ.

''ఇది నావిషయం కనుక అలాఅనుకుంటావని నీకనిపించింది. కానీ యిలాంటివిషయాలు జనరల్‌గా మనం ఎన్నిసార్లు మాట్లాడుకోలేదుకనుక?''

''ఏంలేదు రోనీ... ఇలాంటి విషయాలకు ఎంతప్రచారంలభిస్తే అంతమంచిది కదా. మరికొందరికి స్ఫూర్తివస్తుంది— యిలాంటివాటిమూలంగా''

''ఐతే ఏంచేయమంటావు? రేవతి గురించీ, నాగురించీ పేపర్లో పెద్దప్రకటన యివ్వనా?'' నవ్వుతూ అన్నాడు రోనీ.

''ప్రకటనకు ఖర్చవుతుందనుకో. ప్రెస్‌వాళ్ళను పిలిస్తే ఎలావుంటుంది?''

''ఒకటి— వ్యక్తిగతంగా నేనేదో గొప్పపని చేశానని చెప్పుకోవటం నాకు యిష్టంలేదు. అలాగే తనేదో ధైర్యంచేశానని చెప్పుకోవటం రేవతికీ యిష్టంలేదు. ఇవన్నీ మేం ముందుగానే చర్చించుకున్నాం. ఇద్దరమూ ఒకలాగే అనుకోవటంతో ఈ నిర్ణయానికివచ్చాను''

''ఒకటి-అని మొదలెట్టావు. అంటే యింకా మరొకటో రెండోవున్నాయన్నమాట— అవీ చెప్పేయ్'' అడిగాడు బాలూ.

''ఇలాంటివాటికి ప్రచారంయివ్వటంవల్ల వ్యక్తిగతంగా నిత్యజీవితంలో కొన్ని యిబ్బందులెదురవుతాయి. ఇల్లు దొరకటం కష్టంకావచ్చు. ప్రైవేట్‌ఉద్యోగాలు యిచ్చేవాళ్ళు నిరాకరించవచ్చు. చుట్టుపక్కలవాళ్ళు మన ఎదుట ఏమీఅనకపోయినా విచిత్రంగా చూడవచ్చు. అందుకే చెప్పాను కదా— ఎవరికైనాతెలిస్తే యిదితప్పని అనుకోవటంలేదు కనుక భయపడే ప్రసక్తిలేదు. అలాగే కావాలనీ చెప్పుకునేదీ లేదు. ఇక నువ్వన్నట్టు స్ఫూర్తిఅంటావా, అలాంటి ఆలోచన మనసులో వున్నవాళ్ళకు ప్రోత్సాహం యిచ్చేవాళ్ళు వుంటూనేవుంటారు. అలాగే ఏరచయితో ఈ సబ్జెక్ట్‌తో ఓనవల రాశాడనుకో, ఏ డైరెక్టరో సినిమాతీశాడనుకో— అవన్నీస్ఫూర్తి కలిగిస్తాయి కదా. ఆదర్శంగా ఒకరినిచూసి ముందడుగు వేసేవారుంటే, మనదేశంలో కులాంతర, మతాంతరవివాహాలు ఏనాడో మొదలయ్యాయికదా? మరి ఏవీ, ఎక్కడ జరుగుతున్నాయి— చెప్పుకోదగినన్ని? వరకట్నం తీసుకోకుండా జరుగుతున్న పెళ్ళిళ్ళూవున్నాయికదా? మరి ఎంతమంది చేసుకుంటున్నారు? చైతన్యంఅనేది మనిషిలో లేశమాత్రమైనా వుంటే అది ఎలాగోలా వృద్ధి చెందుతుంది. లేనివాడిలోకి దాన్నిప్రవేశపెట్టలేం. అందుకే నేను మాపెళ్ళికి ప్రచారం

యివ్వకపోవడం వలన 'రేవతిలాగా ధైర్యంచేసె వాళ్ళకు అన్యాయం కలుగుతుందని గానీ నాక నిపిస్తే తప్పకుండా రేవతికి నచ్చచెప్పేవాణ్ణే"

మరికాస్సేపు ఆ విషయం గురించి చర్చలు జరిగాయి. ఆ తరువాత రోనీ చెప్పాడు—

"వారంరోజులలోపే జరిగిపోవాలి. కొంచెం రోజూ టచ్‌లోవుండు"

"సరే... నేనొచ్చినప్పుడు నువ్వు కలవకపోయినా నువ్వు యింటికొచ్చెయ్యి. నాకు ఎంత తొందరగావనులు చెబుతావా, ఏంవనులు చెబుతావా అని చూస్తున్నాను"

"తొందరపడకు. నువ్వుకూడా లవ్ మ్యారేజ్ చేసుకుని, ఆ అమ్మాయి తలిదండ్రులకివ్వంలేకపోతే, నేను బదులుతీర్చుకుంటానులే అప్పుడు" నవ్వుతూ చెప్పాడు రోనీ.

* * *

"పిన్నీ... అర్జెంటుగా నాకోవెయ్యిరూపాయలు కావాలి— యిస్తావా, యివ్వవా?"

"నాదగ్గరవున్నాయా లేవా అనేదికాదు. అలాగే యిస్తానా, యివ్వనాఅనీకాదు. కావలసింది అయిదురూపాయలా, వెయ్యిరూపాయలా అన్నదీకాదు. నువ్వు ఏంచేస్తావనేది తెలుసుకోకుండా యివ్వాలంటే ఎలా?"

"చెప్పకపోతే యివ్వవా పిన్నీ?" గారాబంగా అడిగాడు బాలూ.

"దేనికైనా విషయాన్నిబట్టి వుంటుంది. నీలాంటి పిల్లాడికి నెలకో వందరూపాయలు వరకూ ఆలోచించకుండా యివ్వొచ్చు. నువ్వు సిగరెట్లుకొనుక్కోవడానికే ఖర్చుపెడుతున్నావనుకో— మంచిదికాదని నచ్చజెప్పి, మాన్పించటానికి ప్రయత్నిస్తానుగానీ యివ్వననిమాత్రం అనను. కానీ ఒక్కసారే వెయ్యిరూపాయలు, అదీ అర్జెంటుగా కావాలంటే ఎందుకో తెలుసుకోకుండా యివ్వను. తెలుసుకున్న తరువాత కూడా నాకు నచ్చకపోయినా యివ్వను. అయినా పిన్నికి చెప్పకూడనంత రహస్యమైన వనికోసం పిన్ని దగ్గరెందుకు తీసుకోవాలి? అంతచెప్పకూడని వనులైతే అనలెందుకు చెయ్యాలి?"

"చంపావ్‌పో... ఇంతపెద్ద ఉపన్యాసమా?"

"మంచివనయింది. అనలు ఎందుకైనా నరే! యివ్వొద్దు మమ్మీ" ఉడికించింది స్వప్న.

"ఏంలేదు— నేను సిల్వియాకు రాసిన ప్రేమలేఖలు ఎవడికో దొరికాయి. వెయ్యిరూపాయలిస్తేగానీ వాటవి యివ్వనంటున్నాడు" కోపంగా చెప్పాడు బాలూ.

"ప్రేమలేఖలు రాసినప్పుడేవుండాలి బుద్ధి. ఇప్పుడెందుకూ భయం?" నవ్వుతూ అంది గౌతమి.

"నాగురించికాదు, పావం ఆ అమ్మాయి బతుకు ఎడారిలో ఇసుకలా, ఛ... కాదు ఎడారిలోమంచుముక్కలా కరిగినీరైపోతుందని నాఆవేదన" నాటకఫక్కీలో చెప్పాడు.

"ఆమెకోసమైతే మీ బ్లాక్‌మెయిలర్‌కు ఆమె అడ్రస్ చెప్పెయ్యి. ఆమె యిచ్చుకుంటుంది" స్వప్న నలహాయిచ్చింది.

"ఈ నాటకాలన్నీ మానేసి, డబ్బు కావాలంటే అనలు నంగతేమిటో చెప్పు. లేకపోతే కదులిక్కణ్నించి- నాకు నిద్దరొస్తుంది"

"సాయంత్రం ఆరున్నరకు నిద్దరొస్తుందా. ఫో పిన్నీ అయితే చెబుతానులే" బుంగమూతి పెట్టి వివరించాడు- "మా రోనీ అర్జెంటుగా లవ్‌మ్యారేజ్ చేసుకుంటున్నాడు. ఏమైనా అవసరమొస్తుందికదా, అడిగి యిద్దాం, నీకు మెల్లిగా యిచ్చేస్తాడు తను. అనడిగాను"

"ఆ పిల్లాడికింకా కుదురైన వుద్యోగమే లేదుకదా, యిప్పుడే పెళ్ళెందుకటా?"

"అదో పెద్ద కథ"

"అంత పెద్ద కథైతే వంట చేసుకుంటూ మాట్లాడుకుందాం పద" అంది గౌతమి.

నాలుగుకల్లా ముఖ్యమైన వనులన్నీ పూర్తిచేసి, రొటీన్ వనులు చూస్తూ కూర్చుంది గౌతమి. నాలుగున్నరకు కుర్రాడు తెచ్చిపెట్టిన టీ తాగుతూ రిలాక్సింగ్‌గా పనిచేసుకుంటుండగా, వాచ్‌మెన్ ఒకమ్మాయిని వెంటబెట్టుకుని వచ్చి-

"మేమ్‌సాబ్, ఆప్‌కేలియే" అని ఆ అమ్మాయిని వదిలేసి వెళ్ళిపోయాడు.

ఎదురుగావున్న అమ్మాయిని ఎక్కడా చూసినట్టు గుర్తురాక సాలోచనగా, ఆ అమ్మాయి వైపు చూస్తూ-

"కూర్చోండి" అంది.

"మీరు గౌతమిగారు కదూ" కూర్చకుండా సంకోచంగా అడిగిందా అమ్మాయి.

గుండ్రటి ముఖం, చిన్నముక్కు, చిన్ననోరు, మరీ విశాలంగానూ, మరీ చిన్నగానూ లేకున్నా ఆకర్షణీయంగా వున్నకళ్ళు, దోసగింజ ఆకారంలో బొట్టూ, చెదిరిన జుట్టూ, బాగా అలిసిపోయినట్టూ, కంగారుగా వున్నట్టూ వున్న ముఖకవళికలు నేతచీర, భుజానికి కాలేజీ స్టూడెంట్స్ వెనుకన బ్యాగూ, ఎవరీ అమ్మాయి- అని ఆలోచిస్తూ.

"కూర్చోండి" అంది గౌతమి.

కుర్చీలో బెరుగ్గా కూర్చుని ప్రశ్నార్థకంగా చూస్తుండిపోయిందా అమ్మాయి.

"నాపేరు గౌతమి. మీరు బ్యాంక్‌పనిమీద వచ్చారా, లేక..."

"గాంధీనగర్‌లో వుంటారు, బాలకృష్ణ, స్వప్న మీ పిల్లలుకదూ"

"అవునండీ"- ఆమె ధోరణి అంతుపట్టకపోయినా జవాబిచ్చింది గౌతమి.

"హమ్మయ్య" అన్నట్టు నిట్టూర్చి- "నా పేరు రేవతి. నేను మీకు తెలీదనుకోండి, కానీ..."

"రేవతి అంటే మీరు రోనీగారి ఫ్రెండ్?"



ఈవిడకు ఎలా చెప్పుకోవాలా అని ఆలోచి స్తున్న రేవతి, ఆమే రోనీ ప్రస్తావన తీసుకురావ టంతో-

"అవునండీ" అంది వెంటనే.

అటు వెళుతున్న బాయ్‌ని పిలిచి మరో టీ తెమ్మని పురమాయించి పెన్నుతీసి పెన్ స్టాండ్‌లో పెట్టేసింది గౌతమి.

"ఇప్పుడదేమీ వద్దండీ... ఇఫ్ యూ డోంట్ మైండ్, నాకొక చిన్నసహాయం చేయగలరా?" అర్థిస్తున్నట్లుగా అడిగింది రేవతి.

"చూడమ్మా... మీ ఫ్రెండ్ రోనీ, మా బాలూ మంచి స్నేహితులు. అంచేత నాదగ్గర కంగా రువడకు. నిదానంగానే చెప్పు" అంది గౌతమి మృదువుగా.

ఈవిడగురించి రోనీ చెప్పింది నూటికి నూ రుపాళ్ళూ నిజమేనుమా- అనుకుంది రేవతి.



ఆ ఆలోచనతో చాలా రిలీఫ్‌గా ఫీలయ్యింది.

"ఏంలేదండీ, అర్జెంట్‌గా రోసీగారిని కలుసుకోవాలి. నాకు ఆయన అడ్రస్ తెలియదు. ఈ సిటీ నాకు కొత్త. బాలకృష్ణగారు చెబుతారేమోనని మీదగ్గరికొచ్చానండీ" వివరించింది రేవతి.

అంతలో బాయ్ టీ తీసుకొచ్చాడు.

"తీసుకోమ్మా, నేనిందాకే తాగాను. ఇదిగో కప్పుకూడా యిక్కడే వుంది" నవ్వుతూ అంది గౌతమి.

"థాంక్స్" టీ కప్పు చేతిలోకి తీసుకుంటూ అంది రేవతి.

"రోసీ అడ్రస్ కనుక్కుని చెప్పిన తర్వాత మళ్ళీ చెప్పాలి. అన్ని థాంక్సూ ఒక్కసారే చెప్పొచ్చు" రేవతితో అని- "బాలూ యింట్లో వున్నాడో లేదో, స్వప్నయినా వుందో లేదో మరి" తనలో తను అనుకుంటున్నట్లుగా అంటూ ఫోన్ డయల్‌చేసింది గౌతమి.

"స్వప్నా... మమ్మీని... బాలూ వున్నాడా అక్కడ... కొంచెం పిలువు... నీ క్రాస్ ఎగ్జామినింగ్ ఆపి ముందు పిలువు... ... బాబూ, హియరీజ్ సర్‌ప్రైజ్... అవును, సర్‌ప్రైజంటే నీకు కాదు... ఒకరకంగా మనందరికీ సర్‌ప్రైజే అనుకో, ముఖ్యంగా మీ ఫ్రెండ్ రోసీకి... అవును... రోసీ ఫ్రెండ్ రేవతి... అవును రేవతి యిప్పుడు నా ఎదురుగా కూర్చుని వుంది... నిజంగానే చెబుతున్నాను... నీ సిల్లీ డౌట్స్ ఆపి ముందు నేను చెప్పేది విను. వెంటనే రోసీ దగ్గరికెళ్ళి విషయం చెప్పు... ఐతే సరే, ఎక్కడుంటాడో చూడు, ఎంత ఆలస్యమైనా ఫర్వాలేదు, ఆటో తీసుకుని వెళ్ళు... అలాగే... కంగారేమీ లేదు, నువ్వు కంగారుపడి ఆ అబ్బాయిని కంగారుపెట్టకు... అలాగే నేను మనింటికి తీసుకొచ్చేస్తాను... నాకా పనేమీలేదు... అయిదు కల్లా యిక్కణ్నించి బయలుదేరుతాం... మంచిది... మంచిది... ఐదులోపల రాగలిగితేనే రండి... ఐనా ఎందుకంత హడావుడీ, ఎలాగూ అరగంటలోగా నువ్వెళ్ళి రోసీని తీసుకురాలేవుకదా... సరే, అయిదూ అయిదువరకు చూస్తాను... మంచిది, బస్సులకోసం చూస్తూ టైం వేస్ట్‌చేయకు, ఆటోలో వెళ్ళు, డబ్బులున్నాయా... సరే లేకపోతే స్వప్నదగ్గర తీసుకో, యింటికొచ్చిన తరవాతైనా యివ్వొచ్చులే... మంచిది... మంచిది... కంగారు లేదన్నాను కదా... సరే, యిక ఫోన్ పెట్టేస్తున్నాను" ఫోన్ పెట్టేసి రేవతివైపు తిరిగింది-

"మీకు చాలా ట్రబులిస్తున్నానండీ"

"అలాంటిదేమీ అనుకోకమ్మా. నువ్వు ఎంత అవసరమైతే ఇలా వస్తావో ఊహించుకోలేనా? మా ఇంట్లో నీకు బోర్ అనేదే వుండదు. మా స్వప్న వాగుడుకాయ, క్షణంలో స్నేహం కలిపేస్తుంది, వాళ్ళిద్దరూ వచ్చేవరకూ నీకు మంచి టైంపాస్ అనుకో. నేను ఈ కాస్త పనీ పూర్తిచేసుకుంటే మనం తొందరగా బైటపడొచ్చు. అంతసేపూ ఈ పత్రిక చూస్తూండు" టేబుల్ డ్రాయర్‌లోంచి ఒక మ్యాగజైన్ తీసి రేవతికి అందించింది.

రేవతి పత్రిక తిరగేస్తూ కూచుందిగానీ మనసు పత్రికమీద లగ్నమైలేదు. ఐతే గౌతమి మాట్లాడిన ధోరణి చూసిన తరవాత కొంచెం కుదుటపడింది.

కాసేపటికి ఓ పెద్దమనిషి విసావిసా నడుచుకుంటూ గౌతమిసీట్ దగ్గరికొచ్చాడు-"ఎక్స్‌క్యూజ్‌మీ మేడమ్. మీ బ్యాంకుకొచ్చే కస్టమర్లకు మీ స్టాఫ్ ఇచ్చేగౌరవం ఇదేనా? సమాధానం చెప్పటం ఇష్టం లేకపోతే ఊరుకోవచ్చు కదా? జోక్స్ ప్లేచేస్తేఎలా?" కోపంగా చెబుతున్నాడు.

"ప్లీజ్... మీరలా కూర్చుని తరవాత చెప్పండి ఏమైంది?"

"నేను కూర్చోనండీ... మేనేజర్‌వున్నారా అని అడిగాను"

అంతలో ఒకతను కంగారుగా పరిగెత్తుకుని వచ్చాడు, అతన్నిచూపిస్తూ, "ఇతన్నేనండీ, అడిగాను. ఏదో ఒకమాట చెప్పొచ్చుకదా. మేనేజర్ గదిలోకెళ్ళి, టేబుల్‌డ్రాయర్ తెరిచిచూసి, లేడండీ అన్నాడు, నేనేమనుకోవాలి?"

"అదికాదు మేడమ్..."

"వాసుగారూ, నేను చెబుతానుకదా. నాకుతెలిసింది" నవ్వాపుకుంటూ చెప్పింది గౌతమి-"మేనేజర్ లేరు. ఇప్పుడే వెళ్ళిపోయారు. ఆయన టిఫిన్‌బాక్స్ టేబుల్లో వుంటే వున్నారనీ, బైటికెళ్ళారనీ అర్థం. అది లేకపోతే వెళ్ళిపోయారన్నమాట. ఆయన వెళ్ళటం చూ

డకపోవడంవల్ల ఈయన టిఫిన్ బాక్సుందా, లేదా చూసి చెప్పారు."

"మరి నాకెలా తెలుస్తుంది...వివరంగా చెప్పొచ్చుకదా?"

"ఇట్సాల్‌రైట్, మీకేం కావాలో చెప్పండి. నేను చూసిపెడతాను. అలా కూచోండి, ముందుగా"

"నో థాంక్స్. మీ మేనేజర్ నాఫ్రెండ్ అండ్ అయామాల్సో యువర్ వ్యాలీడ్ కస్టమర్" ఉడుక్కుంటూ వెళ్ళిపోయాతను.

రేవతికూడా నవ్వాగలేదు. బలవంతాన అపుకుని, నన్నగా నవ్వింది.

"పసిపిల్ల నవ్వులాగా ఈ అమ్మాయి నవ్వు ఎంతబాగుంది" అనుకుంది గౌతమి, మళ్ళీ పనిలో మునిగిపోతూ.–

గౌతమి పని పూర్తయ్యేసరికి ఐదూ పద య్యింది టైం. అప్పటికి తొంభైతొమ్మిది సార్లు బ్యాంకు గడియారం వంకా, తన చేతిగడియారంవంకా చూసుకుంది రేవతి.

"వీళ్ళిక వచ్చేట్టులేరు. పదమ్మా మనం వెళదాం" అంది గౌతమి లేచి నిలుచుని.

రేవతి కూడా నిలుచుంది.

స్టాఫ్‌తో చెప్పేసి, రేవతిని తీసుకుని బైటికి నడిచింది గౌతమి.

ఆటోలో ఇల్లు చేరుకున్నారు. స్వప్న గుమ్మంలో ఎదురొచ్చింది. ఇద్దరినీ ఒకరినొకరికి పరిచయంచేసింది గౌతమి. రేవతి ఎంత వద్దన్నా బలవంతం చేసి, ముఖం కడుక్కుని కూచోమ్మని చెప్పి లేవదీసింది గౌతమి. రేవతికేమో ఇబ్బందిగా అనిపించింది. ముక్కూ మొహం తెలియనివాళ్ళింట్లో అంత ఫ్రీగా వుండాలంటే సంకోచంగా అనిపించటం సహజమేకదా. ముఖం కడుక్కుని, తన బ్యాగ్ లోంచి కర్చీఫ్ తీసుకోబోతున్న రేవతికి టవల్ తెచ్చి ఇచ్చింది స్వప్న. తప్పనిసరిగా తీసుకుని తుడుచుకుంది.

"బొట్టుపెట్టుకుంటారా రండి" అంది స్వప్న లోపలికి దారితీస్తూ.

రేవతి అక్కడే నిలుచుండిపోయింది. ఇక లాభంలేదనుకుని, వెనక్కి తిరిగివచ్చి, రేవతి జబ్బ పట్టుకుని లాక్కుపోయింది స్వప్న తన గదిలోకి.

"నాకు కొంచెం మొహమాటం తక్కువ ఏమీ అనుకోకండి" అంది నవ్వుతూ.

క్షణంలో బొట్టుపెట్టుకుని తనవైపు తిరిగిన రేవతిని చూసి-

"అరే... అంత చక్కటి బొట్టు, దోసగింజలాగా ఎంతలో కుదిరింది మీకు!" ఆశ్చర్యపోయింది స్వప్న.

"నేర్చుకుంటే మీక్కూడా వచ్చేస్తుంది" అంది రేవతి.

"అది సరేకానీ మీకోవిషయం చెప్పాలి- ఇలా కూర్చోండి" మంచంలో కూచుని, చూపించింది స్వప్న.

డ్రెస్సింగ్‌టేబుల్ ముందరున్న స్టూల్‌మీద కూర్చోబోయింది రేవతి.

"ఇలాఐతే నాదగ్గర లాభంలేదు" అంటూ మళ్ళీ రేవతిని లాక్కుని మంచం దగ్గరికి తీసుకుపోయింది స్వప్న.

"మీకు చెప్పానుకదా, నాకు మొహమాటం తక్కువని. ముందుగా మీకొక మాట చెబుతాను. మీరేమీ అనుకోవద్దు. నాకిష్టమైన వాళ్ళతో నేనిలాగే మాట్లాడుతాను. మీరు ఎలాగూ రోనీని పెళ్ళిచేసుకోబోతున్నారు. రోని వుండేదిక్కడే కనుక మనిద్దరమూ ఫ్రెండ్స్‌కాక తప్పదు. మీరు, మీరు అని పిలుచుకోవటం అలవాటయితే తరవాత మానుకోటం ఇబ్బందిగా వుంటుంది. అందుకని ఇప్పట్నించే నువ్వు, నువ్వు అనుకుందాం ఏమంటారు?"

"సరే... నీ ఇష్టం" నవ్వుతూ అంది రేవతి.

స్వప్న ఏవో కబుర్లు చెబుతుంటే మధ్య మధ్యలో "ఊ" కొడుతూ, దృష్టి గుమ్మంవైపు కేంద్రీకరించి వింటూ కూర్చుంది. అది గమనించి హాల్లోకి తీసుకెళ్ళింది స్వప్న రేవతిని.

ఆరున్నరవుతుండగా వచ్చాడు బాలూ రోనీని వెంటపెట్టుకుని.

"ఎప్పుడొచ్చావు రేవతీ?"

"నిన్ననే"

"నువ్వొచ్చావని బాలూ చెప్పేసరికి మొదట నేను నమ్మలేదు"

"రూం నుండి టైప్ ఇన్‌స్టిట్యూట్‌కెళ్ళాను. లేదు, అట్నించి లైబ్రరీకి వెళ్ళాను. అక్కడా

లేదు. ఏంచేయాలో తోచలేదు. పత్రికాఫీసుల
న్నీ తిరిగాను. లేదు. మళ్ళీ రూంకు వెళ్ళిచూ
సాను రాలేదు. అప్పటికే టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో
చెప్పేసి వచ్చాను. వస్తే బాలూ ఇంటికి
వెంటనే రమ్మని చెప్పమని. రూం దగ్గర స్లిప్‌పె
ట్టింది అలాగే వుంది. ఏంచేయాలో తోచలేదు.
ఎందుకైనామంచిదని మళ్ళీ ఇన్‌స్టిట్యూట్
వైపు పోతుండగా కనిపించాడు గురుడు. ఎక్క
డనుకుంటున్నారు, కోఠీలో పేవ్‌మెంట్‌మీద
కూచుని తాపీగా ఎవణ్ణో ఇంటర్వ్యూచేస్తున్నా
డు. చక్కగా లాక్కొచ్చాను'' సోఫాలో అలస
టగా కూలబడుతూ చెప్పాడు బాలూ.

''ఏ వేళకు బయలుదేరిందో అమ్మాయి,
పావం నాదగ్గరికొచ్చేసరికి చాలా టైర్డ్ అయిన
ట్టుంది. ఇంటికొచ్చాక టిఫిన్ చేయమని ఎంత
చెప్పినా విన్లేదు. రండి, ముందుగావున్న
టిఫినేదో నలుగురూ తినేసి, ఆ తరువాత
తీరిగ్గా మాట్లాడుకోండి. ఈలోగా వంటపని
అయిపోతుంది నాకు'' అంది గౌతమి.

''వద్దండీ... మేం కాస్సేపు బైటికెళ్ళి
వస్తాం'' యిబ్బందిగా అన్నాడు రోనీ.

''రోడ్ల మీద నడుచుకుంటూనో,ఏ హొటా
ల్లోనో కూచునో మాట్లాడుకుంటారా? నీ కసలు
బుద్ధుందా? మనింట్లో మాట్లాడుకోవచ్చుకదా''
కొంచెం విసుగ్గా అన్నాడు బాలూ.

''పదండి... ముందుగా కాస్త తినేసాక నా
రూంలో కూర్చుని మీ ఇష్టం వచ్చినంతసేపు
మాట్లాడుకోండి'' బలవంతంగా లేవదీసింది
స్వప్న.

బాలూ, గౌతమితో వంట గదిలోకి నడిచి,
నిమిషం తరవాత రోనీని పక్కకు పిలిచి
చెప్పాడు-

''విషయం చూస్తే పీకల మీదకొచ్చిన
ట్టుంది- అంటూంది పిన్ని. అలాంటిదేమైనా
వుంటే ఇద్దర్నీ యిక్కడే వుండి పొమ్మంది
పిన్ని. ఇవాళ్టికి గడిస్తే రేపటి సంగతి ఆలోచి
ద్దాం. నీకు పిన్ని సంగతి తెలును కదా.
మొహమాటాలేమీ పెట్టుకోకు''.

''సరే... అలాగే'' కాస్సేపు ఆలోచించి అన్నా
డు రోనీ.

టిఫిన్ తిన్నాక స్వప్న గదిలో కుర్చుని
మాట్లాడుకున్నారిద్దరూ.

కృష్ణకుమార్ రేవతిని వెంట బెట్టుకుని
హైదరాబాద్ తీసుకొచ్చాడు ముందు రోజున.
త్రీస్టార్ లాడ్జింగ్‌లో రూం తీసుకున్నాడు. రో
జంతా రేవతిని జల్సాగా తిప్పాడు. ఆ రోజు
గడిచి పోయింది. మరునాడు పొద్దున్న చెప్పా
డు- తన స్నేహితుడు అదే లాడ్జింగ్‌కు మరు
నాడు వస్తానన్నాడట. ఎలాగైనా ఒప్పుకొని తన
గండం గట్టెక్కించమని బ్రతిమాలాడట. ఆ
తరువాత ఎలాగూ పోట్లాట తప్పదని గ్ర
హించింది రేవతి. సరిగ్గా ప్లాన్ వేసుకుని
వచ్చాడని అర్థమయింది. అనవసరంగా గొడ
వెందుకని అయిష్టంగా ఒప్పుకున్నట్లు
నటించింది. తయారై బైటికి వెళ్ళేముందు
అతనికి ట్రంకాల్ చేసి చెబుతానని స్నానం
చేయటానికి బాత్‌రూంలోకి వెళ్ళాడు కృష్ణకు
మార్. వెంటనే లేచి, తన చేతి నంచి భుజానికి
తగిలించుకొని, పర్సులో వందపైన డబ్బులు
న్నాయని చూసుకుని, నిమిషంలో బైటపడి,
ఎదురుగా కనిపించిన బస్సెక్కి, రెండు మూ
డు స్టాపుల తరువాత దిగి, రోనీ గది కోసం
వెదికింది.

ఆర్ట్సు కాలేజీ రైల్వేస్టేషన్ దగ్గర అని రోనీ
చెప్పిన మాట ఒక్కటే గుర్తుంది. ఎంత వెతి
కినా దొరకలేదు. మళ్ళీ ఆటో తీసుకొని బాలూ
సంగతి గుర్తొచ్చి ఆర్ట్సు కాలేజ్‌కి వెళ్ళింది.
కాలేజీ సెలవులు. మళ్ళీ ఆటో తీసుకుని పత్రికా
ఫీసుకు వెళ్ళింది. వాళ్ళు ఇంటి నెంబర్
ఇచ్చారు. పోస్ట్‌మన్‌ను పట్టుకుని అడిగితే ఆ
అడ్రస్‌లో మూడునెలల కిందట వుండే
వాడనీ, యిప్పుటి సంగతి తెలియదనీ చెప్పా
డు. నాలుగు నెలలుగా ఆ పత్రిక వాళ్ళకు రోనీ
ఏమీ రాయకపోవటం వలన వాళ్ళ దగ్గర పాత
అడ్రస్ మాత్రమే వుంది. అంతలో గౌతమి పని
చేస్తున్న బాంకు పేరు గుర్తొచ్చింది. మళ్ళీ
బ్రాంచీలన్నీ తిరగటానికి బదులు వాళ్ళ హె
డ్డాఫీసుకు వెళ్ళి విచారించింది. అక్కడొక గౌత
మి వుంది. కానీ ఆమె తనక్కావలసినావిడ
కాదని తెలుసుకుని, ట్రాన్స్‌ఫర్ చూసే సెక్షన్
కెళ్ళి, రిక్వెస్ట్ చేసి, విజయవాడ నుండి ఈ
మధ్య ట్రాన్స్‌ఫరై వచ్చిన గౌతమి కావాలని
అడగ్గా, చివరకు గౌతమి పనిచేసే బ్రాంచ్
దొరికింది. డబ్బులు సలభై రూపాయలు
మాత్రమే మిగిలివున్నాయి. తను వెళ్ళేసరికి

ఆవిడ వెళ్ళిపోతే, ఆవిడ యింటి అడ్రస్ దొరక్కపోతే, దొరికినా ఆటో ఛార్జీ సరిపోకపోతే అనుకుని బిక్కు బిక్కుమంటూ వెళ్ళేసరికి అదృష్టవశాత్తూ గౌతమి ఆఫీసులోనే వుంది.

"నీ అభిప్రాయమేమిటి?" విషయమంతా విన్న తరవాత అడిగాడు రోనీ.

"నేను ఏమని చెప్పాలి రోనీ? నీపరిస్థితి ఎలా వుందో నాకు తెలియదు. నేనొక తలనెప్పిగా తయారయ్యానా అనిపిస్తుంది"

"ఇక ముందు అలాంటి మాటలు ఎప్పుడూ మాట్లాడకు. అయినా నేను ఒక ప్రత్యేకమైన ఉద్యోగం చేయటం లేదన్నమాటేగానీ నేనేమీ నిరుద్యోగిని కాదు. ఉన్న పళంగా ఎక్కడికి వెళ్ళినా అయిదారు నెలలు యిద్దరమూ హాయిగా బతకొచ్చు. అదేమీ ఆలోచించకు. నేనడుగుతున్నది- యిప్పుడు ఏం చేద్దామని?"

"నీ యిష్టం... నీకు ఎలా మంచిదనిపిస్తే అలా చెయ్యి".

"సరే... మన విషయం వీళ్ళకు ఎలాగూ తెలుసు. నీకు ముందే చెప్పాను గదా, బాలూ నాకు మంచి ఫ్రెండ్. ముందుగా వాళ్ళను కూడా పిలిచి విషయం చెబితే బాగుంటుందనిపిస్తున్నది. నాలుగు తలకాయలు కలిస్తే మంచి ఆలోచనలొస్తాయి. నువ్వు ఏమీ మొహమాటపడకుండా యిక్కడే వుండు. స్వప్న కూడా చాలా ఫ్రెండ్లీగా వుంటుంది. నీ టైపే అనుకో. ఇట్టే కలిసి పోతుంది. ఇక అసలు విషయానికొస్తే, అన్ని ఏర్పాట్లు చేయడానికి టైం సరిపోతుందో లేదోననిపిస్తుంది. వీలైతే రేపే వెళ్ళి ఏర్పాట్లు చేస్తాను. కాదంటే ఎల్లుండి- ఏమంటావ్?"

"నాక్కూడా అదే మంచిదనిపిస్తూంది. నీకు ఎలా తోస్తే అలా చెయ్యి. అసలు పొద్దున హోటల్లోంచి బైటపడిన దగ్గర్నించీ టెన్షన్. తను కనపడి ఏం గొడవ చేస్తాడోనని ఒకవంక. నువ్వు కనిపిస్తావో లేదోనని ఒక వంక. నువ్వు గౌతమి గారు బాగానే మాట్లాడుతారని చెప్పావు కానీ, ముక్కూ మొహంతెలియకుండా వెళ్ళి బాలూగారి ఫ్రెండ్ కావాలని అడిగితే ఏమనుకుంటుందో ఎలా రెస్పాన్స్ యిస్తుందోనని సంశయం. ఆవిడని కలిసాక కూడా లోలోపల ఏమనుకుంటున్నదో అనే ఆలోచన. ఇక్కడికొచ్చాక, ఆ అమ్మాయి, అదే స్వప్నతో మాట్లాడిన తరవాత సగం భయం తీరింది. నిజంగా ఈ రోజు ఎలా గడుస్తుందోనని ఎంత భయపడ్డానో చెప్పలేను".

మెల్లిగా చెయ్యి నొక్కుతూ చెప్పాడు రోనీ-

"ఇంకేమీ భయపడకు. ఇక వ్యవహారం మన చేతుల్లోనే వుంది కదా. ఎంత భయపడినా, కంగారులో పిచ్చిదానిలాగా ఏదో చేయకుండా మొత్తానికి సరిగ్గా ఆలోచించి నా దగ్గరికొచ్చావ్. మన పెళ్ళి తంతు పూర్తయ్యే వరకూ అదే ధైర్యంతో వుండు".

ఆ తరువాత ఐదుగురూ కూర్చుని చర్చించారు. ముందుగా కృష్ణకుమార్ విషయం ప్రస్తావనకు వచ్చింది. అతను ఏం చేస్తుండి వుంటాడో అంతుపట్టలేదు. ఐదు నిమిషాల్లో, హఠాత్తుగా మాయమైనట్లు పోవటంతో అదికూడా చేతినుంచి తప్ప మరేమీ తీసుకోకుండా పోవటంతో ఎలా రియాక్టయి వుంటాడా అని రకరకాలుగా ఆలోచించారు. ఏదో ఒక వంకతో ముందుగా అతను ఎలా వున్నాడు ఏంచేస్తున్నాడో తెలుసుకోవాలని బాలూతో ఫోన్ చేయించారు. ఐతే రూం కృష్ణకుమార్ పేరున బుక్ అయిలేదు. రూం నెంబర్ రెండొందల యిరవై రెండు. ముఖ్యంగా మూడు రెండు అంకెలే కావటం వలన తనకు బాగా గుర్తుందని చెప్పింది రేవతి. అదీగాక ఆ హోటల్లో కృష్ణకుమార్ పేరున మరెవరూ లేరు. అక్కడితో కొంత నిశ్చింత ఏర్పడింది. గది తన పేరున లేక పోవటం వలన హోటల్ వాళ్ళను ఆరాతీయటం తప్ప పోలీసు రిపోర్ట్ యిచ్చే ధైర్యమేమీ చేయడని నిశ్చయించుకున్నారు. అలాగని ఏ ప్రయత్నమూ చేయకుండా ఊర్కుంటాడనీ అనిపించలేదు. ఏం చేస్తున్నాడో అంతుపట్టలేదు. అప్పుడు హఠాత్తుగా ఒకతను గుర్తొచ్చాడు. అతని పేరు హరీందర్. పంజాబీననీ, రాజపుత్రుణ్ణనీ చెప్పుకుంటాడు కానీ ఎవరో ఎవరికీ సరిగ్గా తెలియదు. వరంగల్‌లో కొంత కాలంవుండి హైదరాబాదులో స్థిరపడ్డాడతను.

రోనీ చిన్నతనంలో, వాళ్ళింట్లో కృష్ణకుమార్

[illegible] అతను తరచుగా వస్తుండేవాడు. ఆ రకంగా హరీందర్‌తో రోనీకి కూడా పరిచయంవుంది. అతను రౌడీల నాయకుడు. అతని సహాయంగానీ కోరివుంటాడా అనిపించింది.. ఎందుకంటే వాళ్ళిద్దరికీ మంచి స్నేహం వుంది. అతనికి సెక్రటేరియట్‌లో కూడా మంచి పలుకుబడి వుంది. చాలా మంచి పెద్దమనిషి అని తెలియనివాళ్లు పొరపడుతుంటారు. సందర్భాన్నిబట్టి సమయస్ఫూర్తిగా మాట్లాడమని హెచ్చరించి మళ్ళీ బాలూతో అతనికి ఫోన్ చేయించాడు రోనీ. అదృష్టవశాత్తూ ఫోన్ ఎత్తినవాడు హరీందర్ కాదు. అతనూ, కృష్ణకుమార్ మాట్లాడుకుంటున్నారనీ, విషయం చెబితే పిలుస్తాననీ అవతలివ్యక్తి అనడంతో, హైదరాబాద్‌లో వుంటున్న కృష్ణకుమార్ మరోఫ్రెండ్‌గా తనను చెప్పుకుని, వచ్చి కలుస్తానని చెప్పమనీ, పిలవనవసరం లేదని చెప్పేసి ఫోన్ పెట్టేశాడు బాలూ.

విషయం సీరియస్‌గా మారిందని అర్థమయింది రోనీకి. తెలివిగా వ్యవహరించకపోతే తమ యిద్దరి ప్రాణాలకూ ముప్పుకలగొచ్చుననీ, బాలూ కుటుంబానికి కూడా హాని జరగొచ్చుననీ అనిపించింది. బాలూని పక్కకు తీసుకెళ్లి చర్చించాడు. ఎంతైనా రౌడీలూ, గూండాలూ, పోట్లాటలూ అంటే ఆడవాళ్ళు బెదిరే అవకాశం వున్నదనిపించి ముందుగా స్వప్న స్నేహితురాళ్ళని తీసుకురావాలని వెళ్ళారు. ఆనందం హాస్పటల్‌లో రాత్రి షిఫ్ట్‌లో వుంది. శివలక్ష్మి, మయూరిలను యింట్లో దిగబెట్టి, ఆనందంకు ఫోన్‌చేసి విషయం అవసరమైనంత వరకూ చెప్పి తమ పనులు మొదలుపెట్టారు.

ఆ క్షణంలో చకాచకా ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటున్న రోనీని చూస్తుంటే, ఒక పెద్ద మిలిటరీని యుద్ధంలో నడిపిస్తున్న వ్యూహకర్తలా అనిపించింది బాలూకు. విషయం తీవ్రతను యిద్దరిలోనే వుంచుకుని, యిద్దరూ పనుల్లోపడిపోయారు. బాలూ తమ కాలేజీ ప్రెసిడెంట్ యింటికి వెళ్ళి, లవ్ మ్యారేజ్ ఒకటి వున్నదనీ, అర్జెంటుగా రావాలనీ చెప్పటంతో అతనితోపాటుగా పదిమంది సర్వసన్నద్ధంగా వచ్చేశారు. వాళ్ళందరూ తమ కాంపౌండలోనే వున్నవిషయం ఇంట్లో వున్న మిగతా ఎవరికీ తెలియను కూడా తెలియదు. ఇక రేవతికిగానీ, మిగతా వాళ్ళకుగానీ ఎలాంటి ప్రమాదమూ లేదు.

ఈలోగా రోనీ వరంగల్‌లో వున్న తన మిత్రునికి ఎస్.టి.డి.కాల్ చేశాడు. అతనికి ఫోన్‌లేదు. అతని పేరు జోగీందర్. అతను హరీందర్‌కు శిష్యుడేకాక దూరపు వరసలో మేనల్లుడు కూడా. అతనిదీ మేనమామ మార్గమే. జోగీందరూ, రోనీ స్కూలురోజుల్నించి మిత్రులు. హరీందర్‌కు సమఉజ్జీలాంటివాడు జోగీందర్. ప్రతిరోజూ హనుమకొండ చౌరస్తాలోని ఒక హోటల్లో రాత్రి పదకొండువరకూ అలాంటి వాళ్ళందరూ మూగివుంటారు. రావటం అటూ యిటూ అయినా, ప్రత్యేకమైన పనేదీ లేకపోతే పదకొండు ముందుగా మాత్రం ఆ హోటల్ పరిసరాల నుండి కదలరెవరూ. పరీక్షలకు చదువుకునే విద్యార్థులనుండి, సెకండ్‌షో సినిమా తరవాత టీతాగేవారితోపాటు యిలాంటి వాళ్ళందరికీ ఆ హోటల్ కల్పతరువులాంటిది. హోటల్ మేనేజర్‌కు ఫోన్‌చేసి, ముందు జాగ్రత్తగా తనపేరు చెప్పకుండా జోగీందర్ కోసం అడిగాడు రోనీ. ఇంకా రాలేదని సమాధానం వచ్చింది. వచ్చిన వెంటనే హైదరాబాద్‌నుండి ఒక మిత్రుడు ఫోన్‌చేసాడనీ, ఎట్టి పరిస్థితుల్లోనూ మళ్ళీ తను ఫోన్‌చేసేవరకూ హోటల్నించి కదలొద్దనీ చెప్పమన్నాడు. తనపేరు చెప్పమని అతను గుచ్చిగుచ్చి అడగ్గా 'అలా అడగటం ఒంటికి మంచిది కాదని' సినిమా ఫక్కీలో జవాబిచ్చి, నవ్వుతూ ఫోన్‌పెట్టేశాడు. అలాంటివన్నీ ఆ హోటల్‌వాళ్ళకు మామూలే. ఏ ముఠావాళ్ళతోనైనా స్నేహపూర్వకంగా వుంటారు. అందువల్ల అన్నిరకాల మనుషులూ వచ్చినా హోటల్లో మాత్రం తగువులాడుకోరు. ఆ రకంగా హోటల్ కూడా కళకళలాడుతూ వుంటుంది. అది వాళ్ళ వ్యాపారపు కిటుకు. జోగీందర్‌కు కబురుచేరుతుందనీ, తన పేరు చెప్పకపోవటం వలన ఆసక్తి కొద్దీతప్పకుండా ఆగుతాడనీ రోనీకి తెలుసు.

గౌతమీ, శివలక్ష్మి పడుకున్నారు. స్వప్న మయూరి, రేవతి- ఒకరి గురించి ఒకరు తెలుసుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ కూర్చు

న్నారు. ఈలోగా పెళ్ళి రిజిస్టర్ చేసుకోవటానికి నెలరోజులు ఆగకుండా మరో మార్గమేదైనా వుందా తెలుసుకుని రమ్మనీ, ఎవరి దగ్గర ఎలా ఆ సమాచారం తెలుసుకోవచ్చునో సూచించి పంపించాడు బాలూని. బాలూ వచ్చేలోపల రోసీ రేవతిని కూర్చోబెట్టుకుని, ఆమెకూ-కృష్ణ కుమార్‌కూ మధ్య జరిగిన వివాహంలాంటి దానిగురించి గుచ్చిగుచ్చి ప్రశ్నించాడు. మూ డుముళ్ళూ తను వేశాడా లేదంది రేవతి. తను ముళ్ళు వేసిన మాంగల్యాన్నిమట్టుకు తన మెడలో వేసాడంది. అందుకు సాక్షులు న్నారా అనడిగాడు. ఎవ్వరూ లేరు. ఆ తాళి వెంటనే తీసేయమని చెప్పాడు. అంతకు ముందే తీసి ఎక్కడో విసిరేసానంది రేవతి. ఎవరైనా వచ్చి అడిగితే అసలు తాళి తనకు లేదని చెప్పాలని చెప్పాడు. రేవతి ఒప్పు కుంది. ఆ తరువాత ఎక్కడైనా డాక్యుమెంట్స్ మీద కమిట్‌అయిన విషయాలున్నాయా ఆరా తీశాడు. ఎల్.ఐ.సి. పాలసీ రేవతిపేరు మీద తీసుకోవటం, ఓటర్లలిస్టులోగానీ, రేషన్‌కార్డు మీదగానీ యిద్దరి పేర్లూ భార్యాభర్తలుగా వున్నాయా అనీ ప్రశ్నించాడు. లేదనే సమా ధానం. బియ్యే ప్రైవేట్‌గా రాసినపుడు అప్లికేష న్‌లో ఏంరాసావని అడిగాడు. తండ్రిపేరే రాయమన్నాడని చెప్పింది.

ఒక్క ఆధారమూ లేకుండా ఎందుకు చేసు కున్నాడా అని కాస్సేపు ఆలోచించాడు రోసీ తీవ్రంగా. అప్పుడు తట్టింది- కృష్ణకుమార్ ప్రభుత్వోద్యోగి. అందువల్ల తనకు రెండోభార్య వున్న విషయం ఎక్కడా వుండకుండా చూసు కున్నాడు. భార్య బతికుండగా, చట్టపరంగా విడాకులు తీసుకోకుండా మరొకర్ని పెళ్లిచేసు కుంటే అది నేరం. ఉద్యోగం కూడాపోతుంది. అందుకని ముందుగానే జాగ్రత్తపడి వుంటా డని గ్రహించాడు. ఆ ఆలోచన వచ్చిన తర వాత పోలీస్ రిపోర్ట్ యిచ్చినప్పటికీ రేవతిని తన భార్యగా చెప్పుకోలేదని గ్రహించాడు. దాంతో కొంత ధైర్యంవచ్చింది. ఇక మళ్ళీ తన ఏర్పాట్లలో పడిపోయాడు.

సమయం తొమ్మిది కావస్తోంది. జోగేందర్‌కు మళ్ళీ ఎస్.టి.డి. కాల్‌చేశాడు. వెంటనే ఫోన్ దగ్గరికొచ్చాడు. జోగేందర్. తను ప్రేమ వివాహం చేసుకుంటున్నానని, విషయం సీరి యస్‌గా వుంటుందేమోననీ వెంటనే మోటార్ సైకిల్ తీసుకుని వచ్చేయమనీ అడిగాడు. అరగంటలో జీప్‌లో బయలుదేరుతానని చెప్పే శాడు జోగేందర్. సుమారుగా తెల్లవారు ఝా మున రెండూ మూడూ మధ్యలో వచ్చేస్తామని చెప్పాడు జోగేందర్. మరీ ఫాస్ట్‌గా డ్రైవ్‌చేసి, యాక్సిడెంట్‌లో యిరుక్కుని, తనకు అంద కుండా పోవద్దని హెచ్చరించి, ఆర్టీసీ క్రాస్ రోడ్సువరకూ వచ్చేయమనీ, యిద్దరు మిత్రుల్ని ఆ సమయానికి అక్కడ వుంచుతాననీ, వాళ్ళ తోపాటు యింటికి వచ్చేయమనీ చెప్పి, ఎందు కైనా మంచిదని యింటి అడ్రెస్ కూడా చెప్పేశా డు. అక్కడితో సగంభారం తీరినట్టయిందని పించింది రోసీకి.

అంతలో బాలూ వచ్చేశాడు. నెలరోజులు ఆగకుండా పెళ్ళి రిజిస్టర్ చేసుకోవాలంటే అందుకు హిందూ మ్యారేజ్ రిజిస్ట్రేషన్ యాక్ట్ ఒక్కటే శరణ్యమని చెప్పి వివరించాడు బాలూ. మామూలుగా గుళ్ళో పెళ్ళిచేసుకుని, అక్కడ సర్టిఫికెట్ తీసుకుని రిజిస్ట్రారాఫీస్‌కు వెడితే రిజిస్టర్ చేస్తారు. అది తెలియగానే ఎలాగూ తప్పదని తెలిసి, దార్లో ఒక రోల్డ్‌గోల్డ్ మంగళసూత్రమూ, పెళ్ళికూతురు నగలసె ట్టూ కొనుక్కుని గుడి వేటలోపడ్డాడు బాలూ. ఎండోమెంట్స్‌వారి అధీనంలో వున్న గుడి అయివుండి, అక్కడ పెళ్ళికి కావలసిన అన్నిఏర్పాట్లూ వుండే గుడి కావాలని రెండు మూడు గుళ్ళు వెతికి, చివరకు దగ్గరే వున్న ఒక గుడిని పట్టేశాడు బాలూ. ఆ గుడి ట్రస్టీల్లో ఒకాయన పక్కనే వుంటారని తెలు సుకుని ఆయన దగ్గరికెళ్ళి విషయం మాట్లా డాడు. ఆయన చాలా ఆదరంగా మాట్లాడి, ప్రేమ వివాహాలు జరగటం మంచిదనీ, యిలాంటివాటివల్ల వరకట్నాల సమస్యలు తగ్గుతాయనీ, తను పూర్తి సహకారం అందిస్తా ననీ, ఎండోమెంట్ ఆఫీసర్‌కు కబురు చేస్తా ననీ, పొద్దున్న ఒకసారి వచ్చి తనను కలిసి వెళ్ళమనీ చెప్పాడు. ఐతే పురోహితుడు మాత్రం దొరకటం కష్టమనీ వాళ్ళే వెతుక్కోవా లనీ అన్నాడు. ముందుగా విషయం రోసీకి చెబుదామనుకుని, ఎటూ అంత దగ్గరికొచ్చాక ఫోన్ ఎందుకని యింటికే వచ్చేశాడు బాలూ.

తొమ్మిదిన్నర దాటింది. పరిస్థితి ఒకసారి చర్చించుకుని పురోహితుణ్ని చూద్దామని ఇద్దరూ బైటికి నడిచారు. కాంపౌండ్‌లో వున్న మిత్రులకు ఏమైనా అవసరమేమో కనుక్కున్నాడు బాలూ. ఒకరి తరవాత ఒకరుగా టీలు తాగేసామనీ, సిగరెట్లున్నాయనీ, తమ విషయం వదిలేసి అసలు విషయం చూసుకొమ్మనీ చెప్పేశారు వాళ్ళు. ఎవరి మనస్తత్వం ఎలాంటిదైనా బాలూ, రోనీ అందరితోనూ కలుపుగోలుగా స్నేహపాత్రంగా వుంటారు. అందువల్ల వాళ్ళిద్దరికీ అన్నిరకాల స్నేహితులూవున్నారు. ఐతే వీళ్ళు వాళ్ళదారికి వెళ్ళే ఆలోచన చెయ్యరు. అలాగే వాళ్ళూ, వీళ్ళదారికి రావాలనీ అనుకోరు. ఇక దౌర్జన్య ప్రవృత్తి వున్నవాళ్ళు నాయకులుగా చెలామణీ కావటం మామూలే. అది విద్యార్థుల్లో మరీ ఎక్కువగా వుంటుంది. ఐతే యిలాంటివాళ్ళలో ఒక స్వభావం స్పష్టంగా కనిపిస్తుంది. తమ స్వభావానికి సంబంధించినవాళ్ళతో యిట్టే స్నేహం చేస్తారు. అలాగే ఒకసారి స్నేహం కలిసిన తరవాత వాళ్ళకోసం ఏమైనా చేస్తారు. తమ వీరత్వం తమ మిత్రులకు ఉపయోగపడుతున్నదనే స్నేహభావంతోనో, లేక తమ శక్తిసామర్థ్యాలు చూపించుకునే అవకాశం వచ్చిందనే సంతోషంతోనో మొత్తానికి తమ సహాయం కోరిన మిత్రులకు తోడ్పడటానికి చేయూతనిస్తారు. అలాగే వీళ్ళల్లో నాయకత్వలక్షణాలున్నవాళ్ళు తొందరగా ఉద్రేకపడరు. వీలైనంతవరకూ తమ శక్తిని ఎదుటవాడు గుర్తించి తప్పుకొనిపోయేటట్టు సామరస్యంగా వ్యవహారం కొనసాగిస్తారు. ఐతే ఒకసారి అదుపు తప్పితేమాత్రం ఎవర్నీ లెక్కచేయరు. అవన్నీ ఆలోచించి, వీలైనంతవరకూ మాటలతోనే పరిష్కరించుకోవాలనే అభిప్రాయంతోనే, కేవలం ఆత్మరక్షణార్థం వాళ్ళ సహాయం కోరాడు రోనీ. అతను తను సీనియర్‌గా కూడా వాళ్ళకు ఒక అభిమానం వుండటంతోనూ, బాలూ స్వయంగా పిలవటంతోనూ అందరూ ఉత్సాహంగా వచ్చేశారు.

రోనీ, బాలూ కాస్సేపు హోటల్లో కూర్చుని చర్చించుకున్నారు. వీలైనంతవరకూ రిజిస్ట్రేషన్ పని పూర్తయ్యేదాకా బైటపడకుండా వుండటమే మంచిదనుకున్నారు. ఆ తరువాత ఎలాగూ పోలీసులుగానీ, ఎవరూగానీ ఏమీచేయలేరు. ఈలోగా ఎవరూ దాడి చేయకుండా చూడటానికి ఇంటిదగ్గర మిత్రులున్నారు. మరి కాస్సేపట్లో జోగిందర్ వచ్చేస్తే ఏ గొడవా జరిగే అవకాశమే వుండదు. గుళ్ళో ఏర్పాట్లు మిత్రులు చూసుకుంటారు. అట్నించటే రిజిస్ట్రారాఫీసుకు వెళ్ళాలనుకున్నారు. ఫొటోలకు రోనీ కమేరా గదిలో వుంది. వీలుచూసుకుని తెచ్చుకోవాలి. పెళ్ళి పురోహితులు చిక్కడపల్లిలో దొరుకుతారని రోనీకి గుర్తొచ్చింది. సాయంత్రం తొమ్మిది నుండి పదీపదిన్నరవరకూ అక్కడ అన్నిరకాల పౌరోహిత్యం చేసేవాళ్ళూ వుంటారు. వెళ్ళగానే తెలిసిపోతుంది. వెంటనే బాలూ యింటికెళ్ళి తన మిత్రులు తెచ్చిన మోటారు సైకిల్ తీసుకొస్తానన్నాడు. మూడు రకాల సిగరెట్ పాకెట్లు ఒక డజన్ కొని వాళ్లకు యివ్వమని చెప్పాడు రోనీ. ఐదు నిమిషాల్లో బాలూ మోటార్‌సైకిల్ తీసుకుని వచ్చాడు. ట్యాంక్‌నిండా పెట్రోల్ పోయించుకుని చిక్కడపల్లిలో ఒక పురోహితుణ్ని మాట్లాడుకుని, ఎనిమిదిన్నరకల్లా గుడిదగ్గరకొచ్చేయమని చెప్పి మళ్ళీ అన్నీ పునరావృతం చేసుకున్నారు. అప్పుడు హఠాత్తుగా గుర్తొచ్చింది రోనీకి, లాయర్‌నెవరినైనా అడిగి సలహా తీసుకోవాలనుకున్న విషయం. వెంటనే బయలుదేరాడు.

తనకు తెలిసిన లాయర్ దగ్గరికెళ్ళి హిందూ మ్యారేజ్‌లా గురించి వివరాలు అడిగాడు. అతను ప్రభుత్వోద్యోగి అయినంత మాత్రాన పెళ్ళి చెల్లదనుకోకూడదు. తన భార్యతో అనారోగ్యకారణాల వలన రెండోపెళ్ళి చేసుకొమ్మన్నానని రాయించుకుంటే యిబ్బందులు ఎదురవుతాయని చెప్పాడు. ఇద్దరూ కలిసి వున్నంత మాత్రాన, హిందూ సంప్రదాయం ప్రకారం పెళ్ళి చేసుకున్నట్టుగా ఎలాంటి సాక్ష్యమూ లేకపోతే అందులో చట్టం కల్పించుకునేదేమీ లేదని వివరించారు.

ఉత్తరభారతదేశంలోని కొన్ని రాష్ట్రాలలో 'సహజీవన ఒప్పందం' అని ఒకటి వ్యాపిస్తున్నది. దీనిప్రకారం ఒక పెళ్ళయిన పురుషుడు, మరొక పెళ్ళికాని స్త్రీని తన స్నేహితురాలిగా స్వీకరిస్తూ, జీవితాంతం ఆమెను పోషిస్తాననీ, తన వలన ఆమెకు కలిగే సంతానానికి

బాధ్యత వహిస్తాననీ, అలాగే ఆ స్త్రీ ఆ పురుమనికి తాను విశ్వాసపాత్రంగా వుంటాననీ పేర్కొంటూ స్టాంపు పేవర్లపైన తమ ఒప్పందా న్ని రానుకుని వాటిని రిజిష్టర్ చేసుకుంటున్నా రు. ఆయారాష్ట్రాలలో అమల్లో వున్న స్టాంపు డ్యూటీననునరించి నిర్ణీత విలువగల స్టాంపు పేవర్లమీద రానుకున్న ఈ ఒప్పందాలను 'రిజి స్ట్రేషన్ యాక్ట్ 1908' కింద రిజిష్టరు చేస్తున్నా రు. 'హిందూ మ్యారేజ్ యాక్ట్1955' ప్రకారం వివాహం చేసుకున్న స్త్రీపురుషులకు సంక్ర మించే హక్కులూ, బాధ్యతలూ ఆవిధంగా చేసుకోనివారికి వర్తించే అవకాశంలేదు. హిందూశాస్త్ర ప్రకారంగా సంప్రదాయ వివాహం చేసుకున్న జంటలన్నీ ఈ చట్టం పరిధిలోకి వస్తాయి. ఈ చట్టంప్రకారం, పెళ్ళిచే సుకున్న స్త్రీకి వుండే హక్కులు, అలా చేసుకు న్న స్త్రీ బతికివుండగాగానీ, చట్టప్రకారం విడా కులు తీసుకోకుండాగానీ ఆమె భర్త మరొకరితో దాంపత్యసంబంధాలు పెట్టుకున్నంత మాత్రాన ఆ మరొక స్త్రీకి యీ హక్కులు సంక్రమించవు. అంటే మామూలుగా చెప్పా లంటే రెండో భార్యకు తన భర్త మీద ఎలాంటి హక్కులూ వుండవు. కానీ ఈ 'సహజీవన ఒప్పందం' రిజిష్టర్ చేసుకోవటం వలన సమా జంలో 'ఉంపుడుకత్తె'గా వ్యవహరించబడే రెండో భార్య, లేదా స్నేహితురాలికి కొన్ని పరిమిత హక్కులూ సంక్రమించే అవకాశం వుంది.

ఐతే ఈ ఒప్పందాలను రిజిష్టర్ చేసినప్పటి కీ వీటికి కోర్టులలో పరిగణన లభించే అవకాశా లు లేవు. ఎందుకంటే భార్య వుండగా మరొక స్త్రీకి భార్య స్థానం కల్పించటమనే చట్టవ్యతిరే కమైన పనికి ఈ ఒప్పందాలు దారి తీస్తు న్నాయి. చట్ట వ్యతిరేకమైన ఒప్పందాన్ని చట్ట ప్రకారంగా (అంటే రిజిష్టర్ చేసుకుని, స్టాంపు డ్యూటీ చెల్లించి) చేసుకున్నప్పటికీ ఆ ఒప్పందం చెల్లదు. అందువల్ల 'కాంట్రాక్టు యాక్టు 1872' లోని సెక్షన్ 23, సెక్షన్ 24ల ప్రకారం ఈ 'సహజీవన ఒప్పందాలు' చెల్లవని న్యాయశాస్త్ర నిపుణుల అభిప్రాయం. అంతే కాదు, రిజిస్ట్రేషన్ యాక్ట్ సెక్షన్ 22 (J) ప్రకారం కూడా ఈ ఒప్పందాలు చెల్లవని చెప్పవచ్చు.

అందుచేత ఉంపుడుకత్తెగాగానీ, రెండోభా ర్యగాగానీ, స్నేహితురాలిగాగానీ ఏ హోదాలో నైనా ఒక పురుమనితో కలిసివున్న స్త్రీకి అతని మీదగానీ, ఆ స్త్రీ పైన అతనికిగానీ ఒకరిపట్ల ఒకరికి చట్టపరంగా ఎలాంటి హక్కులుగానీ బాధ్యతలుగానీ లేవని చెప్పుకోవాలి వారి ఇద్దరిమధ్యా లిఖిత పూర్వకమైన ఒప్పందం లేనప్పుడు చట్టం కల్పించుకునే ప్రసక్తేలేదు. లిఖితపూర్వకమైన ఒప్పందం వున్నప్పటికీ అది రిజిస్టర్ చేయబడకపోయినా చట్టం ప్రమే యంవుండదు. ఒకవేళ రిజిస్టర్ చేయబడిన ప్పటికీ, అది చట్టపరిధిలో విలువలేనిదనే చె ప్పుకోవాలి. కనుక ఒక పెళ్ళయిన మగవాడితో గానీ, పెళ్ళికాని మగవాడితోగానీ అవగాహనాప రంగా కలిసివున్న స్త్రీకి అతనిపట్ల ఎటువంటి చట్టపరమైన బాధ్యతాలేదు. అలాగే అతని పట్ల ఆమెకు హక్కుకూడా లేదు''

లాయర్‌కు కృతజ్ఞతలు చెప్పుకుని బైటికి నడిచారు రోనీ, బాలూ. ఇద్దరూ మరునాటి ఏర్పాట్ల గురించి చర్చించుకుంటూ, కెమేరా తీసుకుపోవటానికి రోనీ గదికి వెళ్ళారు. అతని కోసం ఎవరో మోటార్‌సైకిళ్ళపైన వచ్చి వెళ్ళా రని పక్కనున్నతను చెప్పాడు. వెంటనే కె మేరా, బ్యాంకు పాసుబుక్కూ తీసుకుని బైటకు నడిచారిద్దరూ. రేవతీ, రోనీ కలిసి ఎక్కువగా మాట్లాడుకోవడం, తను చెప్పిన విషయం హఠాత్తుగా ఒప్పుకున్న రేవతి, అంతకన్నా హఠాత్తుగా మాయం కావటం, అదీ హైదరా బాద్‌లో జరగటం, రోనీ స్వభావం - అన్నీ కూడబలుక్కుని, రోనీ ఆమెను పెళ్ళిచేసు కుంటాడని అనుకోకపోయినా, ఆమెకు వెనక

నున్న ధైర్యం అతనే అయివుంటాడనీ, రేవతి ఉనికి రోనీకి తెలిసివుంటుందనీ కృష్ణకుమార్ అంచనావేశాడని యిద్దరూ అర్థంచేసుకున్నా రు. మరింత జాగ్రత్తగా వుండాలని నిర్ణ యించుకుని యింటి దారిపట్టారు.

అనుకున్న ప్రకారం జోగిందర్ వచ్చేశాడు. అన్నీ చర్చించుకున్న తరవాత జోగిందర్‌కూడా పెళ్ళయిన తరవాత హరీందర్ సమక్షంలో కృష్ణకుమార్‌కు తెలియజేస్తే సరిపోతుందని

చెప్పేసాడు. వంతులవారీగా నిద్రపోతూ అందరూ అప్రమత్తంగా వున్నారు.



తెల్లవారింది. ఎనిమిదికల్లా అందరూ గుడి దగ్గరికి చేరుకున్నారు. స్వప్నా మయూరీ కలిసి రేవతికి పెళ్ళికూతురు ముస్తాబుచేశారు. గౌతమి కూడా సెలవుపెట్టింది. కానీ శివలక్ష్మి మాత్రం తను ఆరోజున సెలవు పెట్టడం కుదరదనీ, సాయంత్రం పూట కలుస్తాననీ చెప్పి వెళ్ళిపోయింది.

మయూరి తీసుకొచ్చిన టేప్‌రికార్డర్‌లోని సన్నాయిమేళాలమధ్య బాలూ ఫొటోలు తీయగా పెళ్ళిపూర్తయిపోయింది. పదకొండుకల్లా రిజిస్ట్రారాఫీసుకు వెళ్ళారు. రిజిస్ట్రేషన్ పూర్తయిన వెంటనే అందరినీ దిగవిడిచి, రోనీని, యిద్దరు మిత్రుల్నీ వెంటబెట్టుకుని హరీందర్ దగ్గరికి దారితీశాడు జోగీందర్. అటుపక్కనున్నది తన సమవుజ్జీయేకాక తన మేనల్లుడూ అయిన జోగీందర్. మరోవంక చూస్తే పెళ్ళి రిజిస్టర్ అయిందనీ, ఎలాంటి లొసుగులూ లేవని చెబుతున్నాడు. తన పెద్దమనిషి తరహా నిలబెట్టుకోవడమే మంచిదని నిర్ణయించుకున్న హరీందర్, వాళ్ళను అభినందించి, పంపించేసి, తన మిత్రుడైన కృష్ణకుమార్‌ను ఓదార్చి, మరిక ఆ పిల్లను మరచిపొమ్మనీ, ఎలాంటి ప్రయత్నాలు చేసినా తన సహకారం వుండదనీ హెచ్చరించి వరంగల్‌కు పంపించేశాడు.

బాలూ ప్రతిపాదనను గౌతమి అంగీకరించిన మీదట పెళ్ళికి సహకరించిన మిత్రులందరికీ గౌతమి యింట్లోనే చిన్న విందు ఏర్పాటుచేశాడు రోనీ. మళ్ళీ వధూవరులిద్దరూ స్నేహితులు తీసుకొచ్చిన మాలలు మార్చుకున్నారు.

"తెలిసో తెలియకో ఒక మగవాడిని నమ్మి అతనితో కలిసున్న స్త్రీ, మోసపోయానని తెలుసుకుని విడిపోవాలంటే యింత తతంగం చేయకతప్పదా రోనీ" అడిగాడు బాలూ.

"తెగించి నిర్ణయం తీసుకునేవాళ్ళకు మంచి మిత్రులు ఎప్పుడూ తోడుగా, అండగా వుంటూనే వుంటారు. ఆ మాటకొస్తే కులాంతర, మతాంతర వివాహాలు చేసుకుంటున్నవాళ్ళకు కూడా ఈ అవస్థలు తప్పటంలేదు. హత్యలకూ, దౌర్జన్యాలకూ గురవుతున్నవారు బలైపోతున్నా ధైర్యంచేసేవారు చేస్తూనేవుంటారు. ఏ విషయంలో అయినా అంతే బాలూ"—

క్షణంపాటు ఊపిరితీసుకుని మళ్ళీ కొనసాగించాడు—

"మా పెళ్ళి విషయంలో అనేకులు అనేకరకాలుగా అనుకోవచ్చు. కానీ అలా అనుకునే ముందుగా అసలు పరిణామానికి కారణమేమిటని కూడా ఆలోచించాలి.

ప్రతి సమాజానికి కొన్ని కట్టుబాట్లుంటాయి. వాటిని గాలికొదిలేయటమే నాగరికత అని నేను చెప్పను. కానీ మన సమాజంలో స్త్రీ శారీరకశీలానికి అనవసరమైన ప్రాధాన్యత వుండటం వల్ల స్త్రీజాతి పురోభివృద్ధిని సంప్రదాయమనే గాటకు కట్టేసినట్టు అయ్యిందనుకుంటాను.

విలాసం కోసం, సుఖంకోసం, ఒళ్ళు కొవ్వెక్కిన మదంతోనూ, కళ్ళు మూసుకుపోయిన కామంతోనూ స్త్రీతో అనుభవం పంచుకునేమగవాణ్ని వదిలేసి కేవలం ఆడదాన్నే నిందించటం భావ్యమేనా? తిరుగుబోతు మనస్తత్వం వున్న వాళ్ళనూ, రేప్ చేయబడినవాళ్ళనూ, బతుకుతెరువుకోసం ఒళ్ళమ్ముకునే వాళ్ళనూ, అమాయకంగా కన్నెతనం పోగొట్టుకున్న వాళ్ళనూ, సరదాకు ఎఫైర్స్ నడిపేవాళ్ళను, చివరకు మగవాడితో శారీరకసంబంధాలు లేకుండా తమ బతుకుతాము బతుకుతున్న ఒంటరి ఆడవాళ్ళనూ ఒకే గాటనకట్టటం వలన ఏమవుతోంది? మగవాడి అండలేని ఆడది బతకలేని స్థితికిరావటం వలన, వరకట్నాలు యిచ్చుకోలేనివాళ్ళూ, అనేకానేక పరిస్థితుల ప్రభావంతో సరయిన వయసులో

సరైన వ్యక్తిని పెళ్ళి చేసుకోలేని వాళ్ళూ—వయసుమీరిన వాళ్ళనో, దుష్టులనో, దుర్మార్గులనో, చివరకు పెళ్ళయి భార్య బతికున్నవాళ్ళనో ఆశ్రయించి, పెళ్ళిచేసుకుని, జీవితం పంచుకునీ- ఎలాగోలా బతకాల్సిన పరిణామానికి సమాజమే కదా కారణం. మరీ అదే మనుషులు తమ జీవితాలను చక్కదిద్దుకుంటున్నప్పుడు సంస్కృతి, సంప్రదాయాలపేరిట విమర్శించే సమాజాన్ని ఎదిరించక తప్పదుకదా.

పాశ్చాత్య దేశాల్లో అయితే ఒంటరిగా బతకాలనుకున్న స్త్రీలకు ఏదో నెపంమీద సమాజం తనను చిన్నచూపు చూస్తుందన్న వెరపులేదు. ఆ సంస్కారం లోపించిన సమాజాలలో సంస్కృతి పేరుతో జీవితాలు బలైపోతున్నాయి. ఒంటరిగా బతుకుతున్న ఆడది శీలవతి కాదేమోనన్న అనుమానం, తనకు సరైన జీవిత భాగస్వామి దొరికేవరకైనా ఒంటరిగా జీవించగోరిన స్త్రీకి తన శీలానికి రక్షణ వుండదేమోనన్న భయం, తను శారీరక శీలాన్ని కోల్పోవలసివస్తే ఎలా బతకాలన్న సంకోచం - ఇవి లేకపోతే స్త్రీలకు స్వాతంత్ర్యం ఎప్పుడో వచ్చేదంటే అతిశయోక్తి కాదు. కాదంటారా?''

గౌతమిని గాలికొదిలేసి వెళ్ళిన తన తండ్రి గుర్తొచ్చాడు బాలూకు. రోనీ చెప్పినమాటలు మననం చేసుకుని నిట్టూర్చాడు- అంత ఆనందమయంలో తన పిన్ని మనసులో ఎంత విషాదం నిండి వుందోనని తలపోస్తూ.

అందరూ కబుర్లలోపడిపోయారు. తమ తమ అనుభవాలలోని ప్రేమ వివాహాలూ, సాంప్రదాయ వివాహాల పరిణామాల గురించి ఎదుటివారికి వివరిస్తూ, చర్చిస్తూ, వాదిస్తూ పెళ్ళి వాతావరణాన్ని కనిపింపజేస్తున్నారు.

అప్పుడే యింటి ముందొక కారు ఆగింది. స్వయంగా డ్రైవ్ చేసుకుంటూ కార్లో దిగిన ఆ అమ్మాయిని చూసి, ఆమె వాలకానికి అందరూ ఆశ్చర్యపోయారు. దాదాపు పార్టీ అయిపోయి చాలామంది వెళ్ళిపోయారు. మొత్తం మీద పదిమంది దాకా వున్నారు యింట్లో.

ఆ అమ్మాయి ఒక అనాథ. అనాథాశ్రమం వారు చూపించిన ఒక చిన్న ఉద్యోగాన్ని ఆసరాగా తీసుకుని ప్రపంచంలోకి అడుగుపెట్టింది. ఆమెకో జోడైన అబ్బాయి పరిచయమయ్యాడు. ఇద్దరూ పెళ్ళి చేసుకుందామనుకున్నారు. సహజంగా వున్న అభద్రత భావన కొద్దీ తమ పెళ్ళిని రిజిస్టర్ చేసుకుందామన్నదా అమ్మాయి. అలాగేనని అతను ఒప్పుకున్నాడు. ఇద్దరూ గుళ్ళో మాలలు మార్చుకున్నారు. ఒక టైప్ చేసిన స్టాంప్ పేపర్స్ సెట్ తీసుకొచ్చి తను సంతకం చేసి, ఆమెతోనూ చేయించాడతను. ఇద్దరూ రిజిస్ట్రాఫీసుకు వెళ్ళారు. అక్కడ మళ్ళీ ఆ కాగితాల మీద సంతకాలు చేశారు. ఆ ఒప్పందం రిజిస్టర్ అయింది. అదే రిజిస్టర్ మ్యారేజ్ అనుకుని మురిసిపోయిందా అమ్మాయి.

ఇద్దరూ అయిదారు నెలలు కలిసున్నారు. ఆ తరవాత తెలిసిందా అమ్మాయికి- అతనికి అంతకుముందే పెళ్ళయిందని, అతని భార్యే తను పనిచేస్తున్న కంపెనీకి అసలు యజమాని అనీ, అతను వ్యవహారాలు నడిపిస్తుంటాడనీ తెలుసుకుంది. అంతవరకూ అంత చక్కని భర్త దొరికినందుకూ, భర్త దగ్గరే సెక్రెటరీగా పనిచేస్తూ అతనితో కలిసి వుంటున్నందుకూ ఎంతో మురిసిపోయిన ఆ అమ్మాయికి, అతను తన తల్లితండ్రులకు చెప్పటానికి సమయం పడుతుందని ఎందుకు మభ్యపెట్టాడో అప్పుడు అర్థమయింది. తమ ఒప్పందానికి విలువేమీ వుండే అవకాశం లేదని తెలుసుకుంది. క్రమంగా అతని అసలు రంగు బైటపడింది. వెంటనే ఒక ఆలోచనవేసుకుని ఒక నిర్ణయం తీసుకుంది. అతనికి పెళ్ళయినందుకు తనకు బాధేమీ లేదనీ, తను హాస్టల్లో వుంటాననీ, తాము ఎప్పట్లాగే కలుసుకుంటూ వుండవచ్చుననీ అతనికి చెప్పి నమ్మించింది.

ఆమెను ఆరు నెలలపాటు భ్రమలోవుంచిన అతను ఏడాదిపాటు అదే భ్రమతో వున్నాడు. ఆమెతో హాయిగా తిరిగాడు. జల్సా చేశాడు. మోజు తీరిననాడు ఆలోచిద్దామని అనుకుని వుంటాడు. ఆ అమ్మాయి ఏం చేయాలి అని అనుకుంది? ఏం చేస్తే న్యాయంగా వుంటుంది?

"ఈ ప్రశ్నలకు జవాబులు మిమ్మల్ని అడగటం లేదు. ఎందుకంటే నేను ఏంచేయాలని నిర్ణయించుకున్నానో ఎవ్వరికీ చెప్పలేదు. ఎందుకంటే అనాథగా, పలకరించే తోడు

[illegible], ప్రేమ [illegible] నను
అతను నాకు చూపించిన ఆశకు అతని భార్య నవుదామనుకోలేదు. అతను చూపించిన ప్రేమ నిజమైనదనుకుని నమ్మాను. నా మనసులో రేగిన కల్లోలం యితరులకు అర్థమవుతుందో లేదో నాకు తెలియదు. నా విషయాన్ని యితరులతో చర్చిస్తే వారు నా నిర్ణయాన్ని తప్పు పట్టవచ్చు. అందులోని తప్పొప్పుల్ని చర్చించవచ్చు. వాళ్ళ అభిప్రాయాలు నా నిర్ణయాన్ని నీరుగార్చవచ్చు. నా పట్టుదల సడలిపోవచ్చు. అందుకే నా విషయం నాలో నేనే దాచుకున్నాను. దాని అమలుకు ఈ రోజును నిర్ణయించుకున్నాను.

ఈ రోజు అతనికి స్వర్గసుఖం చూపించాలనుకున్నాను. అందుకు ఆఫీసే ఎంత బాగుంటుందో, ఎందుకు బాగుంటుందో వివరించి ఒప్పించాను. గూర్ఖాలను కూడా పంపేశాడు. నిజంగానే స్వర్గాన్ని చూపించానని అన్నాడు తాగినమైకంలో. ఎందుకంత సుఖం చూపించానంటే, బాధ అనుభవానికి వస్తే అది సుఖం తరవాత అయితే అందులోని బాధ ఎన్నోరెట్లు పెరుగుతుంది. వలపుతో బంధిస్తాననుకుని ఆదమరిచి వున్న వాణ్ని తాళ్ళతో బంధించటం ఎంతసేపు? ఆ తరవాత ఒక గంటసేపు, పది పెట్రోల్ బంకుల్లో పది టిన్నుల పెట్రోలు సేకరించటం డబ్బులుంటే అనుకున్నంత కష్టం కాదని తెలిసిపోయింది. ఆ గంట తరవాత ఒక అరగంట పాటు చిత్రకథ. ఏ ఆఫీసుకు నన్ను యజమానురాలిని చేస్తానని ఆశ చూపిస్తూ వల్లో వేసుకుంటున్నాననుకున్నాడో అదే ఆఫీసులో, లక్షల విలువైన స్టాకు ఈ రోజే వుంటుందని ఈ రోజే ఎన్నుకున్నాను.

"ముందుగా తన ప్రాణం తీయొద్దని వేడుకున్న మాటలు, అబ్బ... ఏ సంగీతం కూడా అంతకన్నా కర్ణపేయంగా వుండదు. ఆ తరవాత తనుపోయినా, తన భార్యా, పిల్లలూ సుఖపడకుండా కంపెనీ మొత్తం తగలబడుతుందని తెలుసుకుని అన్న మాటలు ఏ సాహిత్యం కూడా అంత మధురంగా, ఆహ్లాదంగా వుంటుందనుకోను. కాకపోతే ఎంతో సుందరమైన దృశ్యాలను మరిపించే ఆ దహనకాండను మాత్రం చూడకుండా వచ్చేశాను. పదిచోట్ల పెట్రోలు మడుగుల్లో పది కొవ్వొత్తులు, నేనొచ్చే ముందు వెలుగుతూ వెలుగునిస్తున్నాయి. ఆ తరవాత మండుతూ, మండిస్తుంటాయి. కానీ నా మనసులోని మంటలంత తీవ్రంగా వుంటాయా ఆ మంటలు... వుండవు. నేను రాక్షసిననుకుంటున్నారా? అలాగే అయితే ఎందుకయ్యానంటారు?

"ఆ మంటల్లో నేనూ ఎందుకు చావలేదనే చచ్చు ప్రశ్న వద్దు. నేనెందుకు చావాలి? పోలీసులకు లొంగిపోతాను. ఇంక సంతోషసమయంలో ఒక నరకాసురుణ్ని చంపే దీపావళి వెలుగులు సృష్టించి వచ్చానని సంతోషంగా మీకు చెప్పి సెలవు తీసుకోవాలని వచ్చాను. నా అంతట నేనెందుకు చావాలి? నాకు ఉరిశిక్ష విధించి చంపదలుచుకుంటే ఈ సమాజమే చావాలని చెబుతున్నాను. అవును... నేనెందుకు చావాలో చెప్పి చావండే" నవ్వుతూ అంటున్న శివలక్ష్మిని అందరూ బ్రమ్నపడి చూస్తుండిపోయారు.

కాస్సేపటికి వాళ్ళందరూ వెంటరాగా పోలీస్‌స్టేషన్ వైపు దారి తీసింది శివలక్ష్మి.

★ ★ ★

మెడలో వేసే మూడుముళ్ళ బంధం, ఆ లోపలున్న గొంతునుండి వచ్చే మాటల్లాగా కాక మరింత లోతునున్న హృదయాంతరాళం నుండి మొలకెత్తే అనుబంధంలాగా వుండాలి.

అలా లేనప్పుడు

మూడుముళ్ళ బంధానికి నాలుగోముడి పడుతుంది.

అలా లేనప్పుడు నాలుగోముడికి కూడా విలువే వుండదు.

అలా లేనప్పుడు...

వరకట్నాల చావులూ, రెండో పెళ్ళిళ్ళూ, మూడో పెళ్ళిళ్ళూ...

ఆడదాని మనసును మరిచి శారీరక శీలాన్నే గుర్తించే సమాజంలో ఆత్మహత్యలూ, హత్యలూ, వ్యథిత హృదయాల రోదనలూ, వేదనలూ...

నిరంతరం...

అనంతం...

అనివార్యం.... ★

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే· అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

**మార్చి 'చతుర' నవల: నాలుగోముడి**

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................



# చతుర ప్రపంచం

## సీమగళ్ళ సీమలో...

సినిమా పాటల్ని ఇట్టే నోటికెక్కించుకునే పిల్లలు పాఠాలూ, పద్యాలూ కంఠతాపట్టడానికి నానాఅవస్థలూ పడుతుంటారు. పద్యంలోని మొదటి పంక్తి చెప్పి ఆతర్వాత నీళ్లునమలటం మొదలెడతారు. చివరివరకూ చెప్పినా మధ్యలో ఎన్నోపదాలు మాయం అవుతుంటాయికూడా. కానీ నర్సరీ క్లాసుల్లో నేర్చుకున్న నీతిపద్యాలూ, రైమ్సూ వంటివి మాత్రం ఎన్నాళ్లయినా మర్చిపోరు. ఇందుకు ప్రధానకారణం ఆ రైమ్సులోగల శ్రావ్యత, లలిత లలిత పద సముదాయమే.

సీమాచటర్జీ అనే ఓ బెంగాలీ యువతి పిల్లల ఈ మనస్తత్వాల్ని అర్థం చేసుకుని వారి జ్ఞాపకశక్తిని పెంపొందించేందుకు, కఠినమైన పద్యాలుసైతం సులువుగా జ్ఞాపకం వుండేందుకు ఒక కొత్త పద్ధతిని ఇటీవల ప్రవేశపెట్టింది. మహారాష్ట్ర ప్రభుత్వం నిర్దేశించిన సిలబస్‌ని ఫాలో అవుతూ 5,6,7వ తరగతి విద్యార్థులకు ఉపయోగపడే 19 హిందీ పద్యాలను రాగయుక్తంగా, అర్థవంతంగా పాడి ఒక కాసెట్‌లో రికార్డు చేసింది. 'ఉపహార్' అనేపేరుతో ఈ కాసెట్టును మార్కెట్లో విడుదలచేసింది. ఈ కాసెట్టు వినటంతో స్కూలు విద్యార్థులు అన్ని పద్యాల్నీ సులువుగా అప్పజెప్పగలుగుతున్నారు.

కాసెట్టు ప్రారంభంలో సరస్వతీ ప్రార్థన ఉంటుంది. ప్రతి పద్యం ప్రారంభించే ముందు "ఓ భగవంతుడా... ప్రపంచానికి సేవచేసే అవకాశం ప్రసాదించు" అనేవాక్యం చదువుతుంది సీమ. పద్యం ప్రారంభించక ముందు ఆ పద్యంలోని భావార్థం చక్కగా విడమర్చిచెబుతుంది. అన్ని పద్యాలకూ జనరంజకమైన సంగీతం సమకూర్చింది. జిల్ మల్ కర్తేతారే, చుద్రా, కోరస్ ఆఫ్ బర్డ్స్, లోరి, మై అంబ్రెల్లా, అవర్ కంట్రీ, వి పీపుల్ ఆఫ్ ఎ



సైంటిఫిక్ వరల్డ్, నొ డిఫిట్ ఫర్ అజ్, బావు, ది కైట్, ది డాన్, ది రెయిన్ గాడెస్, అవర్ మదర్ వరల్డ్- మొదలైనవి ఆ కాసెట్‌లో

ప్రధానంగా వున్నాయి. పద్యంలోని భావానికి, సన్నివేశానికి సరిపోయేలా రాగాలను సమకూర్చారు సీమ. ఉదాహరణకి పద్యంలో సూర్యోదయానికి సంబంధించిన వస్తువు అంశంగా వున్నప్పుడు ఆమె దానికి సూర్యోదయాన్ని స్ఫురింపచేసే రాగాన్నే సమకూర్చారు. ఈ విధమైన విశ్లేషణతో అది మరింత జనరంజకమైంది.

సీమకి చిన్ననాటినుండీ సంగీతంపట్ల అమితమైన ఆసక్తి. రాజస్థాన్‌లోని అజ్మీర్‌లో ఆమె 38 ఏళ్లక్రితం జన్మించారు. అక్కడే బి.ఎ. వరకూ చదువుకున్నారు. 1971లో వివాహమై బొంబాయికి వచ్చాక ఆమె బి.యిడి, ఎం.ఎ డిగ్రీలు పుచ్చుకోవటం జరిగింది. 1973 నుండి బొంబాయిలోని కళ్యాణ్ స్కూల్లో టీచర్‌గా వున్నారు. మ్యూజిక్ క్లాసులను కూడా ప్రైవేట్‌గా నిర్వహిస్తారామె. "హిందీ మన రాష్ట్రభాష! జాతీయస్థాయికి దీన్ని తీసుకువెళ్లాలనే నా ఈ ప్రయత్నమంతా! జ్ఞాపకశక్తి తక్కువగా వున్న విద్యార్థులకికూడా ఈ కాసెట్ ఎంతో ఉపయోగపడుతుంది" అంటున్న సీమ మంచికథలూ, నాటకాలూ రాశారు కూడా.

## శృతిమించిన గారాబం

ఇటలీలోని ఒకజంట ఏకైక సంతానమయిన తమ ముద్దులపట్టిని అత్యంత గారాబంగా పెంచారు. అమ్మాయిగారు 'కా' అంటే 'కా' 'కీ' అంటే 'కీ' అనేవారు. అలాపెరిగిన ఆముద్దుగుమ్మ పదిహేనేళ్లు వచ్చేసరికల్లా ఎలాజరిగిందో గాని మాదకద్రవ్యాలకు బానిస అయిపోయింది. వాటినికొనుక్కోవడానికి డబ్బు కావాల్సొస్తే, ఆడబ్బు సంపాదించడానికి వ్యభిచారం మొదలుపెట్టింది. అలానాలుగేళ్లు జరిగాక తలిదండ్రులు తమకుమార్తె రాసలీలల సంగతి తెలుసుకొని కట్టుదిట్టంచేయబోయారు. కానీ ఆరాలుగాయిని కంట్రోల్‌చేయడం వారితరంకాలేదు. చివరికి డ్రాయింగ్‌రూమ్‌లోని సోఫాకి గొలుసుతో కట్టేశారట. ఆ అమ్మాయి పెద్దగా అరిచి కేకలుపెట్టటంతో ఆదారిన వెళుతున్న పోలీసుగారు వచ్చి ఈ అబలను బంధవిముక్తురాలినిచేసి, కట్టేసిన తలిదండ్రులమీద కేసురానుకొని తనవిధినిర్వహణగావించాడట. కోర్టువారు తల్లిదండ్రులకు రూల్సుప్రకారం మూడునెలల కఠినకారాగార శిక్ష విధించడంతో అమ్మాయిగారికి అడ్డూఅవూ లేకుండా పోయిందట. ఇంకేం యధాప్రకారం వ్యభిచారంచేస్తూ వచ్చిన డబ్బుతో మాదకద్రవ్యాలు కొనుక్కొని స్వైరవిహారం చేస్తోందట.





# హర్ష కథ

"సంతానము చూచియైనను సంతసించు భాగ్యమును ప్రసాదించుము" అంటూ యముణ్ణి డిమాండ్‌చేసింది అలనాటి సావిత్రి. పాపం! అంతటి యమధర్మరాజూ ఆక్షణాన ఆలోచనారహితంగా "ప్రసాదించితిని పొమ్ము" అన్నాడు. "ఇంకెక్కడికి పోయెదవు, భర్తలేకుండా సంతానమెట్లు?" అని అతన్నాపి మరో పద్యం అందుకుంది సావిత్రి. మొత్తానికి చిన్నట్రిక్కు ప్రయోగించి అయన్నోడించి పతి ప్రాణాల్ని భద్రంగా వాపసుతెచ్చుకుంది.

కానీ ఈరోజుల్లో అయితే "టెస్ట్‌ట్యూబ్‌ద్వారా మనుజలోకాన సంతానమే పడయవచ్చు"అని చెప్పేసి సత్యవంతుడి ప్రాణాల్తో పరారయ్యేవాడేమో ఆ యమధర్మరాజు.

"అపుత్రస్యగతిర్నాస్తి" అనేసూక్తిని తలచి వగచేవారి సమస్యను పరిష్కరించే ప్రయత్నంలో ఒకభాగంగా సైంటిస్టులు టెస్ట్‌ట్యూబ్ బేబీని పొందేవిధానాన్ని కనిపెట్టారు.

ప్రపంచంలో తొలిసారిగా టెస్ట్‌ట్యూబ్ విధానం ద్వారా జన్మించిన పాపకిపుడు తొమ్మిదేళ్ళు. లండన్‌లో ఈ పాప నిక్షేపంగా పెరుగుతోంది.

మనదేశంలో పుట్టిపెరుగుతున్న తొలి టెస్ట్‌ట్యూబ్ బేబీ వయసు ప్రస్తుతం రెండేళ్ళ నాలుగు నెలలు. ఆ బేబీకి హర్ష అని పేరుపెట్టారు. ఈ పాప తల్లి దండ్రులు మణి, శ్యాంజీ దంపతులకు చాలాకాలంవరకు సంతానం కలుగకపోతే డాక్టర్లని సంప్రదించారు. బొంబాయిలోని డాక్టర్ ఇందిరాఇందుజీ అనే గైనకాలజిస్టు వీరికొక ఉపాయం సూచించారు. 'ఫాలోపియన్ ట్యూబ్‌లు మణి గర్భకోశంలో మూసుకుపోయినందున శ్యాంజీ వీర్యాన్ని ఆమె గర్భకోశంలో ప్రవేశపెట్టి కృత్రిమ గర్భధారణ చేయించారు. తరువాత సిజేరియన్‌చేసి బిడ్డను తీశారు. ఐతే అసహజమైన పద్ధతిలో జన్మించిన ఈ పాపకి మంచి ఆహారం, అనువైన పరిసరాలను, శుభ్రమైన వాతావరణాన్ని కల్పించవలసివుంటుంది. కానీ పేదవారైన మణి, శ్యాంజీలు బిడ్డకు బలమైన ఆహారం సమకూర్చలేకపోయారు. అందుమీదట గుజరాతీ పత్రిక "చిత్రలేఖ" ఈ వార్త ప్రచురించి తొలిభారతీయ టెస్ట్‌ట్యూబ్ బేబీకి సాయపడమని పాఠకులను కోరింది. దాంతో పాఠకుల నుండి విరాళాల రూపేణా 25 వేల నగదు టెస్ట్‌ట్యూబ్ బేబీకి అందాయి. స్టేట్ బ్యాంక్‌వాళ్ళు పదివేల రూపాయల్ని సాయంగా అందించారు. బొంబాయి మున్సిపాల్టీ రెండు గదుల పక్కాఇల్లు సమకూర్చింది. అంతకు ముందు మురికివాడలో నివసించే ఆ కుటుంబం మంచిఇంటికి మారటంతో టెస్ట్‌ట్యూబ్ బేబీ హర్షకు కావలసిన ఆరోగ్యకరమైన వాతావరణం లభించింది. విరాళాలుగా లభించిన 35 వేల రూపాయల్ని హర్షపేరున బ్యాంకులో నిలువచేశారు. సమాజ సేవాసంస్థలు నందా సమితి, కతివడి సమాజంవంటివి బంగారునగల్ని హర్షకి అందించటం జరిగింది.

హర్ష కారణంగా మణి, శ్యాంజీలు కూడా మంచి జీవితం సంతోషంగా గడుపుతున్నారు. ఈ తొలి టెస్ట్‌ట్యూబ్ బేబీ దినదినప్రవర్ధమానమౌతూ పెరగాలని ఆశిద్దాం. ★

# ఏప్రిల్ చతురలో



పుస్తకం తెరిచినా, మూసినా ఆమె వూహలే అల్లరిపెడుతుంటే మారాం చేసే మనసుని అదుపు చెయ్యలేక సతమతమవుతున్నాడతను. అంతలో... ఆ రాత్రి వేళ... ఆమే అతని గదిలోకొచ్చింది.

"సుమా! నిద్రపోలేదా" అడిగాడతను.

"ఊఁహూఁ! నిద్రపట్టటంలేదు" అందామె.

తనేం అడగాలని వచ్చిందో అది అడగలేకపోయిందామె! తనేం చెప్పదలుచుకున్నాడో చెప్పలేకపోయాడతను. తెల్లవారితే ఆమె వూరికి వెళ్ళిపోతుంది. ఇద్దరి మనస్సుల్లోనూ... ఒక విధమైన ఆందోళన, మాటలకందని ఆనందం...

**వీళ్ళ స్నేహానికి పెద్దల ఆమోదం లభించిందా? విద్యావంతులైన ఆ యువజంట తీసుకున్న నిర్ణయం ఏమిటి?**

**వ్యక్తుల మధ్య బాంధవ్యాలు, ఆప్యాయతలు, అహంకారాలు కలిగిస్తున్న పరిణామాలకు అద్దంపట్టే ఇంద్రగంటి జానకీబాల సరికొత్త నవల 'నిజానికీ అబద్ధానికీ మధ్య' ఏప్రిల్ నెల 'చతుర'లో చదవండి.**




## జీతం

ఇంటర్వ్యూకి ఇంకా పదినిమిషాల వ్యవధి వుంది. కారిడార్‌లో అరుగురు అభ్యర్థులు సర్టిఫికెట్లున్న ఫైల్సు పట్టుకొని కూర్చున్నారు. అందరికీ ఆత్రంగానే వుంది. సస్పెన్స్‌గానూ వుంది. ఉన్న ఒక పోస్టుకి ఆరుగురు ఇంటర్వ్యూకి వచ్చారు అంటే కాంపిటీషన్ చాలా తక్కువన్నమాటే. ఈ నిరుద్యోగపర్వంలో ఇంటర్వ్యూకి ఇంత తక్కువ మంది హాజరుకావటం ఆశ్చర్యకరమే. బహుశా అది ఏమంత లాభసాటి కాని, సీనియర్ ఇన్‌స్ట్రక్టర్ ఉద్యోగం అవటమే కారణం అయుండొచ్చు. అందులోనూ ఆ వుద్యోగం ఇచ్చేది ప్రయివేట్ కాలేజి. జీతం ఎంతంటే అదంతా మేనేజ్‌మెంట్ దయ, ఉద్యోగి ప్రాప్తం అన్నట్లే వుంటుంది.

చూసిచూసి ఆ ఆరుగురిలో ఒకతను కదిలాడు.

"డియర్ ఫ్రెండ్స్... మనమంతా ఒక నిర్ణయానికి రావాలి" అన్నాడు.

అతనిపేరు దయానిధి.

"ఏమిటా అన్నట్టు చూసారు మిగతా అయిదుగురూ".

"ఇది ప్రయివేటు కాలేజి కాబట్టి సెలక్షన్‌లో మెరిట్‌ని పాటించరు. ఎవరు తక్కువ జీతానికి పనిచేస్తానంటే వారిని సెలక్ట్ చేస్తారు. కాబట్టి మన ఎకనామిక్స్ డిగ్రీల పరువు నిలబెట్టడానికయినా మనం అంతా ఒకే త్రాటిమీద, ఒకే మాటమీద నిలబడాలి. ఇంటర్వ్యూకి తక్కువ మందే హాజరయ్యారు కాబట్టి బహుశా మన డిమాండ్‌ని వారు స్వీకరించవచ్చు" అని ఆగాడు దయానిధి.

"ఇంతకూ మన డిమాండ్ ఏమిటి?" ఆసక్తిగా అడిగాడు అందరికన్నా ఎక్కువ మార్కులు వచ్చినతను.

"ఏముంది! గవర్నమెంటు స్కేలు ప్రకారం సీనియర్ ఇన్‌స్ట్రక్టర్‌కి పన్నెండువందల రూపాయలు శాలరీ ఇవ్వాలి. కానీ వీళ్లు అంత ఇవ్వరు. సహజంగానే మనతో బేరమాడి అయిదువందలకో, ఆరువందలకో కుదుర్చుకోవాలనుకుంటారు కాబట్టి మనం జీతం వెయ్యి రూపాయలూ ఇమ్మని పట్టుపడదాం. అందరూ అలా ఒకేరకంగా అడిగితే అదే జీతానికి ఒప్పుకుంటారు. ఒప్పుకున్నాక మెరిట్‌వున్న కాండిడేట్‌నే ఉద్యోగంలో చేర్చుకోటానికి అవకాశం వుంటుంది" ముగించాడు దయానిధి.

అతని నిర్ణయం అందరికీ ఆమోదయోగ్యం అయింది. అందుకు ముఖ్యకారణం ఆ మిగతా అయిదుగురి పెర్సంటేజ్ దయానిధి పెర్సంటేజ్‌కన్నా ఎక్కువ వుండటమే! మెరిట్



ప్రకారం అయితే ఎలాగూ ఆ ఉద్యోగం దయానిధికి రాదు. కనుక ఇందులో అతని స్వార్థం లేనట్లే.

ఇంటర్వ్యూ చకచకా కొనసాగింది.

ఇంటర్వ్యూలో ఆఖరి వ్యక్తి దయానిధి.

"నీ పేరు?" అడిగాడు ఇంటర్వ్యూ బృందంలోని ఒకరు.

"దయానిధి"

"మీరు ఈ ఉద్యోగం చెయ్యాలని ఎందుకు అనుకుంటున్నారు?"

"నాకు చిన్నప్పటినుంచి టీచింగ్ అంటే ఇష్టంసార్. ఆ ఇష్టాన్ని ఇంటిదగ్గర ప్రయివేట్ల ద్వారా తీర్చుకుంటున్నాను. మీరు ఉద్యోగం ఇస్తే అవన్నీ మానేసి వచ్చి ఈ కాలేజీకి రుణపడి వుంటాను"

"ఐ.సీ. మీరు శాలరీ ఎంత 'ఎక్స్‌పెక్ట్' చేస్తున్నారు?"

"నాకు ఉద్యోగం ముఖ్యంసార్... శాలరీ కాదు. మీరు ప్రస్తుతానికి అయిదువందలు ఇచ్చినాసరే జాయినయిపోతాను. నాకు టీచింగ్ అంటే చాలా ఇష్టంసార్!" చెప్పాడు దయానిధి.

ముందు వచ్చిన అయిదుగురు వెయ్యి రూపాయలు అడగడంతో ఆ ఉద్యోగం దయానిధికే ఖరారు అయింది.

కొల్లిమల్ల అప్పారావు

## పట్టుచీర

శిశిర వైవాహిక జీవితాన్ని గురించి ఎన్నో కలలు కంది. కానీ పెళ్ళై మూడేళ్ళు గడిచినా అందులో నగంకూడా నెరవేరే సూచనలే కనిపించలేదు. భర్తచేసే గుమాస్తాగిరీ అంటే ఆమెకు వళ్ళుమంట. ఎన్నిసార్లు ఎన్నెన్ని నూటిపోటి మాటలన్నా భర్త ఆవేం పట్టించుకోక నిమ్మకు నీరెత్తినట్లుంటాడు.

శిశిర ఆరోజే పుట్టింటినుండి వచ్చింది. వస్తూవస్తూ ఖరీదైన పట్టుచీర కట్టుకుని మరీ వచ్చింది. మొగుణ్ణి ఎద్దేవా చేయటానికి ఇదే అదననుకుంది.

"మన పెళ్ళై మూడేళ్ళయినా ఇలాంటి చీర మీరు కొన్నారా? దీని వెల రెండు వేల రూపాయలు"..... గర్వం తొణికిసలాడిందామె స్వరంలో.

"మా అన్నయ్యకున్నంత తెగువ మీకు లేదు. మీరొట్టి పిసినారి. చెల్లెలంటే మాఅన్న



య్యకు ఎంత ప్రేమ,మమకారం! మీకు అందులో ఆవగింజంతైనా లేదు గాక లేదు. ఛీఛీ... ఏం మనిషో- ఓవట్టు చీరక్కూడా గతిలేదు'' అంటూ అన్నను ఆకాశానికెత్తి భర్తను పాతాళానికి తొక్కేశాననుకుందామె.

మూర్తికి కోపం వచ్చింది.

పౌరుషం హెచ్చింది.

''చాల్చాలు! నువ్వింకేం చెప్పకు! మీ అన్నయ్యలాగా నేను జీవితంలో చెయ్యలేనన్నావు గదూ! నేను పిసినారినీ, ప్రేమలేనివాడినీ అన్నావు గదూ! నరే... మీ అన్నయ్యలా నేను చేయగలనో లేదో రేపు చూద్దువుగానీ'' అంటూ ప్రతిజ్ఞ చేశాడు.

'హమ్మయ్య! ఏదో విధంగా భర్తని రెచ్చగొట్టానుకదా' అని సంతోషించింది శిశిర.

మర్నాడు భర్త తేబోయే పట్టుచీరను ఊహల్లోనే కట్టుకుని మురిసిపోయింది. ఇరుగింటి వసంతతో, పొరుగింటి హేమంతతో ఎలా గొప్పలు చెప్పుకోవాలో కూడా రిహార్సల్స్ వేసుకుంది. పలవరింతలతో ఆరాత్రి గడిచిపోయింది. మర్నాడు ఉదయం ఎన్నడూ లేనంత తృప్తిగా సుష్టుగా భోంచేసి బయటి కెళ్ళాడు మూర్తి.

ఆసాయంత్రం మూర్తి తెచ్చే చీరకోసం వెయ్యికళ్లతో ఎదురుచూడసాగింది శిశిర.

క్షణాలు భారంగా గడుస్తున్నాయి. సాయంత్రం ఆఫీసు వదిలిన గంటన్నరకల్లా ఇంటికి వచ్చేశాడు మూర్తి. చేతిలో మూడువేల రూపాయలు పెట్టి కొన్న పట్టుచీర ఉంది. మూర్తి వెనకాలే అతని చెల్లెలు వచ్చింది ఇంట్లోకి. శిశిరను పిలిచి కుంకుమ భరిణె తెప్పించాడు. చెల్లికి పూలూ, కుంకుమా ఇచ్చి పట్టుచీర చేతిలో పెట్టాడు.

శిశిర నోరెళ్లబెట్టుకుని గుడ్లు మిటకరిస్తూ చూస్తుండిపోయింది.

మరికాస్సేపయ్యాక చెల్లెలితోకూడా వెళ్ళి ఆమెని వాళ్ళింట్లో దిగబెట్టి వచ్చాడు.

మూర్తి మహోత్సాహంతో

''శిశిరా! చూశావా! మీ అన్నయ్యలా నేను చెయ్యలేనన్నావు కదూ! చూడు- మీ అన్న నీకు పెట్టినట్టే నేనూ, మా చెల్లెలికి అంత కన్నా ఖరీదైనది పెట్టాను గదూ'' అంటున్న అతని వైపు నిర్వికారంగా చూడసాగింది శిశిర.

—వల్లంశెట్టి హనుమంతరావు



# మళ్లీ వస్తోన్న మట్టి ఇళ్లు

మెక్సికోలో క్రీ.శ. 1520 లో రాళ్లు, మట్టి, గార ఉపయోగించి కట్టిన పిరమిడ్.

అంతర్జాతీయ బాలల సంవత్సరం, అంతర్జాతీయ మహిళల సంవత్సరంలాగానే అంతర్జాతీయ గృహనిర్మాణ సంవత్సరం కూడా ఎటువంటి సత్ఫలితాలూ సాధించకుండానే గడచిపోయింది. ఫైవ్‌స్టార్ హొటళ్లలో బసచేసిన వివిధదేశాల ప్రతినిధులు, శాస్త్రజ్ఞులు ఇళ్ళు లేని వారి సమస్యల గురించి చర్చించి ప్రణాళికలు వేసి తమ పని అయిపోయిందన్నట్టుగా ఎవరిదారినవారు వెళ్ళిపోయారు. కాని కనీసావసరాల్లో ఒకటయిన గూడు లేక అల్లాడిపోయే జనం రోజురోజుకీ పెరిగిపోతూనేఉన్నారు. ఇర

కోట్లకు పైగా ఇళ్ల లోటు ఉంటుంది.

మనదేశంలో ఏటా మూడుకోట్ల, ఎనభై లక్షల టన్నుల సిమెంటు ఉత్పత్తి అవుతోంది. కానీ అందులో నలభైశాతం మాత్రమే మధ్యతరగతి ప్రజలు గృహనిర్మాణానికి ఉపయోగిస్తున్నారు. మిగతా అరవైశాతం సంపన్నుల భవనాలు, బ్రిడ్జిలు, ఆఫీసు భవనాలు కట్టడానికి వినియోగిస్తున్నారు. సిమెంటు ధర విపరీతంగా పెరిగిపోవటంతో సామాన్యునికి అందుబాటులో లేకుండాపోయింది.

నిర్మించడం అవసరం. ప్రస్తుతం దాదాపు 11 కోట్ల ఎనభై లక్షల ఇళ్లున్నాయి. అందులో ఏడుకోట్లకు పైగా మట్టి, గార ఉపయోగించికట్టినవే. గ్రామీణ ప్రాంతాల్లో తొంభైశాతం, పట్టణప్రాంతాల్లో ముప్ఫయినుండి నలభైశాతంవరకూ మట్టితో కట్టిన ఇళ్ళున్నాయి. మట్టితో తయారయిన ఇటుకలు, గార ఉపయోగించి, రెండు మూడు అంతస్తులు గల ఇళ్ళుకూడా పటిష్ఠంగా కట్టవచ్చునని భవననిర్మాణ నిపుణులు అభిప్రాయపడుతున్నారు. మట్టితో కట్టిన ఇళ్ళు తొందరగా బీటలువారడం, వానాకాలంలో పైకప్పునుండి నీళ్ళు కారటం జరుగుతుందని అనుకుంటారు. కానీ శ్రేష్ఠమైన ఇటుకలు, గారతో కట్టిన ఇళ్ళు సిమెంటుతో కట్టిన భవనాలంత పటిష్ఠంగానూ ఉంటాయి. ఇటుకల నాణ్యత అవి తయారుచేయబడిన మట్టి

*ఆఫ్రికాలో క్రీ.శ. 14 వ శతాబ్దంలో మట్టితో కట్టిన మసీదు.*





ఎమెన్‌లో మట్టితో కట్టిన ఓ భవంతి.

మీద,ఆ ప్రాంతపు వాతావరణం మీద ఆధార పడివుంటుంది. అందువల్ల ఇటుకలు తయారుచేసేముందు, వాటికి ఉపయోగించబోయే మట్టిని ప్రయోగశాలల్లో పరీక్ష చేయించి అది అనువయినదీ, కానిదీ తెలుసుకుంటారు.

మట్టి దాదాపు 10,000 సంవత్సరాలనుండి మనిషికి అనేక విధాలుగా ఉపయోగపడుతూనే ఉంది. గృహనిర్మాణం దగ్గరనుండి అనేక గృహోపకరణ వస్తువులు, బొమ్మలు తయారుచేయడంలో మట్టిని ఉపయోగిస్తూనే ఉన్నారు. ఎండాకాలంలో ఫ్రిజ్‌లు ఉన్నవాళ్లయినా మట్టికూజాలోని నీళ్లకోసమే ఆరాటపడతారు. గతకొన్ని దశాబ్దాలుగా సిమెంటు, ఉక్కు ఉపయోగించి ఇళ్ళుకట్టడంతో మట్టి విలువను దాదాపు అందరూ మరచిపోయారు.

గురించి ప్రజలు తెలుసుకుంటున్నారు. మొదటిసారిగా 'మట్టి' గురించి అంతర్జాతీయ సదస్సులు నిర్వహిస్తున్నారు. ఇటీవల త్రివేంద్రంలో మట్టిఇళ్ల నిర్మాణాన్ని గురించి అంతర్జాతీయ సదస్సు జరిగింది. అందులో పాల్గొన్న శాస్త్రజ్ఞులు, నిపుణులు మట్టి ఇళ్ల ప్రాశస్త్యాన్ని గురించి వివరంగా చర్చించడమే గాక, అందమయిన పరిసరాల్లో అధునాతనంగా నిర్మించిన మట్టి ఇళ్లను విడియో కాసెట్ల

కనీసం ఇప్పటికయినా మనచుట్టు అనామకంగా పడివున్న మట్టి విలువను మనం తెలుసుకోగలగడం సంతోషించాల్సిన విషయం.

ఈజిప్టులో బ్రహ్మాండమైన పిరమిడ్లు, మెసపుటేమియాలోని గొప్ప గొప్ప కట్టడాలు, వంతెనలు అన్నీ మట్టిగారతో కట్టినవే. ప్రపంచవింతల్లో ఒకటయిన 'గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా' కూడా చాలా వరకు మట్టితోనే నిర్మించారు. ముస్లిమ్ ప్రవక్త మహమ్మద్ స్వయంగా మదీనాలో

ఇటలీలో రెండువేల సంవత్సరాల క్రితం రాళ్లు, మట్టి, గార ఉపయోగించి కట్టిన స్నానవాటిక.



మట్టితో మసీదును నిర్మించాడు. ప్రపంచంలో మట్టికట్టడాలు లేని దేశం ఏదీ లేదంటే ఆశ్చర్యంలేదు. ఇక మనదేశంలో ఢిల్లీలో చాలావరకూ మట్టితో కట్టిన ఇళ్ళే ఉన్నాయి. గాంధీజీ సేవాగ్రాంలో మట్టి ఇంట్లోనే నివసించేవారు. కలకత్తా వద్ద జరిగిన కాంగ్రెస్ సమావేశాలలో పాల్గొన్నప్పుడు ఇందిరాగాంధీ కోసం ప్రత్యేకంగా మట్టితో కుటీరాన్ని నిర్మించారు. అరిజోనా, మెక్సికో, కాలిఫోర్నియాల్లో ఉన్న సంపన్నులు కూడా మట్టి ఇళ్లపై మోజుపడటం విశేషం. అమెరికా మాజీప్రధాని రోనాల్డ్‌రీగన్ కాలిఫోర్నియాలోని తన రాంచ్‌లో అన్నీ మట్టికట్టడాలే కట్టించాడు. ఇటీవల ఈ మట్టికుటీరాల మోజు ఎంతగా పెరిగిపోయిందంటే గోవాలో స్టార్ హొటల్స్‌లో కంటే కూడా బీచ్‌లో నిర్మించిన అందమయిన మట్టి కుటీరాల్లో నివసించడానికే విదేశీయులు ఎంతో ఇష్టపడుతున్నారు.

వర్షియాలో క్రీ.పూ. 13వ శతాబ్దంలో మట్టి, ఇటుకలు ఉపయోగించి కట్టిన మెట్లగది.





*బర్మాలో క్రీ.శ. 1218 లో మట్టి, ఇటుకలు ఉపయోగించి కట్టిన గుడి ముఖద్వారం*

1981 అక్టోబర్ లో మొట్టమొదటిసారిగా పారిస్‌లో మట్టి ఇళ్ళ ప్రదర్శన ఏర్పాటయింది. దాదాపు 20 కోట్ల మట్టి ఇళ్ళు ఉన్న భారత, చైనా దేశాలు ప్రదర్శించిన ఇళ్ళు మాత్రం చాలా తక్కువ సంఖ్యలో ఉండటం విశేషం.

మట్టి ఇళ్ళు మనదేశంలోని ఇళ్ల సమస్యను ఒక్కరోజులో అద్భుతంగా మాయం చేసేస్తాయని కాదుగానీ సరయిన పద్ధతిలో వినియోగించుకుంటే ఆ సమస్య కొంతవరకు తగ్గించవచ్చునే ఆశించవచ్చు. మనదేశంలో కాశ్మీర్ మొదలు కన్యాకుమారి వరకూ అనేక నమూనాల్లో మట్టితో కట్టిన ఇళ్లను చూడవచ్చు.

— సౌరలత

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 2. | Periodicity of its Publication | : | Monthly |
| 3. | Printer's Name | : | **RAMOJI RAO** |
| | Whether citizen of India. | : | Yes |
| | If foreigner, state the country of origin | : | — |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 4. | Publisher's Name | : | **RAMOJI RAO** |
| | Whether citizen of India. | : | Yes |
| | If foreigner, state the country of origin | : | — |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 5. | Editor's Name | : | **RAMOJI RAO** |
| | Whether citizen of India. | : | Yes |
| | If foreigner, state the country of origin | : | — |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 6. | Names and address of Individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS.**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 1989

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500 016, TEL: 229428 CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500 482.

# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడీకాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.పి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లక్ష్మీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్.రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూరోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావు పేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత !**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత !!**

మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిస్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

